# బొనీ మిక్స్®

## తక్షణం తయారయ్యే క్రొత్త పోర్రిడ్జ్
## చిరుధాన్యములు, పళ్లు మరియు జీడిపప్పులోని మంచి గుణములతో నిండినది.




బొనీ మిక్స్.
గోధుమ, మొక్కజొన్న,
బియ్యము, కొబ్బెర,
ఆపిల్, ఖర్జూరము, ఎండుద్రాక్ష,
జీడిపప్పుల అద్భుతమైన,
పుష్టికరమైన మేళవింపు.

పాల్గ
ఐదుగుర ...లాలికే
సమానం ... — ప్రతి
బహువ ... కోసం
ఎని ...బొనీ మిక్స్. మంచి పోషణ
శక్తితో కూడిన పోర్రిడ్జ్
(జావ). కుటుంబంలో
అందరికీ శ్రేష్ఠమైనది.
ఫలహారంగా లేదా ఆఫీసు,
బడి నుంచి తిరిగి వచ్చాక
సాయంత్రం పూట తినడానికి
అనుకూలమైనది. ఉత్తమమైనది.
...లభంగా జీర్ణమవుతుంది, కనుక,
...లలకు, ...బ్బునుంచి కోలుకొంటున్న
...రికీ ఎంతో శ్రేష్ఠమైనది.

**నిమిషాల్లో తయారు!**
బొనీ మిక్స్‌ను సులభంగా, త్వరగా
తయారు చేయవచ్చు.
పని హడావిడిలో వుండే గృహిణులకిది
నిజంగా గొప్ప వరం.




ఒక చిన్న గిన్నెలో
కావలసినంత బొనీ
మిక్స్‌ను
వేయండి.




ముందుగా కాచివుంచిన
పాలను తగినంతగా
తీసుకొని, నెమ్మదిగా
దానితోపాటు కలపండి.




మృదువైన జావ
తయారయ్యేలా
మెత్తగా కలపండి.




ప్రతి చెంచాలో
మీకుటుంబానికి
రుచికరమైన
ఆనందం!

అవును, మీ కుటుంబంలో అందరికీ
క్రొత్త రుచులతో కూడిన అద్భుత
పోషణ ఇవ్వండి. వారికి ఇవ్వండి
బొనీ మిక్స్.




# బొనీ మిక్స్®

**భారతదేశంలో మొట్టమొదటి సారిగా!**

**గ్లిండియా లి. నుంచి (మునుపటి గ్లాక్సో)**

కుటుంబ ఆహారాలలో అత్యంత విశ్వసనీయమైన పేరు.

14-7-1989
విడిప్రతి వెల రు. 4-00

# ఆంధ్ర సచిత్ర వార పత్రిక

సంపుటము 81 స్థాపితం 1908 బొంబాయి : 1914 మద్రాసు సంచిక: 47

విజయవాడ వ్యవస్థాపకులు దేశోద్ధారక కాశీనాథుని నాగేశ్వరరావుపంతులుగారు శ్రీ శుక్లనామ సం. ఆషాఢ శు.ఏకాదశి

(1938-1972 సంపాదకులు) శివలెంక శంభుప్రసాద్

ఎడిటోరియల్ అడ్వయిజర్: శివలెంక రాధాకృష్ణ ఎడిటర్: వీరాజీ

ముద్రాపకుడు, ప్రచురణకర్త : శివలెంక నాగేశ్వరరావు

ఆంధ్రపత్రిక ప్రెస్, గాంధీనగరం, విజయవాడ-3, ఫోన్లు: 75667, 61247, 61248

## మనలోమాట

ఆంధ్రసచిత్ర వార పత్రికలో వైవిధ్యం కోరే పాఠకులు చిన్న చిన్న ఇంటర్వ్యూలనే ఇష్టపడతారు- అందుకే విద్యామంత్రి శ్రీమతి యెర్నేని సీతాదేవితో ఇంటర్వ్యూను ముఖ్యమైన అంశాలమీదనే కేంద్రీకరించి వేస్తున్నాము. విద్యార్థులలో అశాంతి మీద చాలా మంది విద్యా సంస్థల ప్రిన్స్‌పాల్స్ తమ తమ అభిప్రాయాలను మా పాఠకులకు కొంత కాలంగా అందజేశారు. వాల్తేరు ఆంధ్రా యూనివర్శిటీ వి.సి. కూడా గతవారం ఈ అంశం మీద తమ ఆలోచనలను పాఠకులతో పంచుకున్నారు. ఈ సారి విద్యార్థులలో అలజడిమీద రాష్ట్ర విద్యామంత్రి మాట్లాడు తున్నారు. స్కూళ్లు, కాలేజీలు తెరిచారు. ప్రయివేటు సంస్థల్లో డొనేషన్లు-ప్రభుత్వ సంస్థల్లో సీట్లు దొరకని స్థితి; మామూలే! యువలోకం కూడా (విద్యార్థులలో అశాంతి) యీ అంశంమీద ఇప్పుడాలోచించాలని మా మనవి- కార్డుమీదకాని యిన్‌లాండ్ కవరుమీదకాని పది వాక్యాలు మించకుండా మీ అభిప్రాయం రాయండి- అయితే వైవిధ్యంవున్న అభిప్రాయాలనే వెయ్యగలుగుతాము- ఒకే అభిప్రాయం పంపిన వారిలో బాగా పొందికగా రాసిన వారివి వేయడం ధర్మంకదా!- పూర్తి చిరునామా వ్రాయాలి మరిచిపోకండి. యువతీ యువకులు యీసారి మరొకరి వోటు గాక తమ వోటు తామే వేయగల స్థితి వచ్చింది. జాగ్రత్త! జాగ్రత్త!

## తెలుగువారి నిరంతర సేవలో మాకిది 81వ సంవత్సరం

## పదండి తోపత్రిక!



ముఖచిత్రం: "టార్జాన్"లో వేషం అయినా 'మూర్ఖహౌన్'వేషమైనారెడీఅంటున్న 'కిమీకాట్కర్' (ఫొటో: జగ్‌మోహన్)

పై వారం : డా. సి.నా.రె.తో ప్రత్యేక ఇంటర్వ్యూ!

### ఈ వారం ప్రత్యేకం:-

ఆంధ్ర సచిత్ర వారపత్రిక

ఒరులేయవి యొనరించిన నరవర యప్రియము తన మనంబున కగు దా నొరులకు నవి సేయకునికి పరాయణము పరమ ధర్మపథములకెల్లన్

# పవర్ కట్ ఎత్తేస్తారుట కాని...

వర్షాలు వడ్డాయి - హర్షాలు రెచ్చాయి - రిజర్వాయర్లు నిండాయి - బుడుగో బుడుగోమంటూ - రకరకాల అంధకారంలో మ్రగ్గిపోతున్న ఆంధ్రప్రదేశ్ జనుల హృదయాలు ఆనందాతిరేకాన్ని పొందుతున్నాయి! శీతాకాలంలోనే క్రమ్ముకున్న కారుచీకట్లు ఈ జులై 15 నుంచి విద్యుత్ రంగంలో తొలగిపోతాయన్న యీ సూచనలు - కుంటి నడకలు నడుస్తున్న పరిశ్రమలకి కొంత 'తెరపి'ని, ఊరటను కలిగిస్తున్నాయి. ఆంధ్రప్రదేశ్‌లో ఏటా వరుణదేవుడు కనికరించనిదే - విద్యుత్ కోతకి మోక్షం రాదు. అన్నిచోట్లా వరుణదేవుడు కరుణించి - ముఖ్యంగా ఎగువ భారతదేశంలో - వాయుదేవుడు సహకరించితే వరద దేవుడు ఉగ్రరూపం దాల్చి తాండవమాడుతాడు కాని, మనకి మాత్రం శ్రీశైలం రిజర్వాయర్లో నీటిమట్టం పెరిగింది. మరికొన్ని యూనిట్‌లు పనిచేసి విద్యుచ్ఛక్తి సప్లయి మెరుగవుతుందన్న ఆశ కూడా కనపడుతున్నది - జూన్ నెలాఖరులో విద్యుచ్ఛక్తి తయారీకి సంబంధించి మరికొన్ని ఆశావహమైన సంఘటనలు జరిగాయి. వీటిలో రిజర్వాయర్ నీటిమట్టాల పెరుగుదల ఒకటి - అదీగాక విజయవాడ థర్మల్ పవర్ యూనిట్ రెండోదశ అనుకున్న కన్నా రెండు నెలలు ముందే - యీ సెప్టెంబర్ నాటికి పూర్తయి 210 మెగావాట్‌ల శక్తిని ఉత్పత్తి చేయగలుగుతుందని ఆంధ్రప్రదేశ్ విద్యుచ్ఛక్తి బోర్డు చాలా ఆర్భాటంగా ప్రకటించింది. "హై టెన్షన్" రంగంలో అరవై శాతం కోతకి - లో టెన్షన్ పవర్ సప్లయిలో 30 శాతం "కట్"కి గురియై "టెన్షన్"లో క్రుంగిపోతున్న మన రాష్ట్రానికి ఇటువంటి వార్తలు - మండు వేసవిలో పన్నీటి జల్లు లాగా ఆహ్లాదకరంగానే ఉంటాయి. దీనికి తోడుగా గోదావరీ నదీమాత ఒడిలో 'విజ్జేశ్వరం' దగ్గర "గ్యాస్ టర్బయిన్"ల విద్యుత్ ప్రాజెక్ట్ కూడా సిద్ధమైందన్న వార్త కూడా అదే సమయంలో రావడంతో తెలుగువాడికి - "యిబ్బడి ముబ్బడి"గా విద్యుత్ తరంగామృతం నిత్యకల్యాణమై - పచ్చతోరణమై లభిస్తుంది కాబోలు అనే పేరాశ కలగటం సహజం ! కాని యీ పథకాల ద్వారా లభించే వందా రెండువందల మెగావాట్‌ల శక్తి ఉత్పత్తి మన రాష్ట్రంలో ఏటా పెరుగుతున్న అవసరాల దాకా ఎందుకు ? - వున్న కొరతనైనా పూర్తిగా ఆదుకోలేదు.

ఆంధ్రప్రదేశ్‌లో 'శక్తి' అవసరం -ఉత్పత్తి ఇప్పటికే 54:45 నిష్పత్తిలో ఉండగా - ఏటా విద్యుత్ అవసరం పెరుగుతూనే వున్నది - ఇంటికో దీపం, ఊరికో 'పంఖా' లాంటి నినాదాల వల్ల ముఖ్యమంత్రి గారు తరచుగా పేర్కొనే "సగటు మనిషి" ఆకర్షితుడవుతాడేమో గాని - పరిశ్రమల రంగంలో యిటువంటి నినాదాలు పెగటు కూడా పుట్టిస్తాయి !

ఆంధ్రప్రదేశ్ రాష్ట్ర విద్యుత్ సప్లయి సంస్థవారి తాజా అంచనా ప్రకారం మన రాష్ట్రంలో ఏటా కనీసం 400 నుంచి 500 మెగావాట్‌ల శక్తి అదనంగా అవసరం అవుతుంది ! కాని ఏడవ ప్రణాళికాంత సమయానికి మన ఉత్పత్తి శక్తి ఎంత ? అని లెక్కలు తీసుకున్నప్పటికీ (అనగా 1990 మార్చి అంతానికి) 975 మెగావాట్‌ల శక్తి మాత్రమే ఉత్పత్తి అవుతుందని ఏ. పి. ఎస్. ఇ. బి. వారే అంటున్నారు. ఏటా పది శాతం విద్యుత్ అవసరం పెరిగే రాష్ట్రం మనది. ఈ విధంగా సప్లయి గూడా అందితే అగ్ర తాంబూలం, ఉగ్రతాంబూలం వగైరాలు అందుకునే ప్రయత్నం మన పారిశ్రామిక వేత్తలు కూడా చేయగలరు. కాని ఇప్పటి ఉత్పత్తి శక్తిలోనే 60 నుంచి 70 శాతం "పవర్"కి మనం వర్షాలమీద ఆధారపడుతున్నాం - రేపటి ప్రగతి కోసం పంచరంగుల కలలు కనలేము.

మన రాష్ట్రంలో మొత్తం ఉత్పత్తి అవుతున్న విద్యుచ్ఛక్తి 3,600 మెగావాట్‌లు అయితే అందులో 2,400 మె. వా. ల 'శక్తి' మనకి జలవిద్యుచ్ఛక్తి ఉత్పత్తి రంగం నుంచే అందాలి - అంటే "థర్మల్ పవర్" మీద మనం ఎంత శీతకన్ను వేసి వున్నామో అర్థం అవుతుంది - నేషనల్ థర్మల్ పవర్ కార్పోరేషన్ వారి ద్వారా మనకి అందే వాటా కూడా - వారి ఉత్పాదనలో నాలుగవ వంతు మించి వుండకపోవటంతో రానున్న సంవత్సరాలు ఆంధ్రప్రదేశ్‌కి గడ్డు రోజులే గాని ఆశాజనకాలు కావు - అయితే సందు మలుపు దాకా మాత్రం చూసే "సగటు మనిషి"కి - విజయవాడలో "రెండు నెలలు ముందే ఉత్పత్తి ప్రారంభం అయింది" - "విజ్జేశ్వరంలో గ్యాస్ నుంచి కరెంట్ మొదలయింది" - "కొత్తగూడెంలో మరి రెండు బోయిలర్‌లు ముట్టించారు" లాంటి వార్తలు హృదయ భారాన్ని మాత్రం తగ్గించి కొంత వూరట కలిగిస్తాయి !

ముందు టేడు వానలు ఊరూ, వాడా ఏకంచేస్తూ పడలేదా ? అయినా నిరుడు మరీ ముందుగానే "పవర్ కట్" అనే గొడ్డలిపెట్టు ప్రగతి నెత్తిమీద పడలేదా ? దీనికిది గాదు మార్గం - యీ అవస్థకి ఇదిగాదు మందు - అవసరమయినన్ని థర్మల్ పవర్ స్టేషన్‌లను - గ్యాస్ పవర్ ప్రాజెక్టులను అత్యవసర ప్రాతిపదిక మీద తయారు చేసుకోవాలి. ఏ. పి. ఎస్. ఇ. బి. వారు ఇప్పటికే కొన్ని ప్రాజెక్టులు చూపించి, వీటికి కేంద్రం నిధులు కేటాయించాలి అంటున్నారు. ఈ కబుర్ల వల్ల పనులు సానుకూలం కావు - ఎనిమిదో ప్రణాళికాంతానికైనా మన రాష్ట్రంలో విద్యుత్ "కాటకం" అంతమవ్వాలీ అంటే దాని కోసం నడుం కట్టి కదలవలసిన తరుణం మళ్లీ ఎండాకాలం కాదు - ఇప్పుడే, ఇవాళే, ఈ క్షణమే ! "విజయవాడలూ" - "విజ్జేశ్వరాలూ" చాలా కావాలి - ఎలా సంపాదిస్తారన్నది ప్రజలను మభ్యపెట్టి - మత్తుజల్లి - మాయజేసి - ఓట్లు గుంజుకొని గద్దెనెక్కిన నాయకులే చూసుకోవాలి - లేదా యీ శతాబ్దాంతానికి మనం 21వ శతాబ్దిలోకి అడుగు పెట్టకుండా చీకట్లోనే ఉండిపోతాం ! ●

# విద్యారంగంలో ప్రతిభకే పెద్దపీట

**ఆంధ్రప్రదేశ్ విద్యాశాఖ మంత్రిణి శ్రీమతి యెర్నేని సీతాదేవి మంత్రి పదవి చేపట్టి కొంచెం కాలమే అయినా, అతి త్వరగా ఆ శాఖ వ్యవహారాలను ఆకళింపు చేసుకుని చురుకుగా ముందుకు సాగిపోతున్నారు. ఆమెతో వీక్లీ పాఠకుల కోసం కొంత సేపు జరిపిన సంభాషణలలోని ముఖ్యాంశాలను యిక్కడ పొందుపర్చుతున్నాము.**

**-ఎడిటర్**

విద్యార్థిలోకంలో పేరుకున్న అశాంతిని గురించి విద్యామంత్రి శ్రీమతి యెర్నేని సీతాదేవిని ప్రశ్నించినపుడు తడుముకోకుండా, ప్రతిభకు తగినంత ప్రాధాన్యత లభించని కారణంగానే విద్యార్థి లోకంలో అశాంతి పేరుకుందని ఆమె స్పష్టంగా చెప్పారు.

ప్రతిభ గల విద్యార్థులకు ఎక్కువ సౌకర్యాలు కల్పించి సమాజం పట్ల అవగాహన గల వారిగా వారిని తీర్చిదిద్దటానికి ప్రయత్నం చేస్తున్నామని ఆమె తెల్పుతూ, విద్యార్థి వేతనాల చెల్లింపు సక్రమంగా జరగటం లేదని, ఆరునెలల కొకసారి, నిధులు విడుదల చేయటం వలన విద్యార్థులకు అసౌకర్యం కలుగుతున్నదని నిజంగా ప్రతిభ గల విద్యార్థులకు కొన్ని సందర్భాలలో అన్యాయం జరుగుతుందని, ఒకే విద్యార్థి ఒక్కసారే 3, 4 సంస్థల నుండి విద్యార్థి వేతనం పొందుతున్నాడని, ఇటువంటి అవకతవకల వల్ల కూడా విద్యార్థి లోకంలో అశాంతి పేరుకున్నదని, ఈ విషయంపై సమగ్రమైన దర్యాప్తు జరపటానికి సభా సంఘాన్ని వేశామని, విద్యార్థి వేతనాల సక్రమ పంపిణీకి తగిన చర్యలు తీసుకుంటున్నామని శ్రీమతి సీతాదేవి చెప్పారు.




## ఆర్ట్స్ కళాశాలలు

ఆర్ట్స్ కళాశాలలకు గ్రంథాలయ నిధులు ఎక్కువగా ఇస్తున్నామని, సాంకేతిక కళాశాలలకు గ్రంథాలయ నిధులు తక్కువగా అందుతున్నాయని ఈ తేడాను సవరించి అన్ని విద్యాలయాలలో గ్రంథాలయ సౌకర్యాలను మెరుగుపరిచి, విద్యార్థుల ఖాళీ సమయాన్ని దుర్వినియోగపరచకుండా గ్రంథాలయంలో గడిపేదానికి చర్యలు తీసుకుంటున్నామని చెప్పారు

## మేనేజిమెంట్ కోర్సులు

ప్రస్తుతం మేనేజిమెంటు కోర్సు పట్ల విద్యార్థులు ఎక్కువ ఆసక్తి కనబరుస్తున్నారని సాంకేతిక విద్య నభ్యసించిన వారు, మెడికల్ గ్రాడ్యుయేట్లు, మిగిలిన వివిధ కోర్సులు చదివిన వారు కూడా తమ భవిష్యత్ జీవిత వృత్తులలో యం. బి ఏ డిగ్రీని ప్రాముఖ్యంగా భావిస్తున్నారని, అయితే అటువంటి వారికి తగిన సౌకర్యాలు ప్రస్తుతం లేవని అందుచేత ప్రత్యేకంగా 'ఇనిస్టిట్యూట్ ఆఫ్ మేనేజ్‌మెంటు'ను స్థాపించటానికి 89-90 విద్యా సంవత్సరం నుండి ప్రారంభించటానికి చర్యలు తీసుకుంటున్నట్లు ఆమె చెప్పారు.

## "సైన్సు" లేని స్థితి

ప్రస్తుతం ఉన్న 140 ప్రభుత్వ డిగ్రీ కళాశాలలలో 70 కళాశాలలలో సైన్సు సబ్జెక్టుల్లేవని, అవే కాకుండా విద్యార్థులు కోరుకున్న కాంబినేషన్లలో కోర్సులు లేవని, సంప్రదాయబద్ధంగా, మొక్కుబడి కాంబినేషన్లే తప్ప, ఆధునికమైన కోర్సులకు సంబంధించిన అప్లైడ్ మాథ్స్, డైరీ సైన్సెస్, కేటరింగ్ వంటివే కాకుండా ఫిలాసఫీ, సైకాలజీ వంటి కోర్సులు కూడా ఎక్కువగా లేవు ఉన్నా తగిన విధంగా




అధ్యాపకులు లేరని, విద్యార్థులు కోరుకున్న కాంబినేషను లేకపోవటం కూడా విద్యార్థి లోకంలో అశాంతికి కారణమవుతున్నదని దీనిని సరిచేయటానికి తగిన చర్యలు తీసుకుంటున్నామని ఆమె చెప్పారు

ఆర్థికంగా వెనుకబడిన విద్యార్థులకు హాస్టల్, మెస్ మొదలగు వసతి సౌకర్యాలు సరిపోవటం లేదని ఆమె చెప్పారు.

## తెలంగాణా ప్రాంతం

తెలంగాణా ప్రాంతంలో ఎక్కువ భాగం, మిగిలిన రాష్ట్రంలో కొంత భాగం ప్రభుత్వ పాఠశాలలు అధ్వాన్న స్థితిలో ఉన్నాయని అందుచేత పాఠశాల విద్యనంతా ఒకే యాజమాన్యం క్రిందకు తీసుకు రావాలన్న ఆలోచన పునఃపరిశీలనలో వున్నదని, అధ్యాపకులు మారుమూల గ్రామ ప్రాంతాలలో పని చేయటానికి ముందుకు రాకపోవటం వలన ప్రభుత్వ పాఠశాలల స్థితి ఆవిధంగా ఉన్నదని ఆమె పేర్కొంటూ అటువంటి చోట్ల ఫెయిల్యూర్ కాండిడేట్లకు శిక్షణ ఇస్తే బాగా పని చేస్తున్నారని ఆమె చెప్పారు.

పోస్టుగ్రాడ్యుయేట్ కోర్సులలో తగినన్ని సీట్లు లేకపోవటం వలన మన రాష్ట్రంలో గ్రాడ్యుయేషన్ పూర్తి చేసి ఉన్నత విద్య నభ్యసించతలచిన వారికి అసౌకర్యంగాలేదా అన్న ప్రశ్నకు సమాధానమిస్తూ పి జి కోర్సుల నిర్వహణ ప్రభుత్వం చేపట్టలేదని ఆ కార్యక్రమం విశ్వవిద్యాలయాలే చేపట్టాలని, ప్రైవేటు కళాశాలల్లో ఉన్న పి. జి కోర్సులకు గ్రాంట్-ఇన్-ఎయిడ్ ఇచ్చే విషయం పరిశీలిస్తామని చెప్పారు ఆవిధంగా పి. జి కోర్సులలో సీట్ల కొరత కొంత వరకు తీర్చడానికి ప్రయత్నం చేస్తామని అన్నారు

## వృత్తి విద్య

వృత్తి విద్యకు సంబంధించినంత వరకు సరి అయిన బోధనా సిబ్బంది కొరత విద్యార్థుల కొరత వున్నదని, అయితే సరిగ్గా ఆ కోర్సులకు కావలసిన నిధులు సమకూర్చి, సౌకర్యాలు కలిపిస్తే ఈ పథకం బాగా విజయవంతం కాగలదని వచ్చే సంవత్సరం నుండి దానిని క్రమబద్ధం చేయటానికి ప్రయత్నం చేస్తున్నామని అన్నారు

డిగ్రీ కళాశాలలకి ఇచ్చే నిధుల వినియోగం గురించి, వర్క్‌లోడ్ విషయం గురించి ప్రత్యేకమైన సంఘాలను వేస్తున్నామని చెప్పారు.

దృశ్య, శ్రవణ విధానాల ద్వారా విద్యా వ్యాప్తికి తగినన్ని చర్యలు తీసుకుంటున్నామని, కొన్ని లోపాలు ఉన్నప్పటికి తగినంత ప్రగతిని సాధిస్తున్నామని, క్యాసెట్లు ఆకర్షణీయంగా తయారు చేసి, తద్వారా విద్యార్థులలో జిజ్ఞాసను పెంచటానికి ప్రయత్నం చేస్తున్నామని చెప్పారు

ఇన్‌స్టాంట్ పరీక్షలు గురించి మాట్లాడుతూ, కొంచెం శ్రమతో కూడుకున్నప్పటికీ, ఒకటి లేదా రెండు మార్కులలో పరీక్ష తప్పిన వారు నిరాశా, నిస్పృహలకు లోనుకాకుండా విద్యా సంవత్సరం కోల్పోకుండా చేసేందుకు ఈ పరీక్షలు నిర్వహిస్తున్నట్లు చెప్పారు. ●

# విద్యామంత్రితోయింటర్వ్యూ

- డా. యార్లగడ్డ లక్ష్మీప్రసాద్

# పరుగుపందెం

## వీరపల్లె వీణావాణి



సాయంత్రం ఆరు గంటలవుతోంది. వచ్చి పోయే మనుషుల్తోనూ, వాహనాల్తోనూ ఆ బజారు చాలా రద్దీగా వుంది. అంతా గోల గోలగా వుంది. బట్టల కొట్లు మొదలుకొని వెచ్చాల కొట్లు వరకు అన్నీ ఆ వీధిలోనే వుండడం చేత.... ఆ వీధి సాయంత్రం అయ్యేసరికి జనంతో నిండిపోతుంది.

ఏ ఇద్దరు కలిసి మట్లాడుకోవాలన్నా ఆ నడిరోడ్డు మీద ఒక్క క్షణం కూడా వీలు పడదు. జనాభా అభివృద్ధి విషయంలో భారతదేశం ఎంత ప్రగతిని సాధించగలిగిందో... ఆ జన ప్రవాహాన్ని పరిశీలించి చూస్తే ఎవరికైనా యిట్టే తెల్సిపోతుంది.

"ఆ.... ఇంకేమండీ రామనాధంగారూ! యింకేమిటి సంగతులు. చెప్పండి మరి"

"తమరే చెప్పాలి రామారావ్ గారూ! యిప్పుడెక్కడ వర్క్ చేస్తున్నారు?"

"బి. టి. కాలేజ్ మదనపల్లిలో. మీరు నెల్లూరు వి. ఆర్. కాలేజీలోనే కదా?"

"అవునండీ అక్కడే" సిగరెట్ వెలిగించుకుంటూ చెప్పాడు రామనాధం.

"ఎలా వుందక్కడ మీ ఇంగ్లీష్ డిపార్ట్‌మెంటు?" అడిగాడు రామారావు.

"ఏవుందండీ మామూలే."

"యింతకీ తిరుపతికి ఏం పని మీదొచ్చారు?" రామారావు అడిగాడు.

"డిగ్రీ సెకెండియర్ స్పాట్ వ్యాల్యుయేషనుంటేనూ" చెప్పాడు రామనాధం.

"యింకా ఎన్నాళ్లు పడ్తుంది?"

"మొదలయింది మొన్ననేనండీ! యింకా పదిహేన్రోజులు పట్టొచ్చు"

ఆ తర్వాత వాళ్లు తమకి రావల్సిన డి. ఏ ఎరియర్స్ గురించి, పెరగవలసిన తమ జీతాల గురించి చర్చించుకున్నారు.

"అన్నట్టు స్పాట్ వ్యాల్యుయేషన్ మీకు రాలేదాండీ?" అడిగాడు రామనాధం.

"మాది తెలుగు బోర్డు కదండీ! మీ యింగ్లీష్ అయిపోయాక మా బోర్డు బిగిన్ కావచ్చు. రామనాధంగారూ! యిక నే వెళ్తానండీ బస్‌కి టైమైపోయింది"

"మంచిదండీ"

రామారావు శెలవు తీసుకుని అక్కడ్నుంచి బస్టాండు వైపు వెళ్లిపోయాడు. ఆ రోడ్డు ఫుట్‌పాత్ మీద రామనాధం ఒంటరిగా మిగిలిపోయాడు.

తన రూంలో సోప్ అయిపోయిన విషయం గుర్తుకు రావటంతోటే సోప్ కొనుక్కుందామని అక్కడే తన పక్కనే వున్న ఫ్యాన్సీ షాప్ వేపు తిరిగాడాయన.

ఆ షాప్‌లోకి రామనాధం ఓ అడుగు వెయ్యబోతుంటే.... షాప్‌లో కౌంటర్ దగ్గరున్న ఆ పాతికేళ్ల యువకుడు రామనాధాన్ని చూసి చటుక్కున పైకి లేచాడు.

"నమస్కారం రామనాధం మాస్టారూ" అంటూ ఆ యువకుడు నమస్కారం చేశాడు.

రామనాధం ప్రతి నమస్కారం చేస్తూ ఆ యువకుని వేపు ప్రశ్నార్థకంగా చూశాడు.

"బావున్నారా సార్?"

"ఆ" తలాడించాడు రామనాధం.

"ఒరే పాండూ! ఆ కుర్చీ యిలా పట్రా" అంటూ ఆ యువకుడు వర్కర్‌తో చెప్పాడు.

వెంటనే ఆ వర్కర్ ఓ కుర్చీ పట్టుకొచ్చి కౌంటర్ ముందు తివాచీపై వేశాడు.

"కూర్చోండి సార్"

రామనాధం కూర్చున్నాడు.

"ఏ తీసుకుంటారు సార్! టీయా కాఫీయా?" అడిగాడు ఆ యువకుడు.

"అబ్బే ఏమొద్దు"

"భలేవారు సార్! ఒరేయ్ పాండూ! ఓ స్పెషల్ టీ అర్జంట్‌గా పట్రా" వర్కర్‌తో చెప్పాడా యువకుడు.

పాండు అనే వర్కర్ ఎదురుగా వున్న రాజస్థాన్ టీ స్టాల్ వేపు వేగంగా వెళ్లిపోయాడు.

రామనాధం బుర్రలో కందిరీగల్లా ఆలోచనలు ముసురుకుంటున్నాయి.

ఎంత ప్రయత్నించినా రామనాధానికి ఆ యువకుడెవరో గుర్తుకు రావడంలేదు.

"ఏమిటి సార్ విశేషాలు?"

ఏం చెప్పాలో తెలియక ఆ యువకుని వేపు చూసి మందహాసం చేశాడు రామనాధం.

తనను గుర్తు తెచ్చుకోవడానికాయన అవస్థపడుతున్నట్లు గ్రహించాడా యువకుడు.

"నేను గుర్తున్నానా సార్?"

"అదే.... అదే ఆలోచిస్తున్నాను" యిబ్బందిపడిపోయాడు రామనాధం.

"నేను.... మీ స్టూడెంట్ని సార్"

"అలాగా?"

"అవున్సార్. నా పేరు సుధాకర్‌బాబు"

"ఈజిట్?"

"ఆరేళ్ల క్రితం నేను నెల్లూరు వి. ఆర్ కాలేజీలో బి. కాం. చదివాను సార్."

"ఆ..... గుర్తుకొస్తోంది"

"అప్పట్లో మీరు మా క్లాస్‌కొచ్చేవారు. మిల్టన్ పొయెట్రీ అద్భుతంగా చెప్పేవారు."

బదులుగా నవ్వాడు రామనాధం.

"అయితే.... నువ్ మా ఓల్డ్ స్టూడెంటన్న మాట. సారీ గుర్తు పట్టలేకపోయాము".

"దాన్దేముందిలెండి సార్! చాలా రోజులై పోయింది కదా ఎవరికి మాత్రం గుర్తుంటుంది?"

"అన్నట్టు మిస్టర్ సుధాకర్! యిప్పుడేం చేస్తున్నావు?" అడిగాడు రామనాధం.

"ఇదే సార్ బిజినెస్"

"అంటే బి. కాంతోటే...."

"చదువు మానేశాను సార్ ! కొన్ని తప్పనిసరి పరిస్థితులలో చదువు మానెయ్యాల్సి వచ్చింది. బాగా పై చదువులు చదువుకునే అదృష్టం లేకపోయింది."

"మంచి పని చేశావ్?"

"ఏమిటి సార్?"

"అదే.... చదువు మానేసి యిలా నువ్ బిజినెస్ పెట్టుకోవడం" అన్నాడు రామనాధం.

"యిందులో చాలా రిస్కులున్నాయి"

"పై చదువులు చదివి నిరుద్యోగమనే రిస్క్‌ని ఫేస్ చెయ్యడం కంటే ఇదే నయం"

"అవుననుకోండి"

యింతలో పాండు టీ స్టాల్ నుండి పొగలు గక్కే టీని పట్టుకొచ్చాడు.

"తీసుకోండి సార్ ప్లీజ్" రామనాధం వేపు అభ్యర్థనగా చూశాడు సుధాకర్‌బాబు.

"థాంక్యూ"

రామనాధం టీ తాగేశాడు.

"ఈ వూళ్లో మీ బంధువులెవరైనా వున్నారా సార్?" అడిగాడు సుధాకర్‌బాబు.

"అబ్బే లేదు. నేను ఈ తిరుపతికి స్పాట్ వ్యాల్యుయేషన్ కోసం వచ్చాను"

"అలాగా?"

"అన్నట్లు మిస్టర్ సుధాకర్! మీ కొట్లో ఫారిన్ గూడ్సేవైనా...." అడిగాడు రామనాధం.

"వున్నాయ్ సార్! మీకేం కావాలి?"

"బుల్లి ట్రాన్సిస్టర్ కావాలి. క్రికెట్ కామెంట్రీ లాంటిది వినడానికి"

"అయితే మీకింకా క్రికెట్ పిచ్చి పోలేదన్న మాట. క్లాసులో కూడా మీరు క్రికెట్ గురించి చెప్పేవారు."

నవ్వాడు రామనాధం.

"నాతో రండి సార్! లోపలికెళ్దాం"

"లోపలికెందుకు?"

"స్మగుల్డ్ గూడ్స్‌ని లోపల రహస్యంగా దాచిపెడతాం సార్" చెప్పాడు సుధాకర్.

"సరే పద."

యిద్దరూ షాప్ లోపలికి నడిచారు.

"ఒక్కటే వుంది సార్. యిది క్రికెట్ సీజన్ కదండీ, అన్నీ సేలై పోయాయి. యిది కూడా ఓ ఫ్రెండు కావాలంటేనూ దాచిపెట్టాన్సార్."

సుధాకర్ అందించిన ట్రాన్సిస్టర్‌ని పరిశీలనగా చూశాడు రామనాధం. అది మేడ్ యిన్ తాయ్‌వాన్. అందంగా వుంది. రామనాధానికది అన్ని విధాలా నచ్చింది.

"ఎంత?" రేటు అడిగాడు.

"పరాయి వాళ్లకయితే రెండొందలు సార్ యిప్పుడు మాంచి డిమాండ్ కనుక రెండు వందలా ముప్ఫయ్ అమ్ముతాం. మీ దగ్గర లాభమేమిటి రెండొందలివ్వండి."



# అడ్డామేమీగురూ!

"జై పాతాళ భైరవి"లో "అంఫట్" మాంత్రికుణ్ణి -రాజకుమారి దగ్గరకి పంపటానికి పరిచారికలు సిద్ధంచేసేముందు- ఒసారి క్రూరంగారావు అద్దంలోకి చూసుకున్నాడు. "శృంగారం శాయటానికి" తన కేమిటి అడ్డు? "రే! డింగరీ" అన్నాడు సేవకుణ్ణి ఉద్దేశించి -

"గురో" అన్నాడు శిష్యుడు.

"మన అందానికి శృంగారానికి అడ్డమేమిరా డింగరీ?" అన్నాడు తమ గెడ్డాన్ని సవరించుకుంటూ.

"ఆ గెడ్డామే గురూ" అన్నాడు శిష్యుడు- ఎందుకేనా మంచిదని కొంచెం అసింటా జరిగి -

"మన మంత్ర శక్తులన్నీ అందులోనే వున్నాయి గదరా డింగరీ" అన్నాడు మాంత్రికుడు.

అలాంటి మంత్రశక్తులు ఏమీ మన గెడ్డాల్లో వుండవు గనుక ఆ డింగరీ మాట వినడం మనకి మంచిది. చక్కగా చేసుకున్న గెడ్డాం -శృంగార మార్గాన పాలరాయి పరిచినట్లే చేస్తుంది. పైగా యిప్పుడు "జంట బ్లేడ్లు" వచ్చేశాయి. సింగిల్ ఎడ్జ్ ట్విన్ బ్లేడ్ రేజర్‌లు పురుషులకో వరం అంటారు ప్రకటన కర్తలు-

చాలా మందికి గెడ్డాం చేసుకోడం ఒక "యజ్ఞం." కాని దాన్ని సునాయాసంగా చేసుకోవాలి అంటే -కొన్ని చిట్కాలున్నాయి. "ఫాలో-దె-మ్-యువర్ గాల్ ఫ్రెండ్ విల్ ఫాలో యూ"-

నెం.1

మొదట వేణ్ణీళ్ళతో గెడ్డాన్ని బాగా తడపండి- చక్కగా కడుక్కోండి.

నెం. 2

పొడిగా తుడిచేసుకోండి. ఏదైనా నూనె (కొబ్బరినూని



బెస్ట్) పల్చగా రాసుకోండి (తలకి కాదు గెడ్డానికి) దీనివల్ల నున్నగా గాజు కాయలాగా గెడ్డాం చేసుకోగల్రు.

నెం. 3

మంచి బ్రష్‌తో (లాంగ్ హ్యాండిల్ మంచిది) మంచి షేవింగ్ క్రీముని 'బురుగు' బాగా వచ్చేలాగా రుద్దండి. అలా కొన్ని క్షణాలు గెడ్డాన్ని వొగ్గేయండి!

స్టెప్ 4:

నున్నితంగా గెడ్డాం పెరిగే మార్గం (ఎదురు గీసుకోరాదు) లో సింగిల్ ఎడ్జ్ రేజర్‌ని నడిపించండి! క్రీము బురగా బ్లేడుకు నిండా పట్టుకుంటే నీళ్ళల్లో ముంచి వదిలించేస్తే మళ్లీ అది చక్కగా గీస్తుంది- మరోసారి మళ్లీ క్రీము పట్టించి- గెడ్డాం మరో సారి చేసుకోండి!- ఫైన్- నున్నగా వుంటుందిప్పుడు!

స్టెప్ 5 :

"ఆఫ్టర్ షేవ్ లోషన్" అలవాటుంటే బాగా దట్టించండి! "ఉమ్మ్‌వ్వా!" అనుకోండి- కాని అలవాటు లేకపోతే వద్దు- ఏదో ఒక "ఫేస్ క్రీము" రాసుకోండి.

☆☆☆

# పరుగు పందెం

వెంటనే రెండొందలిచ్చి, శెలవు తీసుకొని వెళ్లిపోయాడు రామనాథం.

"గురూ! నాకు తెల్సి నువ్ యింటర్ ఆరుసార్లు తప్పావు. వి. ఆర్. కాలేజీలో బి. కాం. ఎప్పుడు చదివావోయ్?" నవ్వేస్తూ సుధాకర్ని అడిగాడు అతని పార్ట్‌నర్ రవి.

"యిందాకా మన కొట్టు ముందు నిల్చుని ఈ పూర్ ఫెలో.... రామారావు అనే తన ఫ్రెండ్‌తో మట్లాడుతూవుంటే వాళ్ల సంభాషణంతా విన్నాను. పేరూ, వూరూ, వృత్తి తెల్సిపోయింది. చిన్న ట్రిక్ చేశాను" అన్నాడు సుధాకర్.

"పాపం రెండొందలు"

"పాపమేమిట్రా రవీ! యిది వ్యాపార ప్రపంచం. యిందులో డబ్బు తప్ప పాపపుణ్యాలకి చోటులేదు. నేను తన స్టూడెంట్ నని చెప్పేసరికి.... ఆయన చీప్‌గా ట్రాన్సిస్టర్ కొట్టేద్దామని ప్లాన్ వేశాడు. బోల్తా పడిపోయాడు."

"నమ్మిన మనిషినే....."

"వంచించాలి. అదేరా వ్యాపార ధర్మం. మోసం చెయ్యడమే వ్యాపార కేంద్ర బిందువు. చీప్‌గా వచ్చేస్తుందని ఆయన చూసుకున్నాడు. ఎనభై రూపాయల లాభం నే చూసుకున్నాను. ఈనాడు జీవితం ఓ పరుగు పందెం. పక్కవాడు బోల్తా పడిపోతే మనకెందుకు? వాడు పడడమే మన క్కావలసింది"

శ్రీమాన్ లాడ్జి రూం నంబర్ 210 లో రామనాథం గోపాలంతో చెప్పి విరగబడి నవ్వాడు.

"ఆ షాప్ వాడు నిన్ను ట్రాప్ చేస్తూ ఉన్నాడని ఎలా గ్రహించావోయ్, అడిగాడు గోపాలం.

"వాడు వి. ఆర్. కాలేజీలో ఆరేళ్ల క్రితం బి. కాం. చదివానన్నాడు. ఆ కాలేజ్‌లో నాకు జాబ్ వచ్చి నాలుగేళ్లే అయింది. నేనెప్పుడూ మిల్టన్ పొయిట్రీ టీచ్ చెయ్యలేదు. క్రికెట్ గురించి నాకు ఓనమాలు రావు. బోల్తా కొట్టించ బోయి.... దొంగనోట్లు పుచ్చుకొని వాడే బోల్తాపడ్డాడు. ఈనాడు జీవితమంటే.... పరుగు పందెం. మన ం గెలవాలంటే....పక్కవాడు బోల్తా పడి తీరాలి " అంటూ విరగబడి నవ్వాడు రామనాథం.

●

# ఐరన్ లోపం వలన ఆరోగ్యం దెబ్బ తినడమే కాక జుట్టు రాలుతుంది కూడ

మీకు కుటుంబ ఆరోగ్యం ముఖ్యమైతే వారికి అవసరమైనంత ఐరన్‌ను అందించండి.

ఐరన్ లోపంవలన రక్తంలో హెమోగ్లోబిన్ శాతం తగ్గి అనేమియాకు దారితీస్తుంది. అంతేగాక మన శరీరంలో రోగ నిరోధకశక్తి తగ్గిపోయి ఇన్‌ఫెక్షన్ మరియు ఇతరవ్యాధులు సోకే ప్రమాదముంది.

పైకి కనబడే లక్షణాలు: శరీరం పాలిపోవడం లేదా కళ తప్పిపోవడం మరియు బాగాజుట్టు రాలిపోవడం.

సాధారణ లక్షణాలు: కీళ్ళ నొప్పులు, ఆలోచనాశక్తి క్షీణించడం, తల మరియు ఒళ్ళు నొప్పులు, అలసట, కళ్ళు తిరగడం మరియు మామలు నీరసం ఇంకా ఎన్నో......




ప్రమాదం: గర్భిణీ స్త్రీలయితే తక్కువ బరువుండే బిడ్డలను ప్రసవిస్తారు.

ఆరోగ్య సమస్యలు రాకుండా మీ కుటుంబానికి ఎక్కువ ఐరన్ సమకూర్చండి.

**ఐరన్ లోపించడంవల్ల వచ్చే అనేమియాను నివారించడం ఎలా?**

నివారణకు అత్యుత్తమ మార్గం: మీ కుటుంబ సభ్యులందరికీ ఐరన్‌వున్న ఫెరోసాల్ట్‌తో వండిన రుచికరమైన భోజనాన్ని అందించడమే.

ఆరోగ్యకరమైన కుటుంబానికి సులభమైన మార్గం ఫెరోసాల్ట్ వాడకం.

ఎక్కువ పాళ్ళలో ఐరన్ కలిగివున్నది ఫెరోసాల్ట్ నేషనల్ ఇన్స్టిట్యూట్ ఆఫ్ న్యూట్రిషన్ హైదరాబాద్ వారిచే రూపొందించబడిన ఫార్ములా, భారతదేశంలో లభ్యమయ్యే ఐరన్ ఫోర్టిఫైడ్ సాల్ట్ ఒక్క ఫెరోసాల్ట్ మాత్రమే.

ఆటోమేటిక్‌గా ప్యాక్‌చేసిన శక్తివంతమైన ఫెరోసాల్ట్ "చికిత్సకన్నా జాగ్రత్తమిన్న" అనుకునే గృహిణులకు ఎంతో లాభదాయకం.

---

గృహిణులందరి ఆదరాభిమానాలను పొందిన ఫెరోసాల్ట్ ఇప్పుడు జంటనగరాలలోను, అన్ని జిల్లాల ముఖ్యపట్టణాలలోను లభ్యమవుతుంది.

---

**జయ భారతి సాల్ట్స్ ప్రైవేట్ లిమిటెడ్.**

93/1, కో-ఆపరేటివ్ ఎక్స్‌ప్యాన్షన్ ప్రోగ్రాం,
బాలానగర్, హైదరాబాద్-500 037,
ఫోన్ : 261351.




Priyadarshini / JBSL

# సీరియల్ శత్రుసంహారం

## లల్లాదేవి

(గత సంచిక తరువాయి)

**ఆ** రోజు అక్కయ్య స్వయంగా కారునడుపుకుంటూ వెళ్ళింది బావా! డ్రయివర్ని తీసుకుపోలేదు. కాబట్టి దేవాలయంలో జరిగిందేమిటో ఎవరికి తెలియదు. తిరిగి వచ్చేటప్పుడు యాక్సిడెంట్ ఎలా అయిందో చెప్పే వారులేరు. సుషమ్నకి ఏమీ అర్థంకాలేదని అనిపిస్తోంది.

లకడీకాపూల్ సెంటర్లో టీ దుకాణం దగ్గర నాకు కన్పించినప్పుడు ఫ్రాక్ మీద రక్తపు మరకలున్నాయి. దాన్నిబట్టి ఆక్సిడెంట్ జరిగినప్పుడు పాప కారులోనే ఉండిఉంటుందని ఊహించాను.

లో ఆలోచిస్తూ కూర్చోవటం అంతమంచిది కాదు. నువ్వు బెంగుళూరు వెళ్ళిపోవడం మంచిది. దైవం అనుకూలిస్తే బాధాకరమయిన ఈ జ్ఞాపకాలకు దూరంగా అక్కడే స్థిరపడిపోవచ్చు" అన్నాడు చెన్నకేశవులు.

సోఫాలో తండ్రిని అంటుకుపోయి కూర్చుని ఉంది సుషమ్న. తండ్రి మళ్ళీ వెళ్ళిపోతారన్న ఆలోచన ఆ లేత మనసుని గాయపరుస్తోంది. పాప తలను గుండెలకు గాఢంగా హత్తుకున్నాడు రాహుల్! ఆమె చేతుల్లో మిక్కీమౌస్!!

> **జరిగిన కథ-5 :** చైనా యుద్ధంలో అసువులు బాసి పరమ వీర చక్ర అవార్డు అందుకున్న మహేష్‌చంద్ర కొడుకు రాహుల్ వైమానిక దళంలో పైలట్‌గా చేరతాడు. తల్లి, భార్య కారు ప్రమాదంలో మరణిస్తారు. కుమార్తె సుషమ్న వదలకుండా తిరుగుతున్న ఒక ఎలక్ట్రానిక్ పరికరం గురించి మరదలు తన్విని ఆరా తీస్తాడు రాహుల్. అటువంటి పరికరం మూలంగానే సంపత్ మాస్టారి కుటుంబం విచ్ఛిన్నమైందని తెలుసుకున్న రాహుల్ తన కుటుంబ సభ్యుల మరణానికి సంబంధించిన కేసు వివరాలను సేకరించే ప్రయత్నంలో వుంటాడు. సుషమ్న దగ్గరున్న ఆ పరికరం మాయం కావటంతో దాన్ని గురించి వెదికి విఫలమవుతాడు రాహుల్.

ఏది ఏమయినా ఇంక ఆ విషయాలన్నీ మర్చిపోవడం మంచిది. నువ్వు తిరిగి వెళ్లిపోయి డ్యూటీలో చేరిపోవడం మంచిది.

పాపను నేను చూచుకుంటాను అంది తన్వి! బావగారు ఇంక ఆ విషయాలే ఆలోచిస్తూ ఉండటం ఆమెకు నచ్చలేదు. జరిగినదేదో జరిగిపోయింది. మర్చిపోయేందుకు ప్రయత్నించాలి. ,

అదే మనసులో పెట్టుకుని బాధపడటం భవిష్యత్తుకి మంచిదికాదని ఆమెకు అనిపించింది. సుషమ్న సంగతి చూచుకోవాలి కదా!

"అవును బ్రదర్! నువ్వింక ఈ విషయం

"కాని ఈ స్థితిలో బేబిని వదలి నేనెలా ఉండగలను" అన్నాడు దిగులుగా !

"సుషమ్నను నీతోపాటుగా తీసుకుపోయేందుకు వీలుకాదా బావా?"

"అది ప్రస్తుతంలో సాధ్యంకాని విషయం"

"అయితే నా దగ్గరే ఉండిపోతుంది. నిన్ను వెళ్ళిపోయి డ్యూటీలో జాయిన్ అవమని చెప్పాలంటే బాధగానే ఉంది. కాని ఎంతకాలమని బాధపడుతూ కూర్చుంటావు. మళ్ళీ ఉద్యోగంలోకి వెళ్ళిపోయావంటే కొంతయినా మనసు ఊరట కలుగుతుంది కదా!" అంటూ సలహా యిచ్చింది తన్వి.

"బాబూ! నీకు తెలుసుకదా! నాకు యిద్దరే ఆడపిల్లలు! తనూజ హాయిగా కాపురం చేసుకుంటూ ఉంటే తన్వి ఉద్యోగం చేయాలనుకుంది. కాని విధి మరొకలా తలిచింది. ఇప్పుడు తన్వి తన అభిప్రాయం మార్చుకుంది. పాపకోసమయినా తన అక్కస్థానంలోకి రావాలనుకొంటోంది. నాకు మాత్రం ఆ ఒక్క బిడ్డకాక యింకెవరున్నారు? ఈ రెండు కుటుంబాలకు నువ్వే ఆధారం!" అంతసేపూ మౌనంగా కూర్చున్న మామగారు తన అభిప్రాయాన్ని వివరించారు.

తన్వి సిగ్గుతో అక్కడనుంచి లేచి వెళ్ళిపోయింది.

పెళ్ళి మాట ఎలా వున్నా పాపాయికి ఓ చక్కని భవిష్యత్తు రూపొందించటానికి అందరూ ఆలోచిస్తున్నారు. రాహుల్‌కి తృప్తిగా ఉంది.

తాను ఒంటరివాడు కాదు. పాప ఒంటరిది కాదు. ఈ ఆలోచన తనకి ఎంతగానో మనశ్శాంతిని చేకూర్చుతోంది.

"బావా నీకోసం ఎవరో వచ్చారు బెంగుళూరు నించి." వార్త తీసుకుని మళ్ళీ తిరిగి వచ్చింది తన్వి.

రాహుల్ చివాలున లేచి క్రిందికి దిగి వచ్చాడు. చెన్నడు వెంటవచ్చాడు.

"హలో! యంగ్‌మాన్ హౌడూయుడూ!" నవ్వుతూ దగ్గిరగా వచ్చి బుజాలు పట్టుకుని కుదుపుతూ పలకరించాడు ఆహూజా!

"ఫైన్‌సార్! మీరు ఎప్పుడు వచ్చారు?"

"ఢిల్లీనించి వచ్చాను. నిన్నుచూసి పోదామనిపించింది".

"వెల్‌కం. రండి కూర్చోండి. నా మీద మీరు చూపుతున్న వాత్సల్యానికి ధన్యవాదాలు" అందరూ కూర్చున్నారు.

"తగిలిన గాయంనించి నువ్వు కొంత కోలుకున్నావనుకుంటాను. చూడు రాహుల్! మనం సైనికులం. గాయం

తగిలినా కర్తవ్యానికి దూరం కాకూడదు. పిరికి వాళ్ళం కాకూడదు"

"అవును సర్! నేను తిరిగి రావాలనే ఆలోచిస్తున్నాను" సైనికుడు అనే మాట వినగానే పూర్తిగా బాధ్యతకు లొంగిపోయాడు రాహుల్.

"దట్స్‌గుడ్! ఈ మాటనే నీనోటి వెంట వినాలని వచ్చాను"

"సర్! రెండు మూడురోజుల్లో నేను వచ్చి జాయిన్ అవుతాను"

"నాకు తెలుసు ఇలా చేయవలసి రావటం బాధగానే ఉంటుంది"

"అయినా బాధ్యతలనుంచి పారిపోవాలని లేదుసర్!"

"రియల్లీ నేను మరికొద్ది రోజులు పోయాక రావలసింది. కాని ఢిల్లీ కాన్ఫరెన్స్‌లో తెలిసింది. రాష్ట్రపతి మన డిమాన్‌స్ట్రేషన్ చూచేందుకు త్వరలో వస్తారు. ప్రదర్శనలో నువ్వు లేకపోతే ఉప్పులేని కూరలా మసాలా వెయ్యని చికెన్‌లా చప్పగా ఉంటుంది.

ఐ.ఎ.ఎఫ్.సౌత్ జోన్‌లో నువ్వే కదా హీరోవి! బెంగుళూరు నగరంమీద ఆకాశ వీధిలోకి నీ ఫ్లయిట్ లేచిందంటే హేమారెత్తి పోవాలి! వయసులో అధికారంలో నేను నీకన్నా పెద్దవాణ్ణి! అయినా నీకు అభిమానిని యూనో!" అన్నాడు ఆహూజా!

అదంతా అతన్ని ప్రోత్సహించటానికి మాట్లాడిందే! కాని అందులోని వాస్తవం ఆయనకు తెలుసు!

"రాష్ట్రపతి తిలకించే ప్రదర్శనకు నేను వస్తాను. డిమాన్‌స్ట్రేషన్ ఇస్తాను సర్! నా శక్తిని ధారపోస్తాను" అన్నాడు రాహుల్ ఉద్వేగంగా!

"నిజమయినసైనికులెవ్వరూ గాయాలకు భయపడరు. భగవంతుడు నీకు తోడుగా ఉండాలని ప్రార్థిస్తాను" ఆహూజా అభినందించాడు.

"సర్! మీరు మా యింటికి రావటం నా అదృష్టం. ఈ రోజు మీరు నా అతిథిగా ఉండాలి" రాహుల్ అభ్యర్థించాడు.

"నో! సారీ! అలాంటి అవకాశం మరొకసారి వస్తుందని ఆశిద్దాం! ఫ్లయిట్ రెడీగా ఉంటుంది. నేను వెళ్ళిపోవాలి" లేచాడు ఆహూజా!

మెరుపులాగే వెళ్ళపోయేందుకు లేచాడు. సుషుమ్న ఎప్పుడు వచ్చిందో ఆహూజా చెయ్యి పట్టుకుంది.

"నమస్తే అంకుల్! " అంది మెడ వెనకకు వాల్చి పైకి చూస్తూ!

"నా డాటర్ సుషుమ్న!" అంటూ



పరిచయం చేశాడు రాహుల్!

"వెరీగుడ్ బేబీ!" సుషమ్నని ఎత్తుకున్నాడు ఆహూజా! "సారీ బేబీ! నీకేమీ ప్రజంటేషన్ తీసుకురాలేదు. ఈసారితప్పకుండా తీసుకువస్తాను నౌ ఎక్స్‌క్యూజ్ మీ!" అన్నాడు ముద్దుపెట్టుకుని.

"అంకుల్! పప్పాని మళ్ళీ తీసుకు పోతారా?" అనుమానంగా అడిగింది. లేత కన్నులుచెమరించుతున్నాయి. మిక్కీమౌస్‌ని గట్టిగా పట్టుకుంది.

"అవునమ్మా త్వరలో నువ్వు కూడా బెంగుళూరు వచ్చేస్తావు. మా బేబీ కూడా అక్కడే ఉంది. నీతో ఫ్రెండ్‌షిప్ చేస్తుంది. ఓకె!"

"ఓకె అంకుల్! కాని పప్పాని తీసుకుపోకండి"

"మీ పప్పా చాల గొప్పవారమ్మా! ఆయన మాతో ఉండాలి"

"నో! అదేం కుదరదు. పప్పాని మీతో పంపను"

"ఇప్పుడు కాదులే తరువాత వస్తారు" క్రిందికి దింపేశాడు.

"అంకుల్ మమ్మీ, గ్రానీ చనిపోయారు. తెలుసా?"

"అయామ్ వెరీసారీ! వెరి వెరి సారీ!"

"పప్పాకూడా చనిపోతారా?"

"తప్పమ్మా అలా అనకు! ఆయన ఈ దేశాన్ని కాపాడుతారు"

"మరి నన్నో??" లేత చెంపలమీదికి కన్నీరు ఉబికి వచ్చినాయి.

"నిన్ను కళ్ళలో పెట్టుకుని పెంచుకుంటారమ్మా! డోంట్‌వర్రీ!"

"థాంక్యూ అంకుల్!" ఆహూజా చేయి వదిలేసిందిసుషమ్న! బరువెక్కిన హృదయం తో మెరుపులా ముందుకి సాగిపోయారు ఆహూజా!

తన్వి వచ్చి సుషమ్నని చేతుల్లోకి తీసుకుని కన్నీరు తుడిచింది. రాహుల్ మనసులో చెలరేగిన ఆవేదనని తట్టుకోలేక పోయాడు.

"చెన్నూ! పోలీస్ కంట్రోల్ రూంకి వెళ్ళిరావాలి!"

"ఆ కేసు గొడవలు వదిలేద్దాం రాహుల్!"

"ఫాదిలి వేయాలన్నా ముందుగా చెప్పాలి కదా!"

"అయితే వెడదాం పద" వెంట నడిచాడు చెన్నుడు. ఈసారి స్టేషన్ ముందు దిగగానే అతనికి సకల మర్యాదలు జరిగాయి. స్వంత డిపార్ట్‌మెంట్‌లోని హయ్యర్ ఆఫీసర్ వచ్చినట్లుగా ట్రీట్‌మెంటు యిచ్చారు.

ఎ.ఎస్.పి. కారంత్ ఎదురు వచ్చి స్వాగతం చెప్పాడు. డ్రింక్స్‌తెప్పించి ఇచ్చాడు. రాచమర్యాదలు చేసి గొప్ప ఆనర్ ఇచ్చాడు.

"కారు యాక్సిడెంట్ విషయంలో మావాళ్ళు కొంత సమాచారం సేకరించారు" అంటూ ప్రారంభించాడు. రాహుల్ విరక్తిగా నవ్వాడు. కారంత్ ఊహించిన విధంగా మాటా డేందుకు ఏమాత్రం ఆసక్తి చూపించలేదు. వినటానికే ఆసక్తి ఉన్న వాడిలా మౌనంగా కూర్చున్నాడు.

"యాక్సిడెంట్ జరిగిన రోజున విక్టిమ్స్ దేవాలయానికి వెళ్ళారు. ఆలయంలో అదే రోజున అదే సమయానికి ఒక విచిత్రం జరిగింది. ఏదో ఒక వస్తువు విషయంలో రెండు వర్గాల మధ్య పోరాటం జరిగింది.

ఆలయంలో కలుసుకోవాలని ఆ రెండు వర్గాలు ముందుగానే నిర్ణయించుకుని ఉండ వచ్చు. అలాగేకలుసుకున్నాయి. సాధారణంగా కొట్లాడుకుని శక్తి సామర్థ్యాలు తేల్చుకునేం దుకు అయితే ఆ ముఠాలు ఆలయ ప్రాంతాలను ఎన్నుకోవు. ఎందుకంటే అక్కడ పబ్లిక్ ఉంటుంది.

వారి మధ్య అనుకోకుండా వివాదం చెలరేగింది. పూజ చేయించుకునేందుకు వచ్చిన వారంతా చెల్లాచెదురు అయ్యారు. విక్టిమ్స్‌కూడా వారితో పాటే పరిగెత్తారు. ఆ హడావిడిలో పాప తప్పిపోయింది. దుండ గులువెళ్ళిపోయేంతవరకువారుఎదురుచూశారు.

ఆ తరువాత పాపకోసం వెదికారు.

ఆలయ ప్రాంతాలలో పాప కన్పించ లేదు. కంగారుపడిపోయారు. ఆ తల్లి దీనంగా రోదిస్తూ అందరినీ అడిగింది. ఎవరూ ఏమీ చెప్పలేక పోవటంతో పోలీసు రిపోర్టు యిచ్చేందుకు దీనంగా వెనుదిరిగింది.

దారిలో యాక్సిడెంట్ జరిగింది. పాప కన్పించకుండా పోయిందన్న కంగారులో డ్రయివ్ చేయటం వల్ల ఏక్సిడెంట్ జరిగిందా? మరేదయినా కారణం ఉందా? అనేది ఇంకా తేలని విషయం. రెండు విధాలుగానూ ఊహించటానికి మాత్రమే

## యార్లగడ్డ లక్ష్మీప్రసాద్



భారత ప్రభుత్వ పార్లమెంటరీ వ్యవ హారాల మంత్రిత్వ శాఖకు చెందిన హిందీ భాషా సలహా సంఘం సభ్యుడు, హిందీ సాహిత్యంలో జాతీయ అవార్డు గ్రహీత డాక్టర్ యార్లగడ్డ లక్ష్మీప్రసాద్ బ్రసెల్స్‌లోని లూవెన్ విశ్వవిద్యాలయం ఆహ్వానంపై బెల్జియం వెళ్తున్నారు.

'హిందీయేతర ప్రాంతాలలో హిందీ బోధ నలో యెదురయ్యే సమస్యలు', 'హిందీ సాహి త్యానికి హిందీయేతర రచయితల సేవ'- అనే అంశాలపై ఉపన్యసించేందుకు ఆంధ్ర విశ్వ విద్యాలయం ఆయనను డెప్యుటేషన్ మీద అక్కడికి పంపుతున్నది.

లూవెన్ విశ్వవిద్యాలయం అతిథిగా ఆయన మూడు నెలల పాటు బ్రసెల్స్‌లో వుంటారు. విశ్వవిద్యాలయ గ్రాంట్ల సంఘం వారి 'కెరీర్ అవార్డు'ను అందుకున్న డాక్టర్ ప్రసాద్ అనేక రచనలను చేశారు.

'తెలుగుకే ఆధునిక్ కవి బైరాగి', 'కవి-రాజ్ త్రిపురనేని' అనే హిందీ రచనలకు 1981, 1987 లో జాతీయ అవార్డులు పొందారు. దేశంలో సంచలనం సృష్టించిన భీష్మ సహానీ హిందీ నవల 'తమస్'ను డాక్టర్ యార్లగడ్డ యిటీవలే తెలుగులోకి అనువదిం చారు.

తమ పర్యటనలో భాగంగా ఆయన అనే క యూరోపా విశ్వవిద్యాలయాలను కూడా సందర్శిస్తారు.

ఆధారాలున్నాయి.

నిరూపించటానికి మాత్రం ఎలాంటి ఆధారమూ లేదు" అంటూ వివరించాడు ఎ.ఎస్.పి.కారంత్.

"అక్కడ గొడవ ఎందుకు జరిగిందో అది జరిపించిన వారు ఎవరో తెలుసుకున్నారా? అని అడిగాడు రాహుల్!

"అది చెప్పడం చాలా కష్టం సార్! ఫ్లయింగ్ గ్రూపులు అవి. ఇక్కడ ఒకసారి అక్కడ ఒకసారి కన్పిస్తాయి. వారు కూడా ఊహించని విధంగా గలభా జరిగింది కాబట్టి ప్రజల దృష్టిలో పడ్డారు. కాని సాధారణంగా వారిపని ముగించుకుని వెళ్లిపోయేవారు" అన్నాడు కారంత్.

రాహుల్ మనోలోకంలో మంటలు లేచినాయి.

జరిగింది యాక్సిడెంట్ అయితే తప్పు భగవంతుడి మీద మోపి భవిష్యత్తుని భగవంతునికే అప్పగించి మనశ్శాంతిని పొందవచ్చు.

కాని ఇది మనుషులు చేసిన కుట్ర అయితే సహించరానిది. భరించరానిది. అతని నేత్రాలు చింత నిప్పుల్లా అవుతున్నాయి.

"ఒక వేళ ఆలయంలో జరిగింది కుట్ర అయినా దానితో అమాయకురాలయిన అమ్మకూ తనూజకీ ఏమిటి సంబంధం?" అన్నాడు. అతని మనసు త్రొక్కిపట్టిన బంతిలా అయింది.

"అలా సంబంధం ఉండాలనే నియమం ఏమీ ఉండదు సార్! నేరస్తుల ప్రపంచం చాలా విశాలమయినది. వారి చేతులు చాల బలమయినవి. వారి చూపులకు వాడితనం చాలా ఎక్కువ! ఏదైనా జరగవచ్చు.

ఉదాహరణకి చూడండి మా డిపార్టుమెంట్! ఓ చిన్న దొంగతనం జరిగింది. ఎ.ఎ.ఎఫ్.వారి రిసెర్చి సెంటర్‌లో పనికిమాలిన ఓ ఇనుపముక్క పోయిందని రికార్డు చేశాడు మా ఇన్‌స్పెక్టర్!

ఆ దొంగతనానికి ఎలాంటి ప్రాధాన్యం లేదని అప్పుడే దాన్ని మర్చిపోయాడు. నేను తీగలాగేసరికి డొంక అంతా కదిలింది. అలాగే ఉంటాయిసార్! నేరస్థుల దృష్టి వాడి కాబట్టి మనకు కన్పించిన కారణాలు వారికి కన్పిస్తాయి. ఫర్ ఎగ్జాంపుల్!

ఆలయంలో పాప అదృశ్యం కావటానికి లకడీకాపూల్ టీ కొట్టు దగ్గర ప్రత్యక్షం కావటానికి మధ్య చాలా అనూహ్యమయిన సంఘటనలు జరిగి ఉండవచ్చు కదా! పాపాయి కాబట్టి చెప్పలేకపోవచ్చు" అంటూ

# భలే కవలలు



## అల్లరివాడు

ఫోటోలోని కవలల పేరు రామ్ కుమార్, లక్ష్మణకుమార్. వీరు పదిహేను నిమిషాల తేడాతో 13.6.1981 లో పుట్టారు. వీరికి ఇద్దరు అక్కలు, ఒక అన్న ఉన్నారు. వీరు సెయింట్ ఆంథోని స్కూల్‌లో మూడవ తరగతి చదువుతున్నారు. ఇద్దరూ ఒకే పోలికతో వుంటారు. గుర్తు పట్టటం కష్టం. రామ్ కుమార్ నెమ్మదిగా ఉంటాడు. లక్ష్మణకుమార్ అల్లరి చేస్తాడు. రామ్‌కుమార్ పాఠాలు ముందు నేర్చుకున్నా, చదివినా, లక్ష్మణకుమార్ చదువుతాడు. ముందు తనకే రావాలి అంటాడట. వీరు లేకపోతే వాళ్ళింటిలో సందడే ఉండదంటున్న వీరి తల్లిదండ్రుల పేర్లు శ్రీమతి పద్మావతి, శ్రీ సైదరాజు.

పంపినవారు:

పద్మావతి (విశాఖపట్నం)

రాహుల్ మనసులో అంటుకున్న మంటల్ని మరింత రెచ్చిపోయేలా చేశాడు ఎ.ఎస్.పి.కారంత్.

"ఇదంతా ఎందుకు? మీరు విచారించండి దోషులెవరైనా దొరికితే శిక్షించండి. అంతే సార్! రాహుల్ ఈ వ్యవహారాల్లో తల దూర్చితే రెచ్చిపోతాడు. భారత విమానదళం దక్షిణ విభాగంలో అతనిది ప్రత్యేకమయిన స్థానం. ఎంతో మంచి భవిష్యత్తుని ఊహిస్తున్నాం.

ఇప్పుడీ గొడవలన్నీ ఎత్తుకుంటే అదంతా మట్టిపాలవుతుంది" అంటూ ఇంకా వివరించాలని ప్రయత్నిస్తున్నాడు చెన్నుడు.

"చెన్నూ! మనమిప్పుడు ఆలయానికి వెళ్ళాలి" అన్నాడు రాహుల్! అప్పటికే అతని ఆలోచనలు చాలాదూరం వెళ్ళాయి. అతని ముఖంలో పట్టుదల, కళ్ళలో గాంభీర్యం ఉక్రోషం, పౌరుషం, ద్వేషం ప్రతీకారం అన్నీచూచి మారు మాట్లాడలేకపోయాడు చెన్న కేశవుడు.

ఏదో శక్తి ఆవహించినట్లుగా అయ్యాడు రాహుల్. సాధారణ మర్యాదలు కూడా మరిచిపోయాడు. వెళ్లొస్తానని చెప్పకుండా లేచి బయటకు పరుగుతీసాడు.

ప్రత్యర్థుల మీద దాడికి సిద్ధమవుతున్న ఓ వీర సైనికుడు అతనిలో కన్పించి తనలో తాను నవ్వుకున్నాడు ఎ.ఎస్.పి.కారంత్.

వెంకరించేందుకు కూడా భయమేసి బిగుసుకుపోయి కూర్చున్నాడు చెన్ను.

ఆలయం తలుపులు తెరిచే వున్నాయి జనం పలుచగా ఉన్నారు. రోడ్డుమీదినించి పైకి వెళ్లేందుకు పద్దెనిమిది మెట్లున్నాయి.

కేవలం అయిదు సెకన్లలో మెట్లు దాటిలోనికి పరుగుతీశాడు రాహుల్. చెన్నుడు అప్పటికింకా అయిదోమెట్టు దాటలేదు అతనికి మనసులో దిగులుగా ఉంది. భయంగా ఉంది. అయినాసంగా ఉంది. ఇన్ని రోజుల తరువాత రాహుల్ డ్యూటీలో చేరేందుకు అందరూ కలిసి ఒప్పించ గలిగారు. ఒక వేళ ఏదయినా కుట్ర ఉన్నా

## మిథున్-యోగితా



దేశంలోని పన్నుఎగవేతదారుల్లోముందున్న మిథున్ దీనిపుణ్యమా 'అని ఈ మధ్య బాగా ప్రచారంలోకి వచ్చాడు. ఈ ప్రచారం మాటేమోగాని యోగితాకు తనకు మధ్య వున్న ప్రేమ అధ్యాయం ఎప్పుడో ముగిసిపోయిందని బయట పెట్టాడట. ఇప్పటి వరకు మళ్లీ మేము ఏ విధమైన ఉత్తరప్రత్యుత్తరాలు జరుపుకోలేదు సరికదా.....కనీసం మాట కూడా మాట్లాడు కోలేదంటున్నాడు. చాలా సంవత్సరాల క్రితమే పొరపాటున మా పెళ్లి జరిగిపోయింది. కాని నా పెళ్లి కంటే నా భవిష్యత్తేముఖ్యమని తప్పకున్నానంటున్నాడు. దానికి కొన్ని కారణాలున్నాయట కాని అవేంటో చెప్పట్లేదట. ప్రశాంతత కావాలని ఈ పని చేశాడట. ఇప్పుడు మటుకు ప్రశాంతంగా వున్నాడంటారా? ఏమో.....ప్!

అది పోలీసులు చూచుకోవాలి. అంతేకాని సాధారణ వ్యక్తులు చేయగలిగింది ఏముంటుంది? రాహుల్ మాత్రం ఏం చేస్తాడు?

ఈ గొడవల్లో తలదూర్చితే అతని భవిష్యత్తు ఏమవుతుంది?

చెన్నుడు ఖంగుతినిపోయి ఆలోచించటం మానేశాడు. ఆయాసం తీర్చుకుంటూ నెమ్మదిగా పైకి చేరుకున్నాడు.

అప్పటికే ఆలయం లోపలకు చేరుకుని పూజారితో మాటాడుతున్నాడు రాహుల్.

"ఆ రోజు ఇక్కడ చాల పెద్ద గొడవ జరిగిందట కదా?"

"అవునండయ్యా! జరిగిందట నేను విన్నాను" అన్నాడు పూజారి.

"గొడవ జరుగుతున్న సమయంలో మీరు ఇక్కడ లేరా?"

"ఎందుకులేనండయ్యా! ఉన్నాను. ఇక్కడే ఉన్నాను"

"మరి విన్నాను అంటారేమిటి? మీరు చూడలేదా?"

"అంతవకాశం ఎక్కడ దొరికిందండయ్యా! లోపల పూజలు చేయిస్తున్నాను. ఆరోజు జనం ఎక్కువగా ఉన్నారండయ్యా! బయట కేకలు విన్పించాయి. అలజడి బాగా చెలరేగిందండయ్యా!

బయటకి వెడదామనుకుంటూ ఉండగా ఒక్కొత్తున భక్తులు లోపలకు నెట్టుకొచ్చేశారండయ్యా! తలుపులు బిగించేశారు. ఆ తరువాత చాలసేపటికి తలుపులు తెరిచారు. కాని అప్పటికి అంతా సద్దు మణిగిందండయ్యా" అంటూ తన పరిస్థితిని క్షేమకరంగా వివరించాడు పూజారి.

"మరయితే అప్పుడీ ఆలయం తాలూకు వ్యక్తులెవరూ బయటలేరా?"

"ఎందుకుండరండయ్యా! గార్డు ఉంటాడు. ఈ ఆలయానికి అతనే జవాను, అతనే అటెండరు, అతనే ఎస్కార్ట్! ఆలినాల్ అండయ్యా"

"ఇప్పుడు అతను ఎక్కడున్నాడో చెప్పగలవా?"

"బయటే ఉంటాడు. మీరు వచ్చేప్పుడు కన్పించలేదా?"

"నేను చూడలేదు. అతని పేరు?"

"పేరు గురవయ్య అండయ్య .అన్నాడు"

"రాహుల్ అనుమానంగా చూచాడు.

"అవునండయ్యా! గురవయ్యకి రిజర్వేషన్‌లో ఉద్యోగం వచ్చింది. వాడికీ ఇబ్రహీంకి లింకులున్నాయి. ఉదయం మధ్యాహ్నం సాయంత్రంనమాజ్‌కివెళ్ళివస్తాడుఇక్కడ్నుంచే! మిగిలిన సమయం అంతా గురవయ్య ఇక్కడే ఉంటాడు అంటారు.

వాడికి క్వార్టర్స్ అంటే ఓ చిన్న గది కూడా యిచ్చారు ఆఫీసు ప్రక్కనే!" అంటూ పరిస్థితి అంతా వివరించాడు పూజారి!

చెన్నుడు వెంటరాగా రాహుల్ ఆఫీసు గది వైపునడిచాడు. కార్యాలయంలో విజిటర్స్ టికెట్స్ కొంటూ కన్పించారు. ఆ మూల ఓచిన్న గది ఉంది. దాని తలుపులు దగ్గరగా వేసి వున్నాయి.

అదే గురవయ్య గది అని గుర్తించాడు రాహుల్! గది ముందు ఆగిపోయాడు! అరక్షణం ఆలోచించి తలుపుమీద చేయి వేశాడు. అవి దగ్గరకు మూసి ఉన్నాయి కాని బోల్టు వేయలేదు.

చేయివేయగానే తెరుచుకున్నాయి. గురవయ్య లేడు. అతని మిత్రుడు ఇబ్రహీం ఓ కుర్చీలో కూర్చుని సిగరెట్ త్రాగుతున్నాడు. అతని వెనుక అల్మైరాలో నింపిన గ్లాసూ, ఖాళీ సీసా కన్పించాయి. పైన సీలింగ్ ఫ్యాన్ తిరుగుతోంది. తాను ఆ స్థితిలో ఉండగా తలుపులు నెట్టుకుని లోనికి వచ్చిన ఓ క్రొత్త వ్యక్తిని చూచి అతను కంగారు పడలేదు.

మరొకసారి పఫ్ లాగి ఘూం' అని పొగ మేఘం వదిలాడు.

"ఏం కావాలి భాయ్ నీకు? లోపలికి ఎందుకు వచ్చావ్? పలకరించాడు.

"నీతో కొంచెం మాట్లాడాలి" అన్నాడు రాహుల్

అది తనకు అలవాటే అన్నట్టు చూచాడు. రవంతయినా చలించలేదు.

"కూర్చో! ఆ కుర్చీలో కూర్చుని నీకు ఏం కావాలో అడుగు" అతడు తన కార్యక్రమంలో దేన్నీ నిలుపు చేయలేదు. గ్లాసు ఖాళీ చేసి మళ్ళీ అల్మైరాలో ఉంచాడు. అతని ప్రవర్తనకి లోలోపల ఉడికి పోయాడు రాహుల్!

"ఈ మధ్య ఆలయం దగ్గర గొడవ గురించి కొన్ని వివరాలు కావాలి. తెలుసుకునేందుకు వచ్చాను" అన్నాడు.

దానికి ఇబ్రహీం చిద్విలాసంగా నవ్వాడు.

"గొడవలకేం తక్కువ! ఈ లొకేషన్‌లో దాదాగిరి ఎక్కువగానే ఉంటుంది. సాధారణంగా బయట రోడ్డుమీద ప్రతి రోజూ ఏదో ఒక గొడవ జరుగుతూనే ఉంటుంది. కాకపోతే ఆ రోజు మెట్లమీదికి ఎక్కివచ్చి గొడవ చేశారు. మీరు పోలీసు డిపార్టుమెంటా?"

"కాదు. ఆ గొడవలో నష్టపడిన వ్యక్తిని?"

"ఎవరో రెండు వర్గాలు కొట్టుకున్నారు. ఆ రెండు వర్గాలకి సంబంధించిన వారికే కాని ఇతరులకి నష్టం జరిగే అవకాశం లేదు. మీకు నష్టం జరగింది అంటే ఆశ్చర్యంగా ఉంది. మీరేం చేస్తారు"

"ఐ.ఎ.ఎఫ్. దక్షిణ విభాగంలో ఫ్లయిట్ లెఫ్టినెంట్"

"వెరీస్మార్ట్! సైనికులన్నమాట! ఈ

## శత్రుసంహారం

దేశాన్ని రక్షించాల్సింది మీరే! కాని ఒక్కమాట చెప్పనా? దురదృష్ట వశాత్తు మన దేశానికి బయట శత్రువులకన్నా లోపలి శత్రువులే ఎక్కువగా ఉన్నారు.

ఏమంటారు?" మరో పఫ్ లాగి మళ్ళీ పొగ మేఘం వొదిలాడు. అది ఫ్యాన్ గాలికి ఎబ్జార్బ్ అవుతూ ఉంటే దాని వంక విచిత్రంగా చూచాడు.

"నాకు అలాంటి విషయాలేమీ తెలియవు. ఆ రోజు ఏం జరిగిందో మీరు వివరంగా చెప్పగలరా? ప్రత్యక్ష సాక్ష్యులు కదా!" అన్నాడు రాహుల్.

అతను రెప్పలు సగం వాల్చి అరక్షణం ఆలోచించాడు.

"చెప్తాను. కాని ఆ సంఘటన గురించి ఒక సైనికాధికారికి యింత ఆసక్తి ఎందుకు అనిపిస్తోంది నాకు. ముందునా ప్రశ్నకి సమాధానం చెప్పండి"

"ఆ రోజే నాభార్య, తల్లి చనిపోయారు"

"ఎక్కడ ఆలయం దగ్గరే??"

"కాదు. మరొక చోట యాక్సిడెంట్‌లో!"

"అది యాదృచ్ఛిక సంఘటన కావచ్చు కదా!"

"విక్టిమ్స్ ఇక్కడికే వచ్చి తిరిగి పోతున్నారు" ఈ సమాధానం విని ఇబ్రహీం పెద్దగా విరగబడి నవ్వాడు. వాకిలి దగ్గర నిలబడి వారి మాటలు వింటున్న చెన్నుడు తృళ్ళి పడి చూచాడు.

"భాయ్! ఆలయానికి వచ్చి తిరిగి పోతున్నంత మాత్రాన కారు యాక్సిడెంట్ అవకూడదని ఉందా? తిరుపతి కొండల మీదినుంచి కార్లు అనేకసార్లు లోయల్లోకి దొర్లిపడ్డాయి. పేపర్లో చదివాం కదా!

మీ ఊహ మంచిది కాదు" ఖండితంగా తేల్చి చెప్పేశాడు ఇబ్రహీం.

అతను ఒక నష్టపోయిన వ్యక్తికి చూపవలసిన సానుభూతి చూపలేదు. కనీసం సాటి వ్యక్తికి యివ్వాల్సిన మ ర్యాద కూడా యివ్వలేదు.

పైగా ఒక ప్రత్యర్థిలా భావించి మాట్లాడుతున్నాడు.

"అంతాకాదు. అలా అనుమానించటానికి వేరే కారణాలున్నాయి"

"అదే అడుగుతున్నాను. మీ కారణాలేమిటో నాకు చెప్పండి" రాహుల్‌కి ఈ మాట విని ఒళ్ళు మండిపోయింది.

"నా మనసులోని మాటలన్నీ మీకెందుకు చెప్పాలి నేను?" అన్నాడు కోపంగా.

"అయితే ఆ రోజు ఆలయం దగ్గర ఏం జరిగిందో మీ కెందుకు చెప్పాలి నేను?" అంటూ ఎదురు ప్రశ్న వేశాడు ఇబ్రహీం.

రాహుల్‌కి పట్ట రానంత కోపం వచ్చింది

"చెప్పకుండా దాచుకున్నందువల్ల మీకు ఒరిగేదేమీ ఉండదు" అంటూ లేచి విసురుగా బయటకు నడిచాడు.

"ఇలాంటి ఛాటర్ బాక్స్ మాటల్నినేను చాలా విన్నాను" అంటూ లేచి దభేల్‌మని తలుపులు మూసుకున్నాడు ఇబ్రహీం.

"చాలా పొగరుమోతులా ఉన్నాడు" అన్నాడు రాహుల్ విసుగ్గా!

"అంతేనా నీకు అర్థమయింది? అతని మాటలు వింటూ ఉంటే ఈ గొడవలతో అతనికి కూడా సంబంధం ఉండి ఉంటుంది అనిపించలేదా నీకు?" అని అడిగాడు చెన్నకేశవుడు.

రాహుల్ కళ్ళ ముందు వేరే ప్రపంచం కొత్త వాకిళ్ళు తెరుచుకుంది!!

(ఇంకావుంది)

# కథల వర్క్‌షాప్-2






## "అనగాఅనగా ఓ అమ్మాయి. ఆమెకి ముప్ఫయి ఏళ్ళు!"

సమయం పదిగంటలు కావస్తోంది. ఆఫీసుకు టైమయిపోతోందని ఆదరాబాదరా తయారవుతోంది దీప్తి. ఆరోజు జీతాల రోజు.

"అమ్మా దీప్తీ! నాకు టానిక్కూ, మందులూ అయిపోయాయమ్మా. గుర్తుంచుకుంటావు కదూ!" ఆమె తండ్రి వెంకట్రామయ్య హెచ్చరికతో కూడిన అభ్యర్థన.

"అమ్మా దీప్తీ! బొత్తిగా చూపు తగ్గిపోయింది. నాకు కళ్ళజోడు వేయిస్తానన్నావ్. ఈరోజు జీతాలు వస్తాయనుకుంటా. నాకు కళ్లజోడు వేయించుతల్లీ!" ఆమె తల్లి జానకమ్మ కోరిక!

"అక్కా! ఆఫీసు నుంచి వచ్చేటప్పుడు నాకు చెప్పులు తేవడం మర్చిపోకు. నా అది నీదగ్గరుందిగా." చెల్లెలు పద్మ డిమాండ్.

"అక్కా! జీతాలొచ్చాక నాకు స్కూలు బేగ్ కొంటానన్నావ్." తమ్ముడు రవి వార్నింగ్.

"అలాగే.... అలాగే" అని అందరికీ సమాధానం చెప్పి ఇంటినుంచి బయట పడి "హమ్మయ్య" అని గాలిపీల్చుకుంది దీప్తి. దీప్తి వెంకట్రామయ్య పెద్ద కూతురు. ఆమెకు ఇద్దరు చెల్లెళ్లు, ఓ తమ్ముడు ఉన్నారు. వెంకట్రామయ్య గుమాస్తాగా చేస్తూ రిటైరయిన దగ్గర్నుంచి ఆ ఇంటికి దీప్తి పెద్దదిక్కై ఆదుకుంది. ఉద్యోగం చేస్తూ ఆకుటుంబాన్ని పోషిస్తోంది. తండ్రి కొచ్చే పెన్షన్‌తో ఇల్లు గడవడం కష్టం. తమ్ముడు, చెల్లాయిల చదువులు, వాళ్ల అవసరాలు తీర్చవలసిన బాధ్యత తను నెత్తిన వేసుకుంది దీప్తి.

వరువం ఉరకలు వేసి భర్త పరిష్వంగంలో గువ్వలా ఇమిడిపోవాలని, మంచులా కరిగిపోవాలని ప్రతి ఆడపిల్లా కోరుకునే కన్నె వయసు ఆమెకు దాటిపోయి పదిహేను సంవత్సరాలయింది. ఆమెకిప్పుడు ముప్ఫయి ఏళ్లు. అప్పుడప్పుడు ఆమెకు ఇరవై సంవత్సరాల వయసులో జరిగిన అనుభవం కళ్లముందు మెదిలి ఆమెహృదయం స్పందనకు గురిఅవుతూ వుంటుంది. జగదీష్‌తో ఆమె పరిచయం పెళ్లి వరకు సాగింది. తను తన తల్లిదండ్రులను, చెల్లాయిలను, తమ్ముడిని వదులుకోలేనని అలా ఇష్టపడితే తనను పెళ్లి చేసుకొమ్మని అతన్ని అడిగింది. జగదీష్ అసలు స్వరూపం అప్పుడు బయటపడింది. అతనికి కావలసింది తన సంపాదనకాని తనుకాదు. అంతే. పారిపోయాడు పిరికివాడు!

కొమ్మపై కులికే గువ్వల జంటను, మధువులానే తుమ్మెదల్ని, చందమామను చూసి మురిసే కలువల్ని చూసినప్పుడు మాత్రం ఆమెలో తియ్యని అలజడి, బాధ చోటు చేసుకుంటుంది. అదీ కొద్దిక్షణాలు మాత్రం! ఆ తర్వాత విధి తన వెన్నుమీద చరుస్తుంది. ఆమెకు కర్తవ్యం గుర్తుకువచ్చి యాంత్రిక జీవితంలో మునిగి పోతుంది. అలా దీప్తి ఆమె కుటుంబానికి దీప్తులు విరజిమ్ముతూ తనుమాత్రం కాలిపోయి, కరిగిపోయే కొవ్వొత్తిలా మిగిలిపోయింది. ఓరోజు ఆమె ఆఫీసుకు బయలు దేరుతుంటే-

"అమ్మా దీప్తీ! అమలాపురం నుంచి శాస్త్రిగారు ఓ సంబంధం తెచ్చారమ్మా. కట్నం పదివేలట. అబ్బాయి బావుంటాడట. వాళ్లది వ్యవసాయం. నీమాట తీసుకోనిదే ఏవిషయమూ చెప్పనన్నాను. అబ్బాయి నచ్చితే చేసుకోవచ్చు. నువ్వేమంటావ్?" అన్నాడు వెంకట్రామయ్య.

దీప్తికి తను వింటున్నది నిజమేనా? అనిపించింది. ఏనాడూతన పెళ్లి మాట తలపెట్టని తండ్రి, తనను ఓ మనిషిగా గుర్తించి, తనకూ ఓ మనసుందని, కోరిక లుంటాయని గ్రహించని తండ్రి- ఈరోజున తన పెళ్లి ప్రస్తావన తేవడం ఆశ్చర్యంగా ఉందామెకు. ఆమె మానస విహంగం ఒక్కసారి గాలిలో విహరించింది.

"మీమాట నేనెప్పుడు కాదన్నాను నాన్నా?" అంది సిగ్గుపడుతూ.

"అమ్మా! నువ్వు నాకూతురివి కాదమ్మా. మా పాలిట దేవతవు. మరి.... చెల్లాయిని చూసుకోడానికి వాళ్లు రేపువస్తారు. ఆఫీసుకు శలవు పెట్టు. ఈరోజు వచ్చేటప్పుడు స్వీటూ, హాటూ కట్టించుకురా."

అవి మాటలు కాదు. ఎగిరిన ఆమె మానస విహంగాన్ని తూట్లు చేసిన తూటాలు. ఆమె కుప్ప కూలిపోయింది.

ఇంతకీ పెళ్లి చూపులు తనకు కాదా? తన చెల్లాయికా? తన మనస్సెంత తొందర పడింది! ఆమె హృదయం మూగగా రోదించింది.

"అలాగే నాన్నా" అని బయటకు నడిచిందామె పొంగివస్తున్న దుఃఖాన్ని దిగమింగుకుంటూ.

ఆరోజు పద్మకు పెళ్లి చూపులు. పెళ్లి చూపుల్లో వాళ్లు "మీ పెద్దమ్మాయికి పెళ్లి చేయరా?" అని అడుగుతుంటే తండ్రి చెప్పిన సమాధానం దీప్తి హృదయాన్ని ముక్కలు చేసింది.

"మా పెద్దమ్మాయి మే మెంత బలవంతం చేసినా పెళ్లి చేసుకోనంటుందండీ."

తల్లి దండ్రుల్లో కూడా ఇంత స్వార్థం గూడు కట్టుకుంటుందా? ఇది ఒకవిధంగా పులిప్రవృత్తే. పులి తన పిల్లల్ని చంపితింటుంది. అలాగే తనతల్లిదండ్రులు వాళ్ల స్వార్థంకోసం తన్ను బలిచేశారు. అవునులే వీళ్లు మాత్రం ఏం చేస్తారు? పులి తన ఆకలి తీర్చు కోడానికి కదలలేని పరిస్థితుల్లో తన పిల్లల్నే చంపితింటుంది. వీళ్లూ అంతే. ●

# ప్లాస్టిక్ సర్జరీ: అందానికి అవసరానికి



డా. కోట రాజారావు ఎమ్.ఎస్.

డా. రాజారావుగారు 1962 లో ఆంధ్రా మెడికల్ కాలేజీలో మెడికల్ పట్టా పొంది జనరల్ సర్జరీలో రంగాచార్యా గోల్డు మెడల్ గ్రహీత. 1968 సం. లో పాట్నా యూనివర్సిటీలో ప్లాస్టిక్ సర్జరీ ఎం. ఎస్. చేశారు.

విజయవాడ సిద్ధార్థ మెడికల్ కాలేజీకి ఆనరరీ ప్రొఫెసర్ ఆఫ్ సర్జన్‌గా, ఇ. ఎస్. ఐ. హాస్పిటల్ కన్‌సల్టెంట్ సివిల్ సర్జన్‌గా పనిచేస్తు సొంతంగా ప్రాక్టీసు చేస్తున్న సీనియర్ డాక్టర్.

**ప్రశ్న- డాక్టరుగారూ, ప్లాస్టిక్ సర్జరీ చేయవల్సి వచ్చినప్పుడు ఆ వ్యక్తి శరీర భాగాల నుండే చర్మాన్ని తీసుకుంటారా? లేక ఇతరుల చర్మాన్ని ఉపయోగిస్తారా?**

జ- అవసరమైన చర్మాన్ని పేషెంటు శరీర భాగాల నుండే తీసుకుంటారు. ఇతరుల శరీరం నుండి తీసిన చర్మం పనికిరాదు. దీనినే హోమోగ్రాఫ్ట్ రిజక్షన్ అంటారు. ఈ విషయంపై శాస్త్రజ్ఞులు ఇంకా పరిశోధనలు చేస్తూనే ఉన్నారు.

**ప్ర- ఈ ప్లాస్టిక్ సర్జరీ మనదేశంలో ఎప్పుడు ప్రవేశించింది. ప్రభుత్వ ఆసుపత్రులలో ఈ విభాగాలు ఉన్నాయా?**

జ- ప్లాస్టిక్ సర్జరీ చాలా పురాతనమైనది. మనదేశంలో మొదటగా ప్లాస్టిక్ సర్జరీ చేసినది క్రీ. పూ. 3వ శతాబ్దంలో వారణాశిలో, ముక్కును మళ్లా ఏర్పరచగల్గినారు. దానికి కావల్సిన శరీర భాగాన్ని బ్రస్సు భాగం నుండి తీసుకున్నారు. దీనిని భారతీయ విధానమైన రినో ప్లాస్టరింగ్ అంటారు. ఆ ఆపరేషన్ నిర్వహించిన వారు సుశ్రుతుడు. మన దేశం నుండి ఈ శాస్త్రాన్ని అరబ్బులు నేర్చుకున్నారు. వారి నుండి ఇటాలియనులు, యూరోపియన్లు నేర్చుకున్నారు. మనవాళ్లు ఇప్పుడు పాశ్చాత్యుల వద్ద యీ శాస్త్రాన్ని అభ్యసించటానికి విదేశాలు వెళుతున్నారు. మన దేశంలో కొన్ని ప్రభుత్వ ఆస్పత్రులలో



ప్లాస్టిక్ సర్జరితో సరిచేయబడిన ముక్కు

విభాగాలు ఉన్నాయి. హైదరాబాద్‌లో ఉస్మానియా హాస్పిటల్, గుంటూరులోను, కాకినాడ రంగరాయ మెడికల్ కాలేజీ ఆస్పత్రిలోను ఈ విభాగం ఉంది.

**ప్ర- సాధారణంగా ఎటువంటి లోపాలు ఉన్నవారు ఈ సర్జరీ చేయించుకోవచ్చు?**

జ- అంగవైకల్యం జన్మతః వచ్చినా, లేక ప్రమాదవశాత్తు ఏర్పడినా యీ చికిత్స చేయించుకోవచ్చు. ఏ రకమైన అంగవైకల్యం కలిగినా ఈ చికిత్స చేయించుకోవచ్చు.

**ప్ర- శరీరంలో ఏదైనా భాగం పూర్తిగా తెగిపోతే దానిని తిరిగి సర్జరీ ద్వారా అతికించవచ్చా?**

జ- మీరడిగిన ప్రశ్న చాలా బాగుంది. ఏవైనా శరీర భాగాలు ప్రమాదవశాత్తు పూర్తిగా తెగిపోయినప్పుడు వాటిని ఈ సర్జరీ ద్వారా అతికించవచ్చు. అయితే మైక్రో సర్జరీ ద్వారానే ఇది సాధ్యపడుతుంది. ఇటువంటి సౌకర్యం మద్రాసులో ఉంది. మన రాష్ట్రంలో లేదు. శరీర భాగం పూర్తిగా తెగిపోయినప్పుడు ఆ భాగాన్ని వెంటనే పాలిథిన్ కవర్‌లో (స్టెరిలైజ్‌డ్) ఉంచాలి. అంతేగాక ఆ పాలిథిన్ కవర్‌లో ఉంచిన శరీర భాగాన్ని పూర్తిగా సీల్ చేసి ఐస్‌లో ఉంచాలి. అంతేగాని డైరెక్ట్‌గా తెగిన భాగాన్ని ఐస్‌లో ఉంచకూడదు. ఇలా చేసి 8 గం. లు లోపు సర్జరీ చేయాలి. మన విజయవాడలో ఇటువంటి ప్లాస్టిక్ మైక్రో సర్జరీ లేదు.

**ప్ర- ప్లాస్టిక్ సర్జరీ ఎన్ని దఫాలుగా చేయవల్సి ఉంటుంది? ఇది బాగా ఖర్చుతో కూడుకున్నదా?**

జ- ఈ సర్జరీ ఎన్ని దఫాలుగా చేయవల్సి ఉంటుందనేది కేసు యొక్క స్వభావాన్నిబట్టి ఉంటుంది. సామాన్యంగా ఒక్కసారితోనే పూర్తి అవుతుంది. కొన్ని కొన్ని ముఖ్యమైన భాగాలు అందంగా తీర్చిదిద్దవల్సి వచ్చినప్పుడు రెండు మూడుసార్లు కూడా చేయవల్సి వస్తుంది. ఇతర సర్జరీలవలె మామూలుగానే చార్జి చేస్తారు. మరీ అంత ఖర్చుతో కూడుకున్నది కాదు.

**ప్ర- ముక్కు లేదా నోరులాంటి అవయవాలు అందవికారంగా వున్నప్పుడు చిన్న వయస్సులోనే సర్జరీ చేయించాలా? లేక వయస్సు ముదిరిన**

తెగిపోయిన ముక్కు



సర్జరితో సరిచేయబడిన ముక్కు



తరువాత చేయించాలా?

జ- మన శరీరంలో ప్రతి అవయవానికి సర్జరీ చేసేందుకు ఒక ప్రత్యేకమైన టైమ్ ఉంటుంది. ఉదాహరణకు పెదవులకు ఆపరేషన్ చేయాలంటే 3 సం. లు వయస్సు ఉన్నప్పుడు చేస్తే ఉత్తమం. ముక్కుకు ప్లాస్టిక్ సర్జరీ చేయాలంటే 7 సం. లు వయసులో చేయించితే మంచి ఫలితం ఉంటుంది.

ప్ర- ఈ సర్జరీ చేసేటప్పుడు పేషెంటు స్పృహతో ఉంటాడా? లేక పూర్తిగా మత్తు ఇస్తారా?

జ- ఆపరేషన్ చేసే భాగాలను బట్టి మత్తు మందు ఎలా ఇవ్వాలన్నది ఆధారపడి ఉంటుంది. కొన్ని కొన్ని కేసులలో లోకల్ ఎనస్తీషియా ఇవ్వడం జరుగుతుంది. అలాంటప్పుడు ఆ వ్యక్తి స్పృహలోనే ఉండటం జరుగుతుంది. ఒక్కొక్కసారి పూర్తిగా మత్తు ఇస్తారు.

ప్ర- ఈ సర్జరీ చేస్తున్నప్పుడు కాని, చేసిన తరువాత కాని ఏమైనా ప్రమాదాలు ఏర్పడడానికి అవకాశం ఉందా?



ప్లాస్టిక్ సర్జరీ చేస్తున్న డా. కోట రాజారావు

జ- ఈ సర్జరీ వలన ప్రమాదాలు జరగడానికి ఏ విధమైన అవకాశంలేదు. అయితే కొన్ని అనివార్యమయిన సందర్భాలలో ఆపరేషన్ విజయవంతం కాకపోవచ్చు. ఆశించిన మేరకు ఫలితాలు దక్కకపోవచ్చు.

ప్ర- ప్రమాదాల వలన ముఖం కాలినప్పుడు ఆయా భాగాలు మళ్ళీ మామూలుగా తీర్చిదిద్దగలరా?

జ- కాలిపోయిన భాగం బాగా అందవికారంగా తయారవుతుంది. అయితే ఈ సర్జరీ వలన తిరిగి ఆ భాగాన్ని చూడడానికి బాగుండే విధంగా తీర్చిదిద్దవచ్చు. ఏ ప్లాస్టిక్ సర్జన్ అయినా ప్రకృతిసిద్ధమైన సౌందర్యాన్ని తీసుకురాలేరు. చూడడానికి బాగుండే విధంగా మాత్రం చేయగలరు.

ప్ర- బట్ట తల వున్నవారికి ప్లాస్టిక్ సర్జరీ ద్వారా వెంట్రుకలు వచ్చేటట్లు చేయవచ్చా?



కాలిపోయిన మెడ భాగం
ఆపరేషన్‌కి ముందు



ఆపరేషన్ తరువాత

జ- బట్ట తల ఉన్నవారికి, లేదా తల అంతా వెంట్రుకలు ఉండి మధ్యలో కొంత భాగం వెంట్రుకలు లేనప్పుడు ఈ సర్జరీ ద్వారా ఆ ప్రక్కన ఉన్న వెంట్రుకలను తీసి లేని భాగంలో నాటవచ్చు. దీని కోసం 2 నుంచి 3 గం. లు సమయం ఆపరేషన్‌కు తీసుకుంటుంది. అలాగే మీసాలు లేనివారికి చాలా తక్కువగా ఉండి చూడడానికి బాగుండని వారికి మీసాలు కూడా ఏర్పాటు చేయవచ్చు. మద్రాసు, ఢిల్లీలాంటి పట్టణాలలో ఇటువంటి సర్జరీలు బాగా జరుగుతున్నాయి.

ప్ర- స్త్రీలకు బ్రెస్ట్ సరిగా లేనప్పుడు ఈ సర్జరీ ద్వారా సరి చేయవచ్చా?

జ- కొంతమంది స్త్రీలకు బ్రెస్ట్ చాలా తక్కువగా ఉంటుంది. మందుల వలన కూడా ప్రయోజనం లేనప్పుడు ఈ ప్లాస్టిక్ సర్జరీ ద్వారా సరిచేయవచ్చు.

ప్ర- ముఖ్యంగా స్త్రీలకు ఈ సర్జరీ ఇంకా ఎలా ఉపయోగపడుతుందంటారు?

జ- ఆధునిక యువతి తన ముఖ, శరీర సౌందర్యానికై ఈ ప్లాస్టిక్ సర్జరీ ద్వారా అధిక ప్రయోజనాన్ని పొందవచ్చు. ముఖం మీద ఏర్పడ్డ స్ఫోటకం మచ్చలు, అసహ్యంగా ఉండే ఇతర నల్లటి మచ్చలు, పుట్టు మచ్చలు, పులిపిరికాయలు ఈ సర్జరీ ద్వారా తొలగించుకోవచ్చు. కొంతమందికి చేతికి టీకా మచ్చలు ఉంటాయి. వాటిని కూడా ఈ సర్జరీ ద్వారా సరిచేయవచ్చు. ముఖాన చుట్టతో కాల్చిన మచ్చ కూడా ఈ సర్జరీ ద్వారా సరిచేయవచ్చు. అలాగే దొడ్డిముక్కు, చప్పిడి ముక్కును కూడా అందంగా తీర్చిదిద్దుకోవచ్చు.

కొంతమంది స్త్రీలకు నడుం దగ్గర కొవ్వు ఏర్పడి ముడతలు కనిపిస్తాయి. ఒక్కొసారి మరీ వికారంగా ఉంటాయి. అలాగే కొంతమందికి పిరుదులు అతి లావుగా ఉండి నడవడానికి కూడా ఇబ్బందిగా ఉంటుంది. మరికొంతమందికి పొత్తి కడుపు లావుగా జారిపోయి ఉంటుంది. ఇలాంటి వారందరికి ప్లాస్టిక్ సర్జరీ ద్వారా సరిచేసి చూడడానికి అందంగా, ఉండేటట్లు చేయవచ్చు.

- ఇంటర్వ్యూ: హిప్నాటిస్ట్ టి. ఎస్. రావ్

అపరేషన్ ముందు పెదవి



ఆపరేషన్ తరువాత పెదవి






51

(గత సంచిక తరువాయి)

జరిగిన కథ-13 : జోషీ కేసు దర్యాప్తులో భాగంగా పంచశూలమ్ పంపిన యువకుడు ఇన్‌స్పెక్టర్ 'షా'గా చెలామణి అవుతుంటాడు. జయరాజ్ కొడుకు మోహన్‌తో పెళ్లి కావల్సిన గురూజీ కూతురు మీనాక్షి అంధురాలుకాగా పంచశూలమ్ మోహన్‌ని కిడ్నాప్ చేయిస్తాడు. దీపాదేవి మాజీ భర్త భీమరాజు పోలీసు లాకప్‌లో హత్య చేయబడతాడు. సుభాష్, మదన్‌ల తండ్రి ఒక్కడేనని పంచశూలమ్ వారికి తెలియజేస్తాడు. పంచశూలమ్‌ను జోషీగా అనుమానించిన జయరాజ్, గురూజీలు అతన్ని హతమార్చేందుకు టైగర్ అనే వ్యక్తితో బేరం కుదుర్చుకుంటారు. ఒక వ్యక్తి తలను నరికి కారు డిక్కీలో పెట్టి దూరంగా పారేయమని మోహన్ తల్లి పరిమళను పురమాయిస్తాడు పంచశూలమ్.

భవనంలోని పోర్టికోలో ఆగింది ఫియెట్ కారు.

డ్రైవింగ్ సీటులోంచి కిందకు దిగాడు జెట్టీ కారు వెనక్కి వెళ్ళాడు.

ఉలిక్కి పడింది పరిమళ. గుండెలు దడ-దడ కొట్టుకున్నాయి. అతను డిక్కీ తెరుస్తాడేమోనన్న అనుమానంతో కంపించి పోయింది తను కారులోంచి దిగి అతన్ని ఆపాలనుకుంది. కానికాళ్ళు, చేతులు సహకరించలేదు. 'డిక్కీ తెరవద్దు' అని అరవాలనుకుంది. కాని గొంతులోంచి మాట రాలేదు.

ఇంతలో వెనకనుండి ముందు సీటు దగ్గరకు వచ్చాడు జెట్టీ. డోరు తెరిచాడు. "చెయ్యి ఆసరా యివ్వమంటారా, మేడమ్!" అన్నాడు వినయంగా.

"అక్కర్లేదు" ధైర్యాన్ని పుంజుకుంది ఆమె. నెమ్మదిగా కారు దిగింది. "ఒక్క నిమిషం ఉండు" అంది.

అదే సమయంలో, లోపలనుండి యిద్దరు గుమాస్తాలు, పని మనిషి వచ్చారు కానిస్టేబుల్‌ని చూసి కంగారు పడ్డారు.

"ఇటురా"పని మనిషిని పిలిచింది పరిమళ.

ఆమె దగ్గరకు వచ్చింది పని మనిషి.

చిన్నగా కాలు కదిపి ఆమె భుజం మీద చెయ్యివేసింది పరిమళ "మీరేం భయపడనక్కర్లేదు. నా ఒంట్లో బాగా లేదు. కారు డ్రైవ్ చెయ్యలేని పరిస్థితిలో కానిస్టేబుల్ సహాయం వచ్చాడు. ఓ వెయ్యి రూపాయలు అతనికి బహుమతిగా ఇవ్వండి" అని, పనిమనిషి భుజం పట్టుకుని లోపలకు నడిచింది.

నీరసం, నిస్పృహ, భయం, ఆందోళన ఆమె నర-నరాలను పీడించనారంభించాయి. పడక గదిలో మంచం మీద కూర్చుంటూ టైమ్ చూసింది. రెండు గంటలు కావస్తోంది "మోహన్ వచ్చాడా?" బరువైన కంఠంతో అడిగింది పరిమళ.

"లేదమ్మా! మేనేజరుగారు ఏరోడ్రోమ్‌కెళ్ళారు. గంట క్రితమే బొంబాయి నుండి విమానం వచ్చింది అందులో చినబాబు రాలేదని చెప్పారు." అంది పనిమనిషి.

దీర్ఘంగా నిట్టూర్చింది పరిమళ ఫోమ్ బెడ్‌మీద కూర్చునే ఓపిక కూడా లేకపోయింది. పక్క మీద వాలుతు "అయ్యగారు వచ్చారా?" అని అడిగింది.

"లేదమ్మా! ఆయన కూడా రాలేదు ఇంత రాత్రి వరకూ ఎప్పుడూ బెట ఉండలేదు ఏరోడ్రోమ్‌కు ఫోన్ చేసి చినబాబు రాలేదని దిగులు పెట్టుకుని ఉంటారు..." కాళ్ళు ఒత్తుతూ, ఏవేవో చెబుతోంది పనిమనిషి.

కాని, పరిమళ శరీరం పూర్తిగా అలిసి పోయింది. మెదడు మొద్దుబారి పోయింది. రెప్పలు మూసుకుపోయాయి కొన్ని క్షణాల్లోనే గాఢ నిద్రలో మునిగిపోయింది.

52

చల్లటి సర్పకు ఉలిక్కి పడింది పరిమళ.

"తల...తల...తల...."

అంటూ కలవరించనారంభించింది.

"తలే..."

"ఎవరిది?"

"వాడిదే"

"తీసి కాలవలో పారేయ్."

"తీసేస్తా. వాడి తల తీసేస్తా. కాలవలో పారేస్తా. భూమిలో పాతేస్తా. నా తెలివి చూపిస్తా"

ఆమె భుజం మీది చెయ్యి తియ్యకుండానే అన్నాడు జయరాజ్.

తృళ్ళిపడి కళ్ళు తెరిచింది పరిమళ.

ఆమె కళ్ళల్లో కాంతి లేదు. ముఖంలో జీవకళలేదు.

"తెస్తా..తలతెస్తా..పాతేస్తా..పారేస్తా.

తాగిన మైకంలో, తన ధ్యాసలో ఏదేదో అంటున్నాడు జయరాజ్!

అతని మాటలు ఆమెకు అర్థం కావడం లేదు. సరిగ్గా వినిపించడం లేదు. అయోమయంగా అతని వంక చూస్తూ ఉండిపోయింది.

"నువ్వు భయపడకు, జయరాజ్, గురూజీలంటే మజాకా కాదు...పోలీసు వాళ్ళను, ప్రభుత్వాన్ని షాకెత్తిస్తు ఫాలికేళ్ళనుంచి

పట్టీలు కొట్టిస్తున్నాం, కోటికి పడగలెత్తాం. పది మందిలో పేరు కెక్కాం. పరువుగా బతుకుతున్నాం.... తెస్తాం... వాడి తల పట్టుకొస్తాం. నీ కాళ్ళ ముందు పడేస్తాం. నీ కళ్ళెదుట పాతేస్తాం..."

అతని మాటలు కొద్ది కొద్దిగా అర్థమయాయి పరిమళకు. డిక్కీలో ఉన్న తల గురించి అతను మాట్లాడ్డం లేదని గ్రహించింది. అయోమయంగా, ప్రశ్నార్థకంగా అతని ముఖంలోకి చూసింది.

"అదే...వాడిదే...వాడి తలే..."

"ఎవరిది?" అస్పష్టంగా ప్రశ్నించింది.

"వాడిదే...జోషిది...తీసేస్తున్నాం - వాడి తల తీసేస్తున్నాం"

ఆ పేరు వినేసరికి గుండెలు దిగజారిపోయాయి. నరాలు తెగిపోయాయి. అగ్ని పర్వతం బద్దలయినట్లు మెదడు పగిలి పోయింది. గది ప్రతిధ్వనించేటట్లు బిగ్గరగా అరిచి, స్పృహ తప్పిపోయింది పరిమళ!!!

## 53

ఉదయం పది గంటలయింది.

పోలీస్ స్టేషన్‌లోంచి బైటకు వచ్చాడు. తన జీప్ వైపుకు నడిచాడు షా.

జీప్ పక్కన నిలబడి ఉన్నాడు ఓ కానిస్టేబుల్. జేబులోంచి తాళాలు తీసి, డ్రైవింగ్ సీట్లో కూర్చోబోయాడు.

"ఒంటరిగా వెళతాను నేను" పులిపిరి కాయను నొక్కుకుంటూ అన్నాడు షా.

తన ప్రయత్నాన్ని విరమించుకుని, తాళం చెవులు షా కిచ్చాడు కానిస్టేబుల్.

జీప్‌లో కూచున్నాడు. ఇంజన్ స్టార్ట్ చేశాడు. స్టేషన్ ఆవరణలోంచి బైటకు వచ్చాడు షా.





1989 సంవత్సరానికి 'ప్రపంచ ఆహార బహుమతి' మన దేశస్థుడికి లభించింది.

భారత జాతీయ పాడిపరిశ్రమాభివృద్ధి బోర్డు అధ్యక్షుడు శ్రీ వర్గీస్ కురియన్ ఈ గౌరవాన్ని అందుకున్నారు.

'ఆపరేషన్ ఫ్లడ్' అనే సహకార కార్యక్రమం క్రింద ఆయన చేసిన సేవలకు గుర్తింపుగా శ్రీ కురియన్‌కు ఈ బహుమతి అందజేయబడింది.

ఈ బహుమతి క్రింద ఒక ఫలకము, 2 లక్షల డాలర్లు లభిస్తాయి. 48 దేశాలకు చెందిన 173 మందిలో శ్రీ కురియన్ ఈ బహుమతి దక్కించుకున్నారు.

అదే సమయంలో ఓ టాక్సీ వచ్చింది. దాంట్లోంచి కిందకు దిగాడు మదన్. గబ గబా జీప్ దగ్గరకు వచ్చాడు "గుడ్మార్నింగ్ ఇన్‌స్పెక్టర్!" అన్నాడు.

జీప్ ఆపుచేశాడు. "గుడ్మార్నింగ్" అంటూ అతని వంక పరీక్షగా చూశాడు షా.

మదన్‌లో ఏమీ మార్పులేదు. ఇంగ్లీషు పిక్చర్స్‌లోని డిటెక్టివ్‌లాగే డ్రెస్ చేసుకున్నాడు. గాగుల్స్ ఉండటం వల్ల అతని కళ్ళలోని భావాలు బైటకు వ్యక్తం కావడం లేదు. ముఖ కవళిక ల్లో కూడా మార్పు లేదు.

"ఆ రోజు రాత్రి సరోవర్ అపార్టుమెంట్సు దగ్గర కలిశాము మనం. తర్వాత వచ్చి మీతో మాట్లాడతానన్నాను. ఇవ్వాళ కొంచెం తీరిక దొరికింది. మిమ్మల్ని చూసి వెళదామని వచ్చాను" "జీప్‌లో కూర్చో" అన్నాడు షా. టాక్సీ డ్రైవర్‌కి డబ్బులిచ్చి పంపించేశాడు మదన్. జీప్‌లో కూర్చున్నాడు. జీప్ ముందుకు సాగింది. కొంతదూరం వెళ్లాక "దీప మీద అత్యాచారం చెయ్యలేదు నేను. ఆ విషయం చెప్పడానికే వచ్చాను" అన్నాడు మదన్.

"నువ్వు రావడం చాలా మంచిదయింది. లేకుంటే, కానిస్టేబుల్స్‌ను పంపి వెదికించే వాడిని నిన్ను".

"అలాంటి ట్రబులివ్వను మీకు. కాని, నేను ఎలాంటి అపరాధం చెయ్యలేదు. నేను దీప గదిలో ప్రవేశించే సరికే ఆమె గాయపడి వుంది..."

"అపరాధం నువ్వు చేశావా, మరో వ్యక్తి చేశాడా అన్న పాయింటు తర్వాత విచారణ చేస్తారు పోలీసులు. కాని, దౌర్జన్యం జరిగిన ప్రదేశంలో, అనుమానంగా కనిపించిన ప్రతి వ్యక్తిని ముందు అరెస్ట్ చేస్తారు. పైగా, సరోవర్ అపార్ట్‌మెంట్స్ లిఫ్ట్‌దగ్గర నిన్ను చూసేసరికి నాకే సందేహం కలిగింది. దీప గదిలో ప్రవేశించినట్లు కూడా యిప్పుడు నువ్వు ఒప్పుకుంటున్నావు. ఈ పరిస్థితిలో పోలీసులు నిన్ను విడిచి పెడతారని అనుకోవద్దు".

"కాని, యిన్‌స్పెక్టర్! అపరాధం చేసిన వాడు పోలీసుల బారినుండి తప్పించుకోవాలని ప్రయత్నిస్తాడు. చట్టాలకు అందకుండా పారిపోవాలనుకుంటాడు. తను నిర్దోషినని చెప్పుకోడానికి పోలీసుల దగ్గరకు రాడు...."

"అఫ్‌కోర్స్"

"నిజం చెప్పాలంటే, దీప దుస్థితి చూసేసరికి కొంచెం కంగారు పడ్డాను. అదే టైమ్‌లో మీకు లిఫ్ట్ దగ్గర కనిపించాను. అక్కడ ఎక్కువ సేపు ఉండడానికి మనస్కరించలేదు. అందుకే, నా ఫొటో మీకు యిచ్చి వెళ్ళిపోయాను. నేను అపరాధం చేసి ఉంటే, ఆ రాత్రి మిమ్మల్ని చూసి పారిపోయే వాడిని. ఈనాడు మళ్ళీ మీ దగ్గరకు వచ్చేవాడిని కాదు."

చిరునవ్వు నవ్వాడు షా. "కొంతవరకు నీ ఆర్యుమెంటు నేను ఒప్పుకుంటాను. కాని, పోలీస్ డిపార్ట్‌మెంట్ ఒప్పుకోదు. నువ్వు చెప్పదలచుకున్నదేమిటో, కోర్టులో చెప్పమంటుంది. పైగా, నువ్వు వేసుకుంటున్న ఈ డ్రెస్ చూస్తే, ఎవరికైనా నీమీద అనుమానం కలుగుతుంది" అన్నాడు.

"ఈ డ్రెస్ వేసుకోడానికి కూడా ఓ కారణం ఉంది. నేను చెప్పేది మీరు పూర్తిగా వింటే, అన్ని విషయాలు మీకే అర్థమవుతాయి."

"చెప్పు. వింటాను " అని, జీప్ వేగాన్ని తగ్గించాడు షా.

"వర్తమానాన్ని తప్ప - గతాన్ని, భవిష్యత్తును ఆలోచించే ఆడదికాదు దీప. ఆకలితో పాటు - ఎప్పటికప్పుడు కామదాహం తీర్చుకోడంకూడా ఆమెకు సర్వసాధారణమైన విషయం. రేపు మీద ఆమెకు నమ్మకం లేదు. అయితే కోరికలకు బానిసై చరిత్ర నుండి దిగజారిపోయింది. బజారు మనిషిలా తయారయింది .. "

"ఈ జిట్ ?" ఆశ్చర్యంగా ప్రశ్నించాడు షా.

"యస్.... చూసే వాళ్ళకు మహా పతివ్రతలా కనిపిస్తుంది. ప్రజా సేవకురాలిగా వ్యవహరిస్తుంది. కాని, ఆమె తెర వెనక జీవితం మహా నికృష్టమైనది...."

"సెక్స్‌కు అలవాటు పడిపోయింది. అంతేనా?"

"అలవాటు మాత్రమే కాదు, యిన స్పెక్టర్! సెక్స్‌కు,విలాసాలకు,దుర్వ్యసనాలకు బానిసై పోయింది. తాగకపోయినా, పురుష స్పర్శ తగలకపోయినా నిద్రపోలేదు. అందు కే, ఓ ఆషక్‌ని పెట్టుకుంటుంది."

"అంటే......?"

"జిగోలో ... "

"అర్థం కాలేదు."

"ఓ మగాడిని ఉంచుకుంటుంది."

"ఐ ... సీ ... "

"దీపకు నేను ఆషక్‌ని, జిగోలోని. ఆమె నన్ను ఉంచుకుంది. తనకు తీరికున్నప్పుడు ఫోన్ చేసి పిలుస్తుంది. నేను వెళ్ళి, ఆమె కోరికలు తీరుస్తాను. ప్రతిఫలంగా ఎంత డబ్బయినా యిస్తుంది."

"నువ్వు యిలా డ్రెస్ చేసుకోవడం ఆమె కిష్టమా?"

"ఔను. నేను వేసుకుంటున్న డ్రస్సులన్నీ ఆమే కొని యిచ్చింది."

"ఆమె కూడా మేచింగ్ కలర్స్‌తో - ఫేషన్‌బుల్‌గా, రోజు కో రకంగా డ్రస్ చేసుకుంటుంది. యాం ఐ కర్‌క్ట్?"

"సెంట్ పెర్సెంట్ ."

"డ్రస్సుల్లాగే రోజు కో మగాణ్ణి మారుస్తుందని విన్నాను. నిజమా?"

"నిజమే. సెక్స్ విషయంలో ఆమెకు మొహమాటం లేదు. తనకు యిష్టం లేని మగాడిని దగ్గరకు రానివ్వదు. ఇష్టమైన వాడిని విడిచి పెట్టదు - పదే పదే పిలిపించుకుంటుంది."

"ఆనాటి రాత్రి ఆమె నిన్ను రమ్మన్నదా?"

"ఆ సాయంకాలమే రమ్మన్నది. రాత్రి 9 గంటలకు ఎవరినో డిన్నర్‌కి పిలిచానని చెప్పింది. నన్ను 7 గంటలకు వచ్చి, 8 గంటల వరకు ఉండి, వెళ్ళి పొమ్మన్నది. కాని, ఆనాడు నేను కాస్త ఆలస్యంగా వెళ్ళాను. 7 గంటలకు వెళ్ళి ఉంటే బాగుండేది."

"ఏం చేసే వాడివి?"

"ఆమె మీద దౌర్జన్యం జరగనిచ్చేవాడిని కాను."

"ఆమె గురించి నువ్వెందు కింత సీరియస్ కావాలి?"

"దీపంటే నాకు చాలా అభిమానం."

"నీ కంటే చాలా పెద్దది ఆమె."

"నిజమే నామీద రెట్టింపు వయసుంటుంది ఆమెకు. చిన్నతనంలో ఏవో తప్పులు, అపరాధాలు కూడా చేశానని అప్పుడప్పుడు చెప్పింది. కాని, నేనంటే మహాపిచ్చి. ఆమెకోసం ప్రాణాలయినా యిస్తాను. ఆమె మీద దౌర్జన్యం చేసిన వాళ్ళ ప్రాణాలు తీస్తాను."

"ఆపని నువ్వు చెయ్యలేవు."

"ఎందుకని?"

"దీప మీద అత్యాచారం చేసింది మరో ఆడది."

"ఎవరామె?"

"ఆమె కూడా నీ ప్రియురాలే."

"పేరు ?"

"ఊర్వశి."

స్తంభించి పోయాడు మదన్. కొన్ని క్షణాలు ఆలోచిస్తూ ఉండిపోయాడు. చటుక్కున "ఇన్‌స్పెక్టర్! మీ వూహ నిజమే కావచ్చు." అన్నాడు.

"వూహ కాదు - వాస్తవం చెబుతున్నాను. నా దగ్గర చాలా ఆధారాలున్నాయి."

"ఒప్పుకుంటాను. కాని, ఊర్వశి అమాయకురాలు. దీప వల్ల ఆమెకు అన్యాయం జరిగింది. ఆ ఆవేశంలో ఆమె ఏదో చేసి ఉంటుంది."

"మరో విషయం. దీప హాస్పిటల్లోంచి పారిపోయింది. తెలుసా?"

"విన్నాను." అని అటూ - ఇటూ చూశాడు మదన్. జీప్ చాలా దూరం వచ్చింది. "ఎక్కడికి తీసుకెళుతున్నారు నన్ను?" ప్రశ్నించాడు.

"జయరాజ్ గారింటికి. అక్కడ నాకు కొద్దిగా పనుంది."

"నన్నిక్కడ దింపేయండి. మళ్ళీ కలుస్తాను."

"నిన్ను విడిచి పెడితే, మళ్ళీ నీకు తీరికున్నప్పుడు వచ్చి కలుస్తావు. కాని, అర్జంటుగా నీతో మాట్లాడవలసిన సంగతులు చాలా ఉన్నాయి. ....." చిన్నగా నవ్వుతూ జీప్ వేగాన్ని పెంచాడు షా.

## 54

జయరాజ్ భవనం ముందు నిలబడింది జీప్.

గేటు తెరిచాడు గూర్ఖా.

పోర్టికోలోకి వచ్చింది జీప్. ఫియెట్ కారు వెనక ఆగింది. షా, మదన్‌లు కిందకు దిగారు.

ఫియెట్ మీదకు దృష్టిని సారించాడు షా. నొసలు చిట్లించాడు. చేతిలోని స్టిక్‌తో ఎడమ చేతిమీద చిన్నగా కొట్టుకున్నాడు. సాలోచనగా నిలుచున్నాడు.

ఆ కారును చూశాడు మదన్. తృళ్ళిపడ్డాడు. అంతలోనే సంబాళించుకున్నాడు. షా వంక చూసి చిరునవ్వు

నవ్వాడు.

"కమాన్!" అన్నాడు షా.

ఇద్దరూ భవనంలోకి బయలు దేరారు.

వారిని చూసి లోపలనుండి వస్తున్న నౌకర్లు, బైటనుండి లోపల కెళుతున్న గుమస్తాలు ; ఎక్కడి వారక్కడే నిలబడిపోయారు.

ఇంతలో -

లోపల నుండి ఎదురు వచ్చాడు జయరాజ్. సంవత్సరంనుండి జబ్బు పడిన మనిషిలా సగం అయిపోయాడు. ముఖంలో రక్తం లేదు, కళ లేదు, ఉత్సాహం లేదు. కళ్ళల్లో కాంతి లేదు, జీవం లేదు. నీరసంగా, దీర్ఘరోగిలా ఉన్నాడు. "రండి." తడి ఆరిపోయిన గొంతుతో ఆహ్వానించాడు.

"మోహన్ విషయం ఏమైనా తెలిసిందా?" అతనితో పాటు నడుస్తూ అడిగాడు షా.

"లేదు. మళ్ళీ అతని దగ్గర నుండి ఫోన్ కూడా రాలేదు."

"మీ మిసెస్ ఎలా ఉన్నారు."

"మొన్న రాత్రి నుండి ఆమె ఆరోగ్యం బాగా లేదు. ఫిట్స్ కూడా వస్తున్నాయి. పిచ్చి-పిచ్చిగా మాట్లాడుతోంది."

"నేను ధైర్యం చెబుతాను, పదండి." చొరవతీసుకుంటూ అన్నాడు షా.

నిరాకరించలేకపోయాడు జయరాజ్. మళ్ళీ ఆమె 'తల ..... తల' అంటుందేమోనన్న అనుమానం పీడిస్తోంది. తన గుట్టు రచ్చకెక్కుతుందేమోనన్న భయం కలుగుతోంది. అయినా తప్పించుకో లేక పడక గదిలోకి దారితీశాడు.

పరిమళ పడుకున్న గదిలో ప్రవేశించారుముగ్గురూ.

ఆమెను చూసి, పక్కలో బాంబు పడ్డట్లు అదిరిపోయాడు మదన్!

అతన్ని చూసి, నిశ్చేష్టురాలయింది ఆమె!!

వాళ్ళిద్దర్నీ మార్చి-మార్చి చూస్తూ, ఆశ్చర్యంగా నిలబడిపోయారు - జయరాజ్, షాలు!!!

మొన్నటి రాత్రి టాంక్ బండ్ దగ్గర ఆమెను సరిగ్గా చూడలేదు మదన్. కాని, ఆమేనని గుర్తుపట్టాడు. అంతకంటే విచిత్రమైన విషయం - ఆమె ముక్కు, ముఖం అచ్చం తనలాగే ఉన్నాయి వంపులు తిరిగిన పెదవులు, గడ్డం మధ్యలో సొట్ట, కంఠం ఒకేలా ఉన్నాయి!! రంగు కూడా ఒకటే!!!

ఆమెకు తనకు చాలా దగ్గర పోలికలు ఉన్నాయి! - ఎలా వచ్చాయి?

వేనిటీ బ్యాగ్‌లోని ఫోటోలు గుర్తుకొచ్చాయి మదన్‌కు.

వాటిని చూసి డియర్! నీకు ఆడవేషం వేస్తే, అచ్చం ఈమెలాగే ఉంటావు అంది ఊర్వశి.

వేనిటీ బ్యాగ్ లోని ప్రేమలేఖలు జ్ఞాపకానికొచ్చాయి మదన్‌కు.

- తన విరహాన్నంతా ఒలకబోసుకుంటూ, జోషి పేరిట -పచ్చిపచ్చిగా ఉత్తరాలు రాసింది పరిమళ. బజారు మనిషిలా ఫోటోల్లో ఫోజులు పెట్టింది.

ఏ ఫోటో చూసినా - ఊర్వశి చెప్పినట్లు, తను ఆడవేషం వేసుకుంటే, తనే ఆ ఫోటోలోని యువతి అనుకుంటారు!

ఒక వేళ -

ఆమె తన తల్లా!

అయితే -

జోషి తన తండ్రా? ....

- ఆలోచిస్తూ నిలబడి పోయాడు మదన్.

అతని వేషాన్ని చూసి, టేంక్ బండ్ దగ్గర తన వేనిటీ బ్యాగ్ దొంగిలించిన యువకుడు అతనేనని సూక్ష్మంగా గ్రహించింది పరిమళ. ఇప్పుడు అతని ముఖంలోని రూపురేఖలు చూస్తుంటే, అచ్చం తనలాగే ఉన్నాడు.

పైగా, నీ కొడుక్కి అన్నీ నీ పోలికలే, నీ బుద్ధులే - దొంగతనాలు, దౌర్జన్యాలు, శృంగార లీలలు అన్నాడు పంచశూలమ్.

అయితే -

అతను తన కొడుకా??? ... ... ...

మెదడు పగిలి పోయినట్లయింది పరిమళకు.

వాళ్ళిద్దరి ముఖాల్లోని దగ్గర పోలికలు చూసేసరికి - రక్త సంబంధీకులు కావచ్చునన్న భావం; జయరాజ్, షా లిద్దరిలోను కలిగింది.

కాని, ఎవరూ తమ మనసులోని అభిప్రాయాల్ని బైట పెట్టలేదు.

ఎవరి అనుమానాలు వారే బలవంతంగా మింగేశారు.

'మేడమ్! మోహన్ గురించి మీరుబెంగపెట్టుకోకూడదు. అతను చిన్న పిల్లవాడు కాదు - ఎమ్.ఫిల్ చదువుతున్నాడు. మీమీద కోపం వచ్చి పారిపోలేదు - మీకు చెప్పకూడని బాధ ఏదో అతన్ని పీడిస్తోంది. దానిని మీకు తెలియనివ్వకూడదని దూరం దూరంగా ఉంటున్నాడు. ఒకటి - రెండు రోజుల్లో, తప్పకుండా అతని జాడ తెలుసుకుంటాను నేను. ప్లీజ్, ధైర్యంగా ఉండండి." అన్నాడు నిశ్శబ్దాన్ని తొలగిస్తూ - షా.

"అదే ఆశతో బతుకుతున్నాను." అంది నీరసంగా పరిమళ.

"మీరు యిలా దిగులుగా ఉంటే, జయరాజ్ గారు కూడా ధైర్యాన్ని కోల్పోతున్నారు. మీరు లేచి, మామూలుగా తిరిగితే, ఆయన కూడా ఉత్సాహంగా ఉంటారు."

చటుక్కున లేచి, మంచం మీద కూర్చుంది పరిమళ.

ఆమెలో కలిగిన మార్పుకు ఆశ్చర్యపోయాడు జయరాజ్. ఫిట్స్‌తోను,



కలవరింతలతోను ఏవేవో రహస్యాలు బైట పెడతుందని మొదట్లో భయపడ్డాడు. కాని, ఆమె స్పృహలో ఉండి, తెలివిగా మాట్లాడ్డంతో అతనిలోని భయం తొలిగిపోయింది. ఉత్సాహంగా ఆమెకు చెయ్యి అందిచ్చాడు.

అతని చెయ్యి పట్టుకుని, మంచం దిగింది. "ఇన్‌స్పెక్టర్ గారు యిప్పటికి నాలుగైదు సార్లు వచ్చారు. ఎప్పుడూ కాఫీ అయినా తీసుకోలేదు. పదండి, కాఫీ పంపిస్తాను" అంది పరిమళ.

ఆమె మాటను నిరాకరించలేకపోయాడు షా.

అందరూ ముందు హాల్లోకి వచ్చి, సోఫాల్లో కూర్చున్నారు.

వంటింట్లో కెళ్ళింది పరిమళ. పనిమనిషికి కాఫీ పురమాయించింది.

నాలుగు కప్పుల్లో కాఫీ కలిపి, ట్రేలో పెట్టుకుని హాల్లోకి వచ్చింది పనిమనిషి.

నలుగురూ కాఫీలు తాగారు.

"నా మాట మన్నించినందుకు చాలా థేంక్స్ మేడమ్! మీరిలాగే నిశ్చింతగా, ఉత్సాహంగా ఉండాలని నా కోరిక." అన్నాడు షా.

"ప్రయత్నిస్తాను."

"బె ది బె ... ఇతని పేరు మదన్..."

"మదన్!" రెట్టించాడు జయరాజ్.

"యస్. షోకిలా పురుషుడు. ఇంగ్లీషు సినిమాల్లో హీరో వేషాలు వెయ్యాలని ఉబలాట పడుతున్నాడు. " అంటూ చిన్నగా నవ్వాడు షా.

"ఇప్పుడేం చేస్తున్నారు?" పరిమళ ప్రశ్నించింది.

"పోలీసులకు అయిష్టమైన పనులన్నీ చేస్తుంటాను." ఉద్దేశపూర్వకంగానే సమాధాన మిచ్చాడు మదన్.

"అంటే దొంగతనాలు, దోపిడీ లేనా?" లేని నవ్వు తెచ్చుకుంటూ అడిగింది పరిమళ.

మదన్ ఏదో చెప్పబోయాడు. కాని, మధ్యలోనే కలగజేసుకున్నాడు షా. "అంతకంటే పెద్దపెద్ద పనులు చేస్తుంటాడు." అన్నాడు నవ్వుతూ.

"మీ రిద్దరూ స్నేహితులా?" జయరాజ్ ప్రశ్నించాడు.

"అఫ్‌కోర్స్ .... మదనంటే నాకు యిష్టం." చెప్పాడు షా.

"అపరాధాలు చెయ్యడమంటే నాకు మహా యిష్టం." అన్నాడు మదన్.

"ఏ అపరాధినీ పోలీసులు క్షమించరు."

## 28 పాఠకులకో సవాల్!



### రమ్మంటే ఎందుకో అనుకున్నా. ఓస్! యిందుకా?

ఇది ఓ వాగ్బాణం అనుకొండి దీన్ని మరో వాగ్బాణంతో మీరు ఉపసంహరించాలి– ఆ "రిపార్టీ" గుచ్చుకోవాలేగాని బాధించకూడదు. రసభరితంగా వుండాలేగాని అశ్లీలం కొట్ట వచ్చినట్లుండరాదు... కార్డు మీద మాత్రం రాయాలి. ఈ వాక్యం పైన రాసి మీ ప్రతి వాక్యం దాని క్రింద రాయండి. మీ పూర్తి చిరునామా ముఖ్యం. ప్రచురించిన రెంటికీ రు. 25, రు. 15 చొప్పున బహుమతి వుంటుంది!– ఈ విషయంలో సంపాదకునిదే తుది నిర్ణయం.

**19-7-'89 లోగా అందేలాగా రిపార్టీలు పంపించాలి!** –సం.

చాలా మంది వెంటనే "రిపార్టీ"ల వర్షం కురిపించారు. కొన్ని మాత్రం ఎంపిక చేసి వేస్తున్నాం. బహుమతులు పొందిన రెండూకాక– మరికొన్ని యిక్కడ వేశాము. తతిమ్మా వారి "వాగ్బాణాలు" స్థలాభావం చేత వేయలేకపోయాం. లాటరీ తీసి కొందరి పేర్లు మాత్రం వేస్తున్నాం! ఒకసారి బహుమతి రాలేదని నిరుత్సాహ పడక మళ్ళీ ప్రయత్నించండి! సం.

### "కుక్కలున్నాయి జాగ్రత్త!" బైట బోర్డు చూడలేదా?

రు. 25 బహుమతి పొందిన రిపార్టీ:

"వేలి ముద్రగాడిని స్వామీ!"

శ్రీమతి పి. శోభారాణి (కావలి)

రు. 15 బహుమతి పొందిన రిపార్టీ:

"దొంగలుపడిన ఆర్నెల్ల తర్వాత గదా అవి మొరుగుతాయ్!"

-వి. కె. జోసెఫ్ (నందికొట్కూరు)

### మరి కొన్ని వాగ్బాణాలు

"మొరిగే కుక్కలు కరవ్వుగా!"

- యం. నాగమణి (గుడివాడ), చంద్రిక (ఎనికేపాడు), ఎ. రంగబాబు (హైదరాబాద్), ఎ. కొండలరావు (పార్వతీపురం), ఓ అర్కారావు (మద్రాసు).

"కుక్కలున్నచోటనే చక్కని చుక్కలుంటారని"

- డి. రవికాంత్ (అర్కూరు).

**లక్కీ పేర్లు:**

ఆర్. మదన్‌మోహన్ (వరంగల్), ఎ. వి. ఆర్. ప్రసాద్ (నెల్లూరు), టి. వి. రాఘవశర్మ (భద్రాచలం), ఎం. కుమార్ (విజయనగరం), జి. రమేష్‌బాబు (ప్రత్తిపాడు), పి. శ్రీధర్ (అల్వాల్), అన్వేష్ (సత్తుపల్లి), ఉమశ్రీ (అనంతపురం), ఎ. రాంబాబు (తుని), బి. శరత్‌బాబు (హైదరాబాద్), కె. పి. రావు (గణవవరం), ఎ. ఎ. జయప్రకాష్ (బాపట్ల), శ్రీధర్ (మద్రాసు), ఎన్. సుబ్బలక్ష్మి (నర్సీపట్నం), రఫీ (కాశీబుగ్గ).

# పంచశూలమ్

"మీ రున్నారుగా – రక్షించడానికి."

"నేనూ పోలీసునే."

"నా విషయంలో కన్సెషన్ చూపించాలి."

"ఎందుకని?"

"మీరు నా ఆత్మీయులూ, శ్రేయోభిలాషులూ కనుక ....."

"గుడ్! చాలా స్పోర్టివ్‌మాన్." అభినందించాడు జయరాజ్.

"అందుకే మీకు పరిచయం చేద్దామని తీసుకువచ్చాను. " అని, సోఫాలోంచి లేచాడు షా. ఇద్దరకు నమస్కరించాడు. "వస్తాం సార్! వస్తాం మేడమ్!" అన్నాడు.

"మళ్ళీ కలుస్తా మేడమ్! గుర్తుంచుకోండి, జయరాజ్ సాబ్!" అని, షాను అనుసరించాడు మదన్.

వాళ్ళవంకే చూస్తూ, శిలాప్రతిమల్లా ఉండిపోయారు జయరాజ్, పరిమళలు!!!

## 55

జీప్ స్టార్ట్ చేసి, ఫియెట్ కారు వంక మరోమారు పరీక్షగా చూశాడు షా. పళ్ళు పట-పట కొరుకుతూ, ఏక్సిలేటర్ని బలంగా నొక్కాడు. రాకెట్‌లా రోడ్డు మీదకు వచ్చింది జీప్.

"నువ్వు కాస్త ఎక్కువగా మాట్లాడావు, మదన్!" జీప్ డ్రైవ్ చేస్తూ అన్నాడు షా.

"లేదు, యిన్‌స్పెక్టర్! మొదట్లో నేనుమౌనంగానే ఉన్నాను. వాళ్ళను మూడ్ లోకి తీసుకురావడానికి మీరు నా మీద జోక్‌లు విసిరారు. మీ జోక్‌లు పండించటానికి నేనొక గూండాలా, దొంగలా, హంత కుడిలాముద్రవేసుకున్నాను. నామాటలు కూడా మీరు జోక్‌గానే తీసుకోవాలి."

"రసికుడివే అనుకున్నాను. లౌకికం కూడా తెలుసునే నీకు....!"

"లేదు, యిన్‌స్పెక్టర్! లౌకికం అన్న శబ్దానికి అర్థమే తెలీదు నాకు. భిక్ష మెత్తుకున్నాను. కూలిపని చేశాను. చిన్న చిన్న తప్పులు కూడా చేసి పెద్దవాడి నయ్యాను.కాని,ఒక్కమాటలో చెప్పాలంటే నిర్భాగ్య జీవితంలోంచి దౌర్భాగ్యపు జీవితంలోకి వచ్చాను."

"ప్రస్తుత జీవితం నీకు సంతృప్తిగా లేదా?"

"తృప్తిపడటానికిప్రయత్నిస్తున్నాను."

చౌరాస్తా దగ్గరకు వచ్చింది జీప్.

"ఇక్కడ ఆపుజెయ్యండి. నా కారు సర్వీసుకిచ్చాను. రెడీగా ఉంటుంది. తీసుకెళ్ళిపోతాను." అన్నాడు మదన్.

షడన్‌గా జీప్ ఆపాడు షా. "మళ్ళీ ఎప్పుడు కనిపిస్తావ్?" అడిగాడు.

"నా అడ్రసు తెలుసు మీకు. ఓ కానిస్టేబుల్ చేత ఎప్పుడు కబురు పంపినా వచ్చి కలుస్తాను ... కాని, పగలే...... రాత్రులు చాలా బిజీగా ఉంటాను. " అని, జీప్ దిగాడు మదన్.

"నిన్ను అరెస్ట్ చెయ్యడానికైనా పగలే రావాలా?"

అడుగు ముందుకు వెయ్యబోయి, చటుక్కున ఆగాడు మదన్. సూటిగా షా ముఖంలోకి చూశాడు. "నన్ను అరెస్ట్ చెయ్యడం మీ వల్ల కాదు, యిన్‌స్పెక్టర్!" అని, చర-చరా వెళ్ళిపోయాడు.

కోపంతో ఏక్సిలేటర్ని బలంగా తొక్కాడు ఇన్‌స్పెక్టర్ షాగా చెలామణీ అవుతున్న ఆ యువకుడు!!!

56

ఆమెను పరిశీలనగా చూశాడు షా.

పరువు ప్రతిష్ఠలు గల మధ్య తరగతి యువతిలా ఉంది. సౌందర్యాన్ని యవ్వనాన్ని రంగరించుకుంది. ఒంటికి పసుపు రాసుకుంది. నుదుట పెద్ద కుంకుమ బొట్టు పెట్టుకుంది. నేత చీర కట్టుకుంది. నిరాడంబరంగా, ముచ్చటగా ఉంది.

ఆమె ఊర్వశి!

"మీరు పిలిపించారని వచ్చాను. జరిగిన రచ్చ వినిపించాను. కుమ్మరి పురుగులా తొలిచేసి నా ఒళ్ళు గుల్ల చేస్తున్నారు పోలీసులు" అంది ఊర్వశి.

"చాలా పచ్చిగా మాట్లాడుతున్నావ్?" చిరుకోపంతో అన్నాడు షా.

"నిజం పచ్చిగాను, చేదుగాను, విషంలాగే ఉంటుంది. ... నేను తప్పు చేస్తున్నాను. ఈ విషయం సిటీలోని పోలీసు ఇన్‌స్పెక్టర్లందరికీ తెలుసు. ఒక్కోసారి వాళ్ళే చేయిస్తున్నారు. ... భీమరాజు లాకప్‌లో ఉన్నరాత్రి అబ్దుల్లా గారు నన్ను పిలిపించుకున్నారు. ఆ రాత్రి నేను పోలీస్ స్టేషన్‌కు వెళ్ళిన మాట నిజం. ఇన్‌స్పెక్టర్‌కు పొద్దంటుకు నా శరీరాన్ని సంతర్పణ చేసిన మాటా నిజమే......"

"తర్వాత?"

"అంత వరకే నేను చెప్ప దలచుకున్నాను."

"భీమరాజును నువ్వు చంపలేదా?"

"అది నేను చెప్పను. ఒప్పుకోను. మీరు నిరూపించండి."

"మరీ మొండిగా మాట్లాడుతున్నావ్? ఎలా వచ్చిందే నీ కీ గుండె ధైర్యం?"

"సారీ , యిన్‌స్పెక్టర్ సార్! గుండె, హృదయం అవేవి నాకు లేవు. ... ఊహ వచ్చేసరికి హీనమైన జీవితంలోంచి నా తల్లిని తప్పించాలని ఈ నీచమైన జీవితానికి అలవాటు పడ్డాను. ఈ వృత్తిలోకి వచ్చాక నా తల్లిని, చెల్లెల్ని ఉద్ధరించాలన్న ధ్యాస తప్పమరో భావన, స్పందన, అనుభూతి, సుఖం, దుఃఖం - యిలాంటి వేమీ లేవు ...."

మాట్లాడ లేదు షా. ఆమె ముఖ కవళికలు గమనించడానికి ప్రయత్నిస్తూ మౌనంగా ఉండి పోయాడు.

"సార్! గుండెలు, హృదయం లేని ఆడదాని ముఖంలో ఏ భావాన్నీ మీరు చూడలేరు. మా అమ్మ, చెల్లి నా కోసం ఎదురు చూస్తుంటారు. సెలవిస్తే, వెళ్ళివస్తాను."

"మళ్ళీ వస్తావా?"

"నాలాంటి ఆడవాళ్లకు యిది అత్తవారిల్లు కాపరం చెయ్యడానికి అప్పుడప్పుడు రావాలి తప్పదు."

ఆమె విసుగెత్తిపోయి, తెగించి ఉందని అర్థం జేసుకున్నాడు షా. ఆమెను రెచ్చగొడితే నిజం కక్కుతుందని భావించాడు. "భీమరాజు మీద ప్రయోగించిన విషంఎక్కడ సంపాదించావ్?" అని అడిగాడు.

"పోలీసు వారే సప్లయ్ చేశారని సరదాకు నేను అన్నా, మీకు కోపం వస్తుంది. అలాంటి కామెంట్స్ చెయ్యదలచుకోలేదు. అతన్ని నేను హత్య చేసినట్లు నిరూపించండి మీరు. లేదా, అనుమానం మీద అరెస్ట్ చెయ్యండి - నాకు అభ్యంతరం లేదు. వస్తా సార్!"

"ఛాలెంజ్ చేస్తున్నావా?" ఆమెను మరీ రెచ్చగొడుతూ అడిగాడు షా. "సారీ సార్! పోలీసుల మీద ఛాలెంజ్ చేసే ధైర్యం ఏ వ్యభిచారికీ ఉండదు. పరిస్థితుల్ని అర్థం చేసుకోమని కోరుతున్నాను.... అంతే." అని , ఆ గదిలోంచి బైటకెళ్ళబోయింది.

"ఆగు" అన్నాడు షా

ఆగిందామె.

"దీప తెలుసా నీకు?"

"తెలుసు"

"ఆమె మీద విరోధమెందుకు నీకు?"

"అలాంటిదేమీ లేదు"

"అయితే, ఆమెను చంపాలని ఎందుకు ప్రయత్నించావ్?"

"నేనా?"

"కాదు."

"మీరు చూశారా?"

"భీమరాజు చూశాడు"

"పూర్ ఫెలో సాక్ష్యం యిచ్చేంతలో పరకనా ప్రాణాలు నిలబెట్టుకోలేక పోయాడు."

"అతను సాక్ష్యం యిస్తే కేసు బలపడుతుంది. అందుకే అతన్ని అంతం చేశావు నువ్వు." దబాయించాడు షా.

కొన్ని క్షణాలు మౌనం వహించింది ఊర్వశి. మనసు కొడుతున్నట్లు రెండుసార్లు శ్వాస తీసుకుంది. "ఆల్ రైట్, యిన్‌స్పెక్టర్ సార్! నేను నిజం చెప్పలేను. అబద్ధం ఆడలేను. మీ మీద ఛాలెంజ్ చెయ్యలేను. దీపాదేవి మీద హత్యాప్రయత్నం చేసినట్లు, భీమరాజును చంపినట్లు, నిరూపించి నన్ను ఉరికంబం ఎక్కించండి. నమస్తే." అని, బైట కెళ్లిపోయింది.

కోపంతో టేబిల్ మీదగుద్దాడు షా.

ఓ కానిస్టేబుల్ లోపలకు వచ్చాడు "ఆమెను విడిచిపెట్టేయమంటారా, సార్?", అడిగాడు జేబులోంచి పర్సుతీశాడు. ఇరవై రూపాయల నోటు కానిస్టేబుల్ కిచ్చి "ఆటోలో పంపించు." అన్నాడు.

"డబ్బు మనమెందుకివ్వాలి సార్! పొమ్మంటే అదే పోతుంది - ఆటోలోనో, రిక్షాలోనో ...."

"షటప్. ఆమెను పిలిపించాం. తిరిగి పంపించే బాధ్యత కూడా మనమీద ఉంది."

## జూహీకి డిమాండ్!



హిందీ చిత్ర పరిశ్రమలోని వారే కాకుండా ప్రేక్షకులు కూడా హిట్ హీరోయిన్ 'జూహీచావ్లా'నే కోరుకుంటున్నారట.

'ఖయామత్ సే ఖయామత్ తక్' చిత్రం హిట్ కావడంతో జూహీ డిమాండ్ పెరిగిపోయిందట. ఆ చిత్రం తర్వాత జూహీ చిత్ర మేదీ విడుదల కాకపోవటంతో చావ్లాకు గిరాకీ పెరిగిపోయిందంటున్నారు.

వీడియో లైబ్రరీలలో 'గూంజ్' చిత్రానికి మంచి రెస్పాన్స్ వచ్చిందట. కాని పరిశ్రమలోని చెంచాగాళ్లను జూహీచావ్లా దగ్గరికి రానివ్వటం లేదట.

ఆమెకు తాను అందరి కంటే తక్కువేమోనన్న భావమున్నట్లు గమనించామంటున్నారు పరిశ్రమలోని పెద్దలు కొంతమంది. మరియింత డిమాండున్న నటికి ఈ భావం ఎందుకేర్పడిందో?

## ఫొటో వ్యాఖ్య పోటీ-22 ఫలితాలు



### బహుమతి పొందిన వ్యాఖ్య

# "చూడండి శిక్షణాధికారి-గారూ నాకో మంచి జోడీని కుదిర్చి పెట్టరూ?"

**- డి.వి. సత్యనారాయణ (తణుకు)**

"నోరున్న మానవుడికన్న"
"నోరులేని కాలభైరవుడే మిన్న!"
-టి. వీరభద్రయ్య (శ్రీకాకుళం)

"విశ్వాసంలో నీకు నువ్వే సాటి!"
"లేరు మరెవరూ నీకు పోటీ!"
- పి. పూర్ణకుమారి (అమలాపురం)

"పెంచినప్పుడు చేసేదు ముద్దు"
"పెద్దదై దాటిందిప్పుడు హద్దు!"
- వి. వి. పార్వతీశం (వరంగల్)

### లక్కీ పేర్లు

కె. మోహన్‌కుమార్ (పాలకొల్లు), జి. నరసింహమూర్తి (అయిజ), ఆర్. పి. వెంకటేశ్వర్లు (ప్రొద్దుటూరు), జి. జె. విఠల్ (మచిలీపట్నం), ఎన్. మనోహరరెడ్డి (చిల్లకూరు), ఎం. లక్ష్మీకాంతమ్మ (విజయవాడ), ఎన్. రాధాకృష్ణమూర్తి (పెదరావూరు), జి. వి. రాఘవేంద్రరావు (మచిలీపట్నం), వి. కామేశ్వరరావు (పార్వతీపురం), కె. వి. మధుసూదనరావు (కాకినాడ), మహర్షి (కొత్తగూడెం), సి. హెచ్. శ్రీనివాసరావు (దగ్గులూరు), మానస (హైదరాబాద్).

## పంచశూలమ్

మరో ప్రశ్న వెయ్యలేకపోయాడు కానిస్టేబుల్. గబగబా బెటకెళ్ళిపోయాడు.

దీప మీద దౌర్జన్యం చేసింది ఊర్వశి. కాని బుకాయిస్తున్నది. అదే రాత్రి ఆమెను పిలిపించుకున్నాడు అబ్దుల్లా. ఆ రాత్రే భీమరాజు హత్య చెయ్యబడ్డాడు. ఊర్వశి తప్ప మరెవరూ ఆ రాత్రి పోలీసు స్టేషన్‌కు వెళ్ళలేదు. కాని, భీమరాజును చంపవలసిన అవసరం ఆమెకేముంది? అతనికి, ఆమెకు సంబంధమేమిటి??? .....

పోలీసుల లాకప్‌లోని వ్యక్తిని ఓ ఆడది చంపగలదా?

ఆలోచిస్తూనే ఉన్నాడు షా. టెలిఫోన్ మోగింది. రిసీవరు అందుకుని "హలో !" అన్నాడు .

"మిస్టర్ షా! నువ్వింత అమాయకు డివనుకోలేదు.' అవతలి కంఠం హేళనగా పలికింది.

"వాట్?" రెట్టించాడు షా.

"యస్. నీలాంటి అసమర్థుడు సి.ఐ.డియిన్స్పెక్టర్‌గా పనికిరాడు."

విపరీతమైన కోపం వచ్చింది. రిసీవరు నేలకేసి కొడదామనుకున్నాడు. 'షటప్' అని అరుద్దామనుకున్నాడు. అంతలోనే నిగ్రహించుకుని, మౌనం వహించాడు షా.

"నా మీద నీకు కోపం వచ్చి ఉంటుంది. ఎదురుగా ఉంటే రివాల్వర్‌తో కాల్చి పారేసే వాడివి. లేదా, గుండు సూదితో నీ గోరులో గుచ్చుకునేవాడివి. ఆ రక్తం పీల్చి నీకు నువ్వు తృప్తి పడేవాడివి. కాని ఆవేశపడకు, ఆలోచించు. నీ పొరపాటును సవరించుకో." గంభీరంగా వినిపించింది అవతలి కంఠం.

ఆ వ్యక్తి ఎవరో తెలీదు. కాని, మనస్తత్వం అతనికి బాగా తెలుసు. బహుశా తన రహస్యం కూడా తెలుసునేమో!...

పూర్తిగా తమాయించుకున్నాడు షా. "జరిగిన పొరపాటేమిటో చెప్పండి." అన్నాడు.

"పరిమళ యింటి కెళ్ళావా?"

"వెళ్ళాను."

"ఆమె కారు చూశావా?"

"చూశాను."

"ఆమె యింటి కెళ్ళావ్. ఆమె కారు చూశావ్. పిచ్చి పుల్లయ్యలా తిరిగి వచ్చావ్."

"మీరు చెప్పాలనుకున్నది సూటిగా చెప్పండి."

"ఆమె కారు డిక్కీలో ఓ కుర్రాడి తల ఉంది. రెండు రోజుల నుండి కుళ్ళుతోంది."

అవతలి వ్యక్తి మాటలు విని పక-పకా నవ్వాడు షా. అంతలోనే నవ్వు ఆపుజేశాడు." ఆ సంగతి నాకు తెలుసు. డిక్కీలోని తల ఎక్కడికీ పోదు - ఆ భవనం చుట్టూ పదిమంది కానిస్టేబుల్సు మఫ్టీలో కాపలా ఉన్నారు. .... ఆ తల యింకా బాగా బాగా కుళ్ళాలి. కుళ్లి కుళ్లి వి పరీతమైన దుర్వాసన రావాలి. ఆ వాసన భరించలేక జయరాజ్, పరిమళలు తలలు పగిలిపోవాలి......" అన్నాడు కోపంగా.

"గుడ్." అంతవరకు హేళనగా మాట్లాడిన అవతలి వ్యక్తి - చటుక్కున రిసీవరు పెట్టేసినట్లు శబ్దం వినిపించింది.

నొసలు చిట్లించాడు షా. రిసీవరు ఫోన్ మీద పెట్టాడు. పళ్లు పట పట కొరికాడు. పిన్ కుషన్ లోంచి గుండుసూది తీశాడు. చిటికిన వేలు వంక చూసు కున్నాడు. గుండుసూది గుచ్చబోయాడు.

అదే సమయంలో ఓ కానిస్టేబుల్ లోపలకు వచ్చాడు. "సార్! ఓ దుర్వార్త." అన్నాడు.

"ఏమిటది?"

"మీనాక్షి గుండె ఆగి చచ్చిపోయింది."

టేబిల్ మీద పడేశాడు గుండు సూదిని. మెరుపులా కుర్చీలోంచి లేచాడు షా.

(ఇంకా ఉంది.)



కాజ హనిత, ఏలూరు

నేటి యువతకు ప్రేమ వ్యవహారాలు ఎక్కువైపోతున్నాయి. వయస్సు తెచ్చే ఆకర్షణే యిది. ఎందుకంటే ప్రేమించేదొకరిని. పెళ్లాడేది యింకొకరిని. ఈ దిగజారుడు తనానికి యువత పాలు పడడం దురదృష్టకరం. మీరేమంటారండీ?

నిజమే! ఎదిగే వయస్సులో - చుట్టూ వాతావరణం ఎలా వుందో - దాని ప్రభావం యువతపై వుంటుంది. నేటి యువత చుట్టూ వున్నదేమిటి?! మీకు తెలియడం లేదా!

మగవాడు స్త్రీ తెచ్చే కట్నం కానుకలపైనే ఎక్కువ మక్కువ చూపుతాడు. స్త్రీ కానులు కిడతాయిగాని ఆమె అన్ని రంగాలలో ముందు వస్తే మాత్రం సహించలేరు. ఆ ఆడది అని చులకన చేస్తారు. కాని ఆమె తెచ్చే డబ్బు ఆరాలు తీస్తారు.

సిగ్గులేనితనాని కిది - పరాకాష్ఠ. ఆధారపడిపోతూ అజమాయిషీ చెలాయించడం - ఇన్‌ఫీరియారిటీకి - మొదటి మెట్టు. ఆడదాని సంపాదనలో రూపాయికి విలువ తక్కువా?!

నిజమైన అభిమానిని గుర్తించడం ఎలా?

అది మనసు చేస్తుంది.

న్యాయ పతి రమేష్‌బాబు, హైదరాబాదు

ఎన్. టి. ఆర్. గ్రామ ప్రజలకు తుపాకులు పంచి పెడతారట - తీవ్రవాదులను ఎదుర్కోడానికి.

* ఇచ్చిన ప్రతి తుపాకికీ లైసెన్సు కోరాలి. కొనడానికి గ్రామ గొప్ప ప్రజలకే డబ్బు వుంటుంది. మనం యీ చిన్న విషయం మరిచిపోకూడదు.

చాలాకాలం తరువాత పత్రికలో మీ సీరియల్ వస్తూంది. ఎదురు చూస్తున్నాం.

* సారీ! అది కలువబాలలో వస్తూన్నది. చూడండి.

ఈ రోజుల్లో డబ్బే ముఖ్యం. ఎన్ని చెడు పనులు చేసినా డబ్బుతో కప్పిపోతున్నది. ఏమంటారు మేడమ్?

* డబ్బు ముఖ్యమే. కాని దాంతో - అన్ని తప్పులూ కప్పెట్టడం కష్టం. ఎందుకో తెలుసా? డబ్బిచ్చిన కొద్దీ - అవతల వాడి ఆశ పెరుగుతుంది!

ముల్లును ముల్లుతోనే తియ్యాలి. రౌడీయిజంని రౌడీయిజంతోనే రూపుమాపాలా?

* అలా అని మన సినిమాలు, సినీ నవలా సీరియల్స్ చెప్తున్నాయి కనుక నమ్మాలేమో!

ఓటు మీకుందా? దాన్నెలా వినియోగిస్తారు?

* దొందూ దొందే అయినప్పుడేం చేస్తాం - ఇన్‌వాలిడ్ ఓటు వేసి వస్తాను కసిగా.

# ఈ మనుషులు ఇంతే!

వక్కంతం సూర్యనారాయణ రావ్

మెదడుని కప్పిన నిద్రపొరలు ఒక్కసారిగా తెగిపోయాయి. ఉలిక్కిపడి మేలుకున్నాను. పెళ్ళయ్యాక ప్రతీ ఉదయం ఇలా ఉలిక్కిపడి మేలుకోడం, లేదా, మేలుకుని ఉలిక్కిపడ్డం అలవాటై పోయింది ……

గరిట తగిలిన ఖాళీ కంచుపాత్రలా, నా 'ఇంటిదీపం' కంఠం మోగుతోంది …

"ఏమిటిది? పాలా? తెల్లనీళ్ళా? ఇలా అయితే లాభం లేదు. వేరే వ్వాని ఏర్పాటు చేసేసుకుంటాను!"

"మా గోవమ్మ తోడు .. నీళ్ళు కలపలేదండమ్మగోరూ!" పాలతను, మెల్లగా అంటున్నాడు.

"ఒట్టుకూడా జాగర్తగా పెట్టుకుంటు న్నావ్! నీళ్ళు కలపలేదేమో... నీళ్ళలోకి పాలే కలిపావేమో!" 'అమ్మగోరు' చురక అంటించింది.



"అలాగనకండమ్మగోరూ! పిల్లాపాపా లేనోళ్ళం. బిక్కు బిక్కుమంటూ కొంపలో ఆడదీ నేనూ .. నీళ్లు కలిపి సంపాయించి ఎవురికి బెట్టిపోవాలండి! ఈ 'అమ్రుతం' తోడండమ్మగారూ .. పొదుగు కడిగి, తుండుగుడ్డతో తుడిచేసి మరీ పితికానండి!" పాలతను ... పాపం ...

"సర్లే! రెండేళ్ళుగా ఈ ఒట్లతోనే నెట్టు కొచ్చేస్తున్నావ్! ఈ నెలాఖరు దాకా చూస్తాను .. తరువాత .. నీ ఇష్టం .. " 'అమ్మగోరు' ... 'కంచుకుండ' పగలేసి మరీ ... తలుపు మూసుకుంది. చలిని దూరంగా వుంచుతూ, అమ్మగోరి కంఠాన్ని దూరంగా వుంచడంలో వోడిపోయిన రగ్గుని మొహంమీంచీ కిందికి జరిపాను. అలవాటు ప్రకారం, అప్రయత్నంగా పక్కకి చూశాను. పక్కన 'పిల్ల' లేదు. నా తల్లి బజ్జుంది. నిద్రలేచేసరికి, తెరిచిన కళ్ళని మొట్టమొదట తన మొహం కనిపించాలని మొత్తుకున్నా లాభం లేకపోయింది. అత్తారింట్లో ఉన్నంత కాలం అర్ధాంగి, ఎంత ఆలస్యంగా కళ్ళు తెరిచినా, - తన మొహం చూసే అదృష్టాన్ని ప్రసాదించింది. ఉద్యోగం దొరికి వేరే ఊళ్ళో, ఈ ఇంట్లో కాపరం ప్రారంభించాక, తెల్లారకముందే లేచిపోతోంది. ఎంతైనా ఇది 'తన ఇల్లు; తన సంసారం. అది .. అత్తారిల్లు! ఇక్కడ ఎంత ఆలస్యంగా మంచం దిగినా తనని అడిగే వాళ్ళు లేరు. అక్కడ ... నిట్టూరుస్తూ, నవ్వుకుంటూ పక్కకి తిరిగాను. ఆడాళ్ళు అంత సులభంగా అర్థం కారు!

ఉత్పల వెల్లకిలా పడుకుంది. తెల్లగా గడ్డకట్టుకుపోయిన మంచుమీదికి వాలిన గులాబీ పువ్వులా తెల్లదుప్పటిమీద చిన్నారి మొహం. గుండ్రటి మొహం మీద కేంద్రీకరించిన స్వచ్ఛమైన అందాన్ని ప్రత్యేకించి చూపించటానికి పెట్టిన హద్దుల్లా, ప్రేములా, రెండువైపులా పైకి సాగిన బుల్లిచేతులు. సగం మాత్రం విచ్చుకున్న మొగ్గల్లా చిన్నారి పిడికిళ్ళు.

నా చూపులు వాత్సల్య కిరణాల్లా కిందికి పాకాయి. గౌను పైకి ఎగబాకింది. తృప్తిగా, వెచ్చగా, నిండుగా పాలు నింపుకున్న బొజ్జ.రబ్బరు బొమ్మ కాళ్ళు. చిన్నిపాదాలు దుప్పటిని కిందికి తోసేశాయి .. ఎప్పుడో .. నిద్రలో నా చెయ్యి ప్రేమ బరువుతో కదిలింది. కదలిక తెలీకుండా దుప్పటిని బుజ్జి బొజ్జమీదికి జరిపింది. నాకళ్లు మళ్ళా పైకి కదిలాయి.

బూరెల్లా పొంగిన పాలబుగ్గలు.. ఉత్పల చిన్ని నోరు కొద్దిగా తెరుచుకుంది. పెదవులుకదిలాయి.మూసుకున్నకళ్ల చివర్లలో గీతలు పడ్డాయి. ఆ మొహంలో ఏడుపు మౌనంగా కనిపిస్తోంది. అమ్మో .. నాతల్లి నిద్రలోకి ఏ బూచాడొచ్చాడో! క్షణంలో ఆ మొహంలోని భయం మాయమైంది. చిగురు పెదాలు కొత్తరకంగా కదిలి నవ్వుని సృష్టించాయి.

ఆవేశంతో ముందుకి వంగాను. బంగారు బుగ్గల్ని పెదాలతో తాకి తేలిగ్గా ముద్దెట్టుకున్నాను. ఆ తేలిక ముద్దులో ఆవేశం ఎంత బరువుగా వుంది! ఉత్పల మొహంఒక్కసారిగగుర్పొడిచినట్టు చలించింది. మీసాలు గుచ్చుకుని గిలిగింతలు .. పాపం ... దూరంగా జరిగి తలగడని ఆశ్రయించాను. ఉత్పల ఎంతమంచిదో ... 'ఛీ పాచి మొహం!' అనలేదు వాళ్లమ్మలాగా!

కాఫీ ఇంకా అయినట్టు లేదు ... కళ్ళు మూసుకున్నాను. పక్కన పడుకున్న ఉత్పల మొహం తటాలున నా మూసిన కళ్లముందు ప్రత్యక్షమైంది ... ఉత్పల తప్పటడుగులు వేస్తోంది ... ఉత్పల పచ్చగడ్డిమీద లేగలా పరుగెడుతోంది ... ఉత్పల ... సైకిల్ మీద వయ్యారంగా కూచుంది. తలతిప్పి నావైపు చూస్తోంది., ఏదో పాత సినిమాలో షర్మిలా ఠాగోర్ కళ్ళతో నాన్నా టాటా అంటోంది ... సైకిల్ రివ్వున పోతోంది ... ఉత్పల గోడవారగా కూచుంది ... పరికిణీ ... ఓణీ ... కాలేజీ లేదామ్మా? అడుగుతున్నాను.ఉత్పలతలెత్తి మౌనంగా చూసింది. ఎందుకు నా తల్లి మొహంలోకి రక్తం కెంపుల్లా ఎగబాకింది. తల వంచుకుంది. కాలేజీ ఎగ్గొట్టి మూలకూచుండెందుకు?

సువర్ణికా, అమ్మాయి కాలేజీకెళ్ళ లేదు ..ఎందుకు?అర్ధాంగిని అడుగుతున్నాను. కొత్తగా నవ్వుతోంది. 'మీ అమ్మాయి ఆడదయ్యింది' .. గుసగుసగా .. "తెలీదుగా .. కంగారుపడిపోయి .. ఏడుస్తూ వచ్చేసింది ." నాలో ఆశ్చర్యం. ఆశ్చర్యం ఆనందంగా మారింది. ఆనందం నవ్వుగా ఎదిగింది.

"ఏమిటి తెగ నవ్వేస్తున్నారు? కలలో ఎవతేనా గిలిగింతలు పెట్టిందా?"

తటాలున కళ్లు తెరిచాను. శ్రీమతి రెండుచేతుల్లో రెండు కాఫీ లోటాలు. పక్కకి చూశాను. ఉత్పల ... చిన్నారి ఉత్పల కలని కల్లగా మార్చే కఠిన సత్యంలా ఇంకా అలాగే బజ్జునే వుంది. నవ్వుకుంటూ లేచాను. రగ్గుని తోసేస్తూ పద్మాసనం వేసుకున్నాను. మెత్తటి తలగడని వొళ్లో పెట్టుకుని రెండు మోచేతులూ ఆన్చుకున్నాను.

"ఉత్పల పరికిణీ, వోణీ వేసుకుని, పెద్దమనిషయింది .. కలలో!" నవ్వుతూ,- పదినిమిషాల కలలో దూసుకెళ్ళిన పదిహేనేళ్ల భవిష్యత్తుని, వరసగా చెప్పాను. "అమ్మాయి పెద్దయింది.నువ్వు మాత్రం అలాగే ఉన్నావ్! ఆ కొలత ప్రకారం వయసు ముదర్లేదు!"

సువర్ణిక అర్ధవంతంగా నవ్వింది. అర్ధవంతంగా నవ్వడం ఆడవాళ్ళకే తెలుసా? "కూతురు ఎదగాల్సిందే. పెళ్లాం మాత్రం పర్మనెంటుగా పెళ్లికూతురి ఈడులోనే వుండిపోవాలి, కలల్లో కూడా! మగబుద్ధే అంత! ఊ .. చల్లారిపోతుంది; కానివ్వండి!"

పొగలు చిమ్ముతున్న కాఫీ కప్పు అందుకున్నాను. ఆవిరి కమ్మగా నోరూరి స్తోంది. చప్పరిస్తూ లొట్టవేశాను. కాఫీ అమృతం లావుంది. అమృతాన్ని 'అమ్రుతం'



అన్న పాలవాడు గుర్తొచ్చాడు.

"కాఫీ బ్రహ్మాండంగా వుంది. నీళ్ళు పాలు ఎక్కువగా వున్న పాలతో కాఫీ ఇంత కమ్మగా తయారు కాదు కదూ?"

"మరే!" సువర్ణిక లోటా అంచు మీంచీ చూస్తూ అంది.

"మరి, పాపం, పాలు నీళ్ళగా వున్నా యంటూ పాలవాణ్ణి గానుగాడేశావ్!"

"అలా అనాల్లెండి. లేకపోతే ..."

"అది కాదు, సువ్వీ ...."

"సువ్వీ, రోకలి పోటూ! ఏమిటా పేరు? నాలగక్షరాలూ శుభ్రంగా పలకలేరూ! ఎన్ని లక్షల సార్లు చెప్పాలి?" సువర్ణిక హుంకరించింది.

"సారీ ...అదికాదు సువర్ణికా, చిక్కటి

## ఈ మనుషులు ఇంతే!

పాలు సప్లై చేసినప్పుడు మెచ్చుకోవాలి. నీళ్ళు కలిపినప్పుడు మాత్రం ... "

"మీకు తెలీదు లెండి!" సువర్ణిక అడ్డుతగిలింది."ఇవాళపొగిడితే,రేపు నీళ్ళపాలే, మనపాలు! మనుషుల తత్వం మీకర్థంకాదు లెండి. అలా అంటూంటేగానీ, మనలాంటి వాళ్ళకి మంచిసరుకు దొరకదు!"

సువర్ణిక విశ్లేషణ నన్ను ఆశ్చర్యంలో పడేసింది. అంతేనా?

"నాకలా అనిపించడంలేదు. గట్టి పాలుపోసినప్పుడు నిజంచెప్తూ మెచ్చుకుంటే అతను సంతోషిస్తాడు. తరవాత గట్టిపాలే పోస్తూ ఉంటాడు. మంచిపని చేసినప్పుడు మనిషిని మెచ్చుకోవాలి. అదీ సైకాలజీ .. మన పాలవాడు... "

"రేపొస్తాడు. మెచ్చుకుని, సన్మానం చేయండి. ఎల్లుండి కాఫీతాగి నన్ను తిట్టిపోస్తారు! కాఫీ కాచడం సరిగా నేర్పించ లేదని మా అమ్మను తిడ్తారు!" సువర్ణిక విసురుగా లేచి, లోటాకోసం చెయ్యిచాచింది.

"ఏమిటో నీ వాదన! ఈ ఆర్గ్యుమెంట్ ... పోనీ అనాలిసిస్ వింటే, ఫ్రాయిడ్‌కి మతిపోతుంది!" నవ్వుతూ లోటా అందించాను.

"సంతోషం! అయినా ఇదంతా మీకెందుకు? మీపాలవాణ్ని కొరతవేయలేదు లెండి!సంసారంనడవాలంటే, మోసపోకుండా వుండాలంటే ఇలాగే వ్యవహరించాలి. మీకు మనుషుల సంగతి తెలీదు! కలలు కనమంటే కంటారు!"

గుమ్మం దాటుతున్న అర్ధాంగిని విడ్డూరంగా చూస్తూ, మంచందిగాను ...

★ ★ ★

"ఆ ( .. లెక్కకేంగానీ, అన్నీ వున్నాయిలే. ఏంటి, గుడ్డలుతకడం ఇలాగేనా? నీళ్ళల్లో ముంచి, నీలిరంగులో పిండి, ఆరేసుకొచ్చావా? మురికి పోవాలి. కనపడకుండా బ్లూ కోటింగ్ ఇస్తే లాభం లేదు!" సువర్ణిక కంఠం గదిలోకి దూసుకొస్తోంది.

"అదేంటమ్మగారూ, ఉతక్కుండానే ఇలా తెల్లగా అవుతాయా గుడ్డలు? భలే వారే!" చాకలిపిల్ల చిన్నగా నవ్వింది.

"ఆ ఉతికారు! వీటిమీద చూడు, మురికి చారలు అలాగేవున్నాయ్. ఇస్త్రీ చేయడం ఇట్లాగేనా? మీ అయ్యకి చెప్పు ఈ తెల్లగుడ్డలు .. అసలు .. అయ్యగారు వేసుకోరు!"

సువర్ణిక కుడిపైట వేసుకున్న చాకలిదానిలా గదిలోకి వస్తూ అవుపిస్తోంది .. అద్దంలోంచి. తల దువ్వకోడం ముగించి, పక్కకి తిరిగాను. ఇస్త్రీ గుడ్డల దొంతరని జాగర్తగా టేబుల్ మీద పెట్టి నావైపు నవ్వుతూ చూసింది.

"ఏమిటలా గుడ్లు పెళ్ళగించి చూస్తున్నారు?"

"అద్దంలో ఇందాకా కుడిపైటతో అందంగా ... చాక ... ఐ మీన్ .. అవుపించావ్ .." కోపం తెప్పించే పోలిక దేనికని సర్దుకుంటూ అన్నాను.

"థాంక్స్. ప్రతిబింబంలోనైనా అందంగా అవుపించానని ఒప్పుకున్నారు! తెమలండి! టిఫిన్. కూతురితో ముద్దులూ .. హైమై పోయింది!" గుమ్మం వైపు తిరుగుతూ అంది.

వైట్ షర్ట్ అందుకున్నాను.

"సువ్వీ ... "

ఆగి, కొరకొరా చూసింది.

"గుడ్డలు బాగానే ఉతికారు .. చూడు

చొక్కా తళతళ ... "

"చొక్కా తళతళ లాడితేనే, అయ్యగారు కళకళ! కానివ్వండి!"

"బాగా ఉతకలేదని ఆ పిల్లని ఉతికేశావ్, ఇందాకా!"

"అబ్బబ్బ! ఈ మధ్య నస ఎక్కువై పోతోంది. ప్రతీ దానికీ వస్తారు ... "

"అది కాదోయ్ ..."

"మెచ్చుకోవాలంటారు? మిమ్మల్ని మెచ్చుకుంటూనే వున్నాగా? అవతలివాళ్ళ గురించి మీ కెందుకూ బాధ?"

"అదికాదు ... నేను చెప్పేది ..."

"మెచ్చుకుని ప్రోత్సహించమంటారు. నాకు తెలుసు. డేల్‌కార్నీ చిట్కాలు నేనూ చదివాను. అవి ఈ దేశం మనుషుల మీద పని చేయవు! ఇంత చెప్తున్నారు. మీ ఆఫీసరు మిమ్మల్ని,మీకార్యదక్షతని, మీ చాకిరీని మెచ్చుకుంటున్నాడా?" కాటుక కళ్లతో ప్రశ్నల్ని బాణాల్ని రువ్వుతూ చూస్తోంది సువర్ణిక.

ఆమె. ప్రశ్నకి సమాధానం కోసం ఆఫీసు సీన్లని తిరగదోడటం ప్రారంభించాను. ఆ ప్రయత్నాన్ని ప్రారంభంలోనే ఆపేస్తూ అర్థాంగి నిష్క్రమించింది.

* * *

"ఇవి పాలా, తెల్లనీళ్ళా"

"ఇదేనాగుడ్డలుతకడం? ఇస్త్రీయా"

"పూలు కట్టడం ఇట్లాగా? రెండంగుళాలకి ఒక మొగ్గ! రేపట్నుంచీ నువ్వొద్దులే తల్లీ. పచ్చదారానికి డబ్బులెక్కడపోస్తాం .. ఆయన బజార్లో తెస్తారు."

"రాజీ... పాత్రలుచక్కగా శుభ్రం చేయక పోతే మీ అమ్మకి చెప్పి పనిమానిపించేస్తా!"

పాలవాణ్ణి పెరుగులా చిలికేస్తున్న శ్రీమతి కంఠం మేలుకొలుపుతో, లేచిన నాచెవుల్లో పాలవాణ్ని, పూలపిల్లనీ, చాకలినీ 'ప్రోత్సహిస్తూ' ఆమె రువ్వే డైలాగులు గింగురుమంటున్నాయి.

"మిమ్మల్ని మెచ్చుకుంటూనే వున్నాగా!" ... కళ్లు మూసుకున్నాను. సువర్ణిక నన్ను మెచ్చుకుంటూ వుంటుందా?

'...వంకాయలు ఇలాగేనా సెలెక్ట్ చేయటం? చిన్నవిగా, మెత్తగా వుండేవాట్ని ఏరాలి. వంకాయల్ని చూడాలి; కూరలమ్మే అమ్మిని కాదు!'

' ... రంగు పర్లేదు. డిజైనూ బాగానే వుంది. దేవతా వస్త్రంలా వుంటే చాలదు; మన్నిక? చిన్న ముండ అస్తమానూ తడిపేస్తూ వుంటుంది. చిన్న పిల్లలకి కాస్త దళసరిగానే వుండాలి. అయినా,తిన్నగా ఇంటికొస్తే, నేనూ వచ్చేదాన్నిగా?'

... మహాప్రభో, ఇది బెడ్‌షీటా? రగ్గా? బెడ్‌షీట్స్ పల్చగా వుండాలని తెలీదా?' తల విదిలించి ఫ్లాష్‌బాక్స్‌ని తరిమేశాను.

'మనుషుల సంగతి మీకుతెలీదు!' సువర్ణిక మాట చెవిలో గింగురుమంది. నిజమేనా? నిజమేనేమో! సువర్ణిక ఎంత విమర్శించినా, బెదిరించినా, పాలవాడు పాలుపోస్తూనే వున్నాడు. చాకలిపిల్ల చలవచేస్తూనే వుంది. పూలపిల్లా, పనిపిల్లా కూడా చివరికి ...



సాంకేతిక వివరాలు: పెంటక్స్ కె.100
ఎ.ఎస్.ఎ. 100
షట్టర్ స్పీడ్. 125
డయాఫ్రమ్: 4

ఫొటోగ్రాఫర్ : శాకా శ్రీనివాసరావు

# ఈ మనుషులు ఇంతే!

చివరికి .. నేను కూడా! ఆకూరలూ, చీరలూ అన్నీ మన్వే తెచ్చుకో!' అవి నేను తిరగబడలేదు. విమర్శని లెక్కచేయకుండా పాలవాడూ, పూలపిల్లా వగైరా వ్యక్తులలాగే నేనూ పనిచేసుకుపోతున్నాను. గిరాకీలు వదులుకోడం ఇష్టంలేక వాళ్లు .. బెదిరింపుల్నీ, విమర్శల్నీ తట్టుకుంటున్నారల్లేవుంది. నేను ...?

సువర్ణిక అనాలిసిస్ నిజమేనా? ఈ మనుషులు ఇంతేనా?

తలుపు చప్పుడు. కళ్ళు తెరిచాను. కాఫీ లోటాల్తో శ్రీమతి. ఎప్పుడూ నాతోబాటే కాఫీ తాగుతుంది సువర్ణిక.

లోటాల్ని టీపాయ్ మీదపెట్టి పైకి లేవబోతున్న నామీదికి అడ్డంగా వొంగింది. నిన్న సాయంత్రం తెచ్చిన కదిరిమల్లెలు - రాత్రి నలిగిపోగా మిగిలినవి - ఆమె తలలో నవ్వుతున్నాయి. పొడుగాటి జడ, మల్లెపందిరిమీంచీకిందికి వేళ్ళాడుతున్న నల్లత్రాచులా నా ఛాతీమీదికి జారింది.

చేతుల్ని అతి ప్రయత్నం మీద అదుపులో పెట్టుకుంటూ, చూపుల్ని పక్కకి తిప్పాను. నామీద అడ్డంగా వొంగిన సువర్ణిక చీరకొంగుతో ఉత్పల నుదుర్ని అద్దుతోంది. కొంగులోపల దాక్కున్న చూపుడువేలితో పాప బుగ్గమీదికి జారి, ముత్యంలా తయారైన చెంగుని సున్నితంగా అద్ది పైకి లేవబోయింది.

నల్లత్రాచు జడని వొడుపుగా పట్టుకున్నాను. సువర్ణిక నిటారుగా నించునే అవకాశంలేక కొద్దిగా వంగింది.

"అబ్బబ్బ .. కాఫీ చల్లారి పోతుంది. వదలండి! పాచిమొహంతో సరసాలు!" కాడల్లాంటి వేళ్లు సున్నితంగా నా వేళ్ళని వదులు చేశాయి. జడని ఎందుకో ఆమె వెనక్కి రువ్వుకోలేదు. ఇందాకా పందిరి మీంచీ వేళ్ళాడిన నల్లత్రాచు ఇప్పుడు రెండు పుట్టల మధ్యకి జరిగింది.

మెల్లిగా కూచున్నాను. నా చూపులు ఆమెని కనిపించని పగ్గాల్లా కట్టేశాయని నాకు తెలుసు!

"ఏంటోయ్ .. చీర ఇలా కట్టుకున్నావ్?" కళ్లని పైకి, ఆమె మొహంలోకి ఎత్తకుండా అన్నాను.

"ఏం?" ఆ కంఠంలో అనుమానం.

"అసలు చీరకట్టు ఇలాగేనా?" ఈ సారి తలెత్తి చిరునవ్వుతో ఆ కాటుక కళ్ళల్లోకి చూశాను.

సువర్ణిక చూపుల్ని కిందికి దించి, అప్రయత్నంగా రెండు చేతుల్తో కుచ్చెళ్లు సర్దుకుంది. "బాగానే కట్టుకున్నానే ..."

కుడిచేతిని ముందుకు చాచాను. నాలుగువేళ్ళనీ ఆమె పొట్టకి, చీరకి మధ్య ఇరికించాను. చీరని చిన్నగా, సున్నితంగా, కొంచెంకిందికిలాగాను. నా ఉద్దేశం చిటికెలో సువర్ణికలోని ఆడదానికి అర్థమై పోయింది.

"ఛీ! సిగ్గులేకపోతే సరి!"

"అందం పూర్తిగా దాక్కోనూ కూడదు;పూర్తిగాబట్ట-బయలూ కాకూడదు! ఊరీ ఊరని ఊరగాయలా, పేరీ పేరని పెరుగులా,ఎదిగీ ఎదగని ఆడపిల్లలా .. అందం కనిపించీ, కనిపించకుండా - ఉండాలోయ్!" నవ్వుతూ అన్నాను.

"ఏం? రోడ్లో ఎవత్తిని చూశారు? పైత్యంకొత్తరకంగా తలకెక్కుతోందే!" నవ్వుతూ అంది."చూపులు మారిపోతున్నాయే!"



"ఏరా పొదుపు మీద వ్యాసం రాయమంటే రాయలేదేంరా?" టీచర్ భరద్వాజ్ అడిగాడు.
"వ్రాద్దాం అనుకొన్నానండి.కాని బలపం అరిగిపోతుందని వ్రాయలేదు" తెలివిగా చెప్పాడు.
-పద్మశ్రీ

నవ్వుతూ పక్కకి తిరిగి కాఫీలు అందుకుంది. నేనూ అందుకున్నా. ఎదురుగా కూచోని, చిలిపికళ్ళతో చూస్తూ కాఫీ చప్పరించసాగింది. గుటక వేసి, లోటాను రెండు అరచేతుల మధ్యా బిగించాను.

"జాకెట్టు' కూడా. ఆ వీనెక్ మానేయ్ . లోనెక్ ... పొట్టి జాకెట్టు .. ఏంటో ఉన్న అందాన్ని .. కన్నుచాటు చేస్తున్నావ్!"

"కలిగన్నారా? పలవరిస్తున్నారు!" నాలోటా కోసం ఆగకుండా పైకిలేచి, గుమ్మం వైపు తిరిగింది. ఆమె కుడిచెయ్యి కదిలింది వాలుజడ మన్మధుడి కొరడాలా చివాల్న ఆమె వెనక్కి దూకింది. గుమ్మం వైపు కదుల్తున్న నాభార్యని గర్వంగా చూశాను. ఆమె అడుగులేస్తూంటే, అక్కడా ఇక్కడా దాక్కున్న అందం మోతాదు మించకుండా వొలికిపోతోంది. -

తేరుకుని, నిట్టూర్చాను. నాబాధ ఆమెకి అర్థమయ్యిందా? ఆలోచిస్తూ పైకిలేచాను. వెనక్కి తిరిగి పాపవైపు చూశాను. నా బాధ పూర్తిగా తనకి అర్థమై పోయిందన్నట్లు నిద్రలోనే నవ్వుకుంటోంది ఉత్పల ...

★ ★ ★

"గోపాలం గారూ ... దయచేయండి. తమకి ఇష్టమైన బంగాళాదుంపలు ... ధనియాల మసాలా ...! డైనింగ్ రూమ్‌లోంచీ కంచుకంఠం నన్ను హెచ్చరించింది.

శ్రీమతి ఇవాళ ఉత్సాహంతో ఉక్కిరిబిక్కిరవుతోందని చిలిపిగా ఆమె పిలిచిన నాపేరు చెప్తోంది. 'ఆది వారం అనుబంధాన్ని' గిరాటేసి లేచాను.

ఆదివారం స్పెషల్ డైనింగ్ టేబుల్ మీద అంతా సర్దుతోంది.

"కిందే పెట్టేయ్, ప్రేయసీ. పక్క పక్కనే పద్మాసనాలేసుక్కూచుని రెండేళ్ళు దాటింది!" ఆమె వెనకే నిలబడి అన్నాను.

సువర్ణిక తల నావేపు తిరిగింది. జడ చివాల్న కదిలింది. "పెళ్లప్పుడా?" కాటుక కళ్ళు నవ్వుతున్నాయి.

"తెలికన్నుల నీ తేటలే కదవే - వెలయగ విభునకు వెన్నెలలూ ..." మెల్లిగా అందుకున్నాను. నేతిగిన్నె కిందపెడ్తూ తలెత్తి చిలిపిగా చూసింది.

"అక్కడికి ఆపేయండి. తరవాతి లైనుకి ఇప్పుడు సమయం కాదు!" పాట పూర్తిగా తెలిసిన సువర్ణిక నవ్వింది. పక్కన కూచుంది.కంచంలోఅన్నం, బంగాళాదుంపల కూర, నెయ్యి ధారాళంగా.

"కానివ్వండి!"

ఎడంచేతిని ఆమె భుజం చుట్టూ పోనిచ్చాను. పాట మరిచిపోయి, సాలోచనగా కూరా అన్నం కొద్దిగా నోట్లో దోపుకున్నాను.

"అబ్బ!" అన్నాను ముద్దగా. ఎడం చెయ్యి ఆమె భుజం మీంచీ జారిపోయింది.

"ఏం?"అష్టవంకర్లు తిరిగిన నామొహంలోకి చూస్తూ అడిగింది.

"ఇలాగేనా బంగాళాదుంపల కూర చేయడం?" ముద్దగా తయారైన అన్నాన్ని నోట్లోంచీ తీసి కింద పడేస్తూ అడిగాను.

" ఏం? ఉప్పా? కారమా?" ఆత్రుత.

ఆమె మూడ్‌ని సర్వనాశనం చేయబోతున్నందుకు లోపల్లోపలే

విచారిస్తూ అన్నాను- "వంట ఇట్లాగే అఘోరిస్తూ వుంటే వంటమనిషిని ఏర్పాటు చేసేస్తాను!"

"ఇంతకీ ఆకూరకి ఏమిటయ్యిందో చెప్పరేం?" కసిరింది.

"ఏమిటవుతుంది? ఉప్పే, మామూలేగా!'

"ఎక్కువా? తక్కువా? తిన్నగా చెప్పరేం!"

"ఎక్కువే. మామూలేగా? ... 'ఈ మధ్య ... " కంచంలో కెలుకుతూ అన్నాను.

మాట్లాడకుండా కొంచెం కూర రుచి చూసింది.ఆశ్చర్యంగా, అనుమానంగా నావేపు చూసింది.తటాలుననాకంచంలోంచీ కొంచెం కూర అందుకుంది. చప్పరించింది. రెప్పల కిందినుంచీ చూశాను.

"కొత్తగా ఆఫీసుకి టైపిస్టెవతో అఘోరించిందన్నారు. దాని లంచ్ బాక్స్‌లో భాగం పంచుకుంటున్నారా?" ఉపోద్ఘాతం లేదు ...

"ఏం లేదు .. ఈ మధ్య తమరి రుచులు మారుతున్నాయి. మొన్న వంకాయ కూరలో కారం మండిందన్నారు. ఆమొన్న చారులో ఉప్పన్నారు. పోయిన వారం ఏడురోజులూ, పధ్నాలుగు పూటలూ ఏవో వంకలు పెడ్తూనే తిన్నారు! నిన్న ..."

"రుచికరంగా లేకపోయినా, లొట్టలు వేయాలంటావా?" గద్దించాను.

"అక్కర్లేదు. మీరు తిన్నంత ఉప్పూ, మీరు తిన్నంతే కారం నేనూ తింటాను. మరి నా నాలిక్కి అన్నీ .. ఇన్నాళ్ళూ .. బాగానే వున్నాయే! " ఎగతాళి.

"నీ వంట నీ నోటికి అమృతంలాగే వుంటుంది!"

సువర్ణిక నిదానించి నా మొహంలోకే చూసింది. "ఈ మధ్య అదోలా తయార య్యారు .. పోనీండి .. ఇప్పుడు నిజం చెప్పండి, కూర బాగాలేదా? ... నామీదా .. ఉత్పలమీదా ఒట్టు ... నిజం చెప్పండి!"

చిక్కే. చిక్కేశాను ... చిన్నగా నవ్వేశాను. "సువ్వీ ... నిజంగా ... నిజంగా .. అద్భుతంగా వుంది!"

రెప్పపాటు మరిచిపోయిన సువర్ణిక నోరు తెరిచింది. తన పేరుని నేను దారు ణంగా పొట్టిచేసిన విషయాన్ని గుర్తించనే లేదు. "అయితే .. ఎందుకు బాగాలే దన్నారు?"

గుటక మింగి చిరునవ్వి నవ్వాను.

"చెప్పండి, నిజం! ఈ సారీ ఆ నొట్టే!"

"ఊరికే ... మరేమో ..."

"ఊరికే ...? ఇన్నాళ్ళూ కూడా లోపల్లోపలే ఏడ్చేలా విమర్శించారు. అదీ ఊరికేనా?"

తలాడించాను. కాటుకకళ్ళల్లో ఎర్ర జీర సాగుతోంది మెల్లిగా. ఆగ్రహం ఆడదానికి అందాన్ని పూసే సంగతి నిజమే!

"వంట బాగుందని ... బాగున్న వంటని బాగుందని నోరారా అనడానికి బదులు .. ఇలా ..."

"అదికాదు సువ్వీ ..." అడ్డుతగిలాను ప్రతీరోజూ, ప్రతిపూటా, ప్రతిముద్దకీ మెచ్చుకోవాలనే అనిపిస్తోంది ..కానీ ..."

'కానీ?" ఉరుముతూ దబాయించింది.

"కానీ ... మెచ్చుకుంటే .. తరవాత్తరవాత వంట బాగా చేయవేమో .. అని. అదే ... నా ఉద్దేశం ... "

"అంటే?" కనుబొమల్ని కొత్తరకం ప్రశ్నార్థకంగా ముడేస్తూ కసిరింది.

"అదే డేల్‌కార్నీ చిట్కాలు .. మన దేశం మనుషుల మీద .. పంచేయవుగా .. అందుకని .... " ఆపేశాను.

సువర్ణిక కళ్ళు కంచంలోకి చూస్తున్నాయి. నాకళ్ళూ నా కంచంలోకి చూశాయి.తృప్తికరంగాతినడంప్రారంభించాను. ఎడం చేతిని ఆమె భుజం మీదుగా అల్లాను. సువర్ణిక మాట్లాడలేదు. ఏకాగ్రతతో తిన సాగింది ... మెల్లగా ....

పావుగంట తర్వాత, సిగరెట్ పీకని యాష్‌ట్రేలో నొక్కుతూంటే సువర్ణిక గదిలోకి వచ్చింది. ఆమె మొహం మామూ లుగా లేదు. ఏదో లోపించింది; ఏదో కొత్తగా వచ్చి చేరింది. ఎదురుగా కుర్చీలో కూచున్న ఆమెవేపు చూశాను. కళ్ళు నవ్వడం లేదు. పెదాలు నవ్వడం లేదు. గాయపరిచానా?

వాళ్లో పెట్టుకున్న పళ్ళెంలోంచీ తమలపాకులు తీసింది. మౌనంగా చిలకలు చుట్టింది. మౌనంగా అందించింది. అందు కున్నాను.నా కళ్ళల్లోకే చూస్తూ తమలపాకు చిలకని ఎర్రటి నోట్లో దోపుకుంది. మౌనం ఇద్దరి మధ్యా గోడలా పెరుగుతోంది. సారీ చెప్పాలనిపిస్తోంది. సువర్ణికను చూస్తూ నవ్వకుండా, మాట్లాడకుండా వుండడం కష్టంగా వుంది. నవ్వితే .. పోనీ ... సారీ చెప్పేస్తే ... చెప్పబోతూ తలెత్తి ఆమె కళ్ళలోకి చూశాను.

కళ్లు నవ్వుతున్నాయి!

సువర్ణిక పక్కున నవ్వింది. నేనూ నవ్వాను. ఆ నవ్వులో కోటి సారీలున్నాయి.

"బొడ్డు కిందికి చీరకట్టూ, లోనెక్ జాకెట్టూ.. అన్నీ .. అందుకేనా?" నవ్వుతూ అడిగింది.

"ఉత్పల గౌనూ, రగ్గులాంటి బెడ్ షీటూ, వంకాయలూ, ఇంకా ఎవ్వో, ఏవో అవన్నీ అందుకేగా?" నవ్వుతూ ఎదురుప్రశ్న వేశాను.

జవాబుగా కుర్చీలో వెనక్కి వాలి, తలపైకెత్తి నోరారా నవ్వింది సువర్ణిక. ఆ నవ్వు ఆశాభోస్లే కంఠాన్ని వెక్కిరించింది. ....

మామూలుగానే, ఉలిక్కిపడి మేలుకున్నాను.

"ఇవాళ పాలు చక్కగా, చిక్కగా వున్నాయి గవరయ్యా!" శ్రీమతి కంఠం. గవరయ్య వెంటనే మాట్లాడలేదు. ఆశ్చర్యం నుంచి కోలుకోవాలిగా! నవ్వుకుంటూ ఉత్పల వైపు తిరిగాను. ఉత్పల కూడా నాకులోడుగా నవ్వుతోంది ... ●



# సినిమా... సినిమా...

— జి.వి.జి.

## కృష్ణ, కె.ఎస్.ఆర్.దాస్

### "రుద్ర"

"విజాయితీపరుడైన పోలీస్ ఆఫీసర్ కృష్ణ. డైనమిక్ కారెక్టర్. ఇదే కన్నడ చిత్రం కర్నాటకలో హౌస్‌ఫుల్ కలెక్షన్‌లతో ప్రదర్శించబడుతోంది. తెలుగు ప్రేక్షకుల అభిరుచికి అనుగుణంగా చేర్పులు, మార్పులు చేశాం, అన్నారు కె.ఎస్.ఆర్. దాస్. ఈయన కథ, స్క్రీన్‌ప్లే, దర్శకత్వంలో కె. నాగేంద్రమణి సమర్పించే కె.ఎస్.ఆర్. దాస్ ప్రొడక్షన్స్ "రుద్ర" చిత్రంలో సత్యనారాయణ, చారుహాసన్, రంగనాథ్, కోట శ్రీనివాసరావు, అన్నపూర్ణ, ముచ్చెర్ల అరుణ అదిగా గలవారు పాల్గొంటారు. చలం గంగై అమరన్ సంగీతం, బి. రఘు నృత్యాలు, శిల్పం, లక్ష్మణ్ ఛాయ, సాహసాలతో ఈ చిత్రాన్ని హార్స్‌మన్ బాబు సుకుమార్ "జూలై, నిర్మించే కె. ఆగస్టుల్లో మద్రాసు, బెంగుళూరు, ఊటీలలో షూటింగ్" అన్నారు.

"నా మొగుడు నాకే స్వంతం"లో జయసుధ

"నేటి ... ...తం"లో ...

## "వింత దొంగలు"

"రాజశేఖర్, రావుగోపాలరావులలో ఒకరు నిరుద్యోగి. మరొకరు అభ్యుదయవాది. తినడానికి తిండిలేని పరిస్థితిలో పొట్ట గడవడానికి ఇంత సంపాదించుకోక తప్పదని వింతగా ఆలోచించి, ఎన్నో పథకాలు వేస్తారు. ఆద్యంతంసున్నితమైన హాస్యంతో, అమోఘమైన సస్పెన్స్‌తో ప్రేక్షకులను అలరింపజేస్తుంది" అన్నారుకోడిరామకృష్ణ. ఈయన స్క్రీన్ ప్లే, దర్శకత్వంలో ఎస్. జయరామారావు నిర్మాణ సారధ్యంలో రావు గోపాలరావు సమర్పించే ఆర్.జె.ఆర్. ప్రొడక్షన్స్ "వింత దొంగలు" చిత్రంలో నదియా, జగ్గయ్య, అల్లు రామలింగయ్య, రాళ్లపల్లి, వేలు, చక్రపాణి, ప్రదీప్‌శక్తి, రాధాకృష్ణ, జవ్వాది రామారావు, ఏచూరి, జి. సుబ్బారావు, నాగేశ్వరరావు, వై. విజయ, సంధ్య, అన్నపూర్ణ, నిర్మల, బేబీసుజీత,అరుణకుమారి వగైరా నటవర్గం. తనికెళ్ల భరణి మాటలు, వేటూరి పాటలు, చక్రవర్తి సంగీతం, విజయ్ ఛాయ, రాజు శిల్పం, శివసుబ్రహ్మణ్యం నృత్యాలు, విక్కీ సాహసాలు, సురేష్ తాతా కూర్పుతో ప్రకాష్ ప్రొడక్షన్ కంట్రోలర్. ఎస్. అంబరీష్ నిర్మాత.



"వింత దొంగలు"లో ఒక చిత్రం

## "రతిలయలు"

"యువతకు లైంగికశాస్త్ర విషయంలో కొన్ని సలహాలివ్వడం, మాదకద్రవ్యాల వల్ల యువతరం ఎలా బలహీనం చెందుతోందన్న అంశాలను ప్రధానంగా ఈ చిత్రంలో పొందుపరిచాం" అన్నారు కొమ్మినేని. ఈయన సంభాషణలు, దర్శకత్వంతోపాటు డాక్టర్‌పాత్ర నిర్వహించే రియో ఇంటర్నేషనల్ వారి "రతిలయలు" చిత్రంలో బాలాజీ, రంజిత్, గౌతంబాబు, జయరాం, వినాయక్, సాక్షి-రంగారావు, సి. హెచ్. కృష్ణమూర్తి, పొట్టి ప్రసాద్, రాంబాబు, అశోక్‌కుమార్, కర్ణ, శైలజ, కస్తూరి, కన్నిక, మీనా, పి. ఆర్. వరలక్ష్మి, చందన, చిలక రాధ పాత్రధారులు. పి. జి. వాసుదేవన్ స్క్రీన్-ప్లే, చక్రవర్తి సంగీతం, కె. ఎస్. మణి ఛాయ, పింజల శిల్పం, జయప్రసాద్‌రెడ్డి సంయుక్త దర్శకత్వం, రవీంద్రనాధ్ - బి. ఎం రాజ్‌వర్మ సహకార దర్శకత్వం, బి. కె. మోహన్ కూర్పుతో జె. రుక్మాంగధరన్ కథ సమకూర్చి, నిర్మిస్తున్నారు.

"రతిలయలు"లో కస్తూరి

## వీరబ్రహ్మేంద్ర కంబైన్స్ చిత్రం

"జూన్ 10 నుంచి 20 వరకు మొదటిషెడ్యూల్ జరిగింది జూలై, ఆగస్టు, సెప్టెంబర్‌లలోకూడా అదే తేదీలమధ్య జరిగే షెడ్యూల్స్‌తో షూటింగ్ ముగుస్తుంది." అన్నారు తాతినేని ప్రసాద్. ఈయన స్క్రీన్‌ప్లే, దర్శకత్వంలో బి.వి. శేఖర్-రెడ్డి, టి. స్వరూప నిర్మిస్తున్న వీరబ్రహ్మేంద్ర కంబైన్స్ తొలి చిత్రంలో సుమన్, రాధ, వాణిశ్రీ, సత్యనారాయణ, శ్రీలక్ష్మి, బ్రహ్మానందం, గొల్లపూడి మారుతీరావు, ఒక కీలకమైన పాత్రలో మురళీమోహన్ నటిస్తున్నారు. రాజ్ ఇలంగో కథకు సాయినాథ్, మధు మాటలు రాశారు. వేటూరి గీతాలు, రాజ్-కోటి సంగీతం, కబీర్‌లాల్ ఛాయ, గంగాధర్ సంయుక్త దర్శకత్వం, కొండపనేని రామలింగేశ్వరరావు శిల్పం, నాయని మహేశ్వరరావు కూర్పు, అట్లూరి నాగేశ్వరరావు సహకార దర్శకత్వం, ఎస్.వి.వి.ఆర్. సత్యనారాయణ నిర్వహణతో మల్లిఖార్జునరావు ప్రొడక్షన్ ఎగ్జిక్యూటివ్.

## "ఊరికో రుద్రమ్మ"

ఆంధ్రప్రదేశ్ ప్రజానాట్యమండలి సమర్పణ, నిర్వహణలో జూన్ 14న ఖమ్మంజిల్లా, మధిర సమీపాన మడుపల్లె గ్రామములో "ఊరికో రుద్రమ్మ" అనే టెలిచిత్రం ప్రారంభమయింది

శ్రీ ఊట్ల సాంబయ్య (సి పి ఐ నాయకులు) కెమెరా స్విచ్ ఆన్ చేయగా తొలిషాట్‌గా భూకామందు రాయుడుకు గూడెం మనుష్యుల మధ్య జరిగే ఘర్షణను చిత్రీకరించారు అని శ్రీ డి ధర్మారావు తెలిపారు

## హరీష్ ఎంటర్‌ప్రైసెస్‌లో బాలకృష్ణ, చలసాని రామారావు



హరీష్ ఎంటర్ ప్రైజెస్ వారి చిత్రంలో బాలకృష్ణ

"ఊటీలో ఆమధ్య రెండు పాటలు, ఒక ఫైట్‌తో 13 రోజులు షెడ్యూల్ జరిపాం" అన్నారు చలసాని రామారావు. ఈయన్ని దర్శకునిగా పరిచయం చేసే హరీష్ ఎంటర్‌ప్రైసెస్ జనరంజకమైన చిత్రంలో బాలకృష్ణ, రజని, వాణిశ్రీ, మోహన్‌బాబు, సత్యనారాయణ, ఆదిగాగలవారు పాల్గొంటున్నారు ఎం. డి సుందర్ కథకుడు. పరుచూరి సోదరుల కథా సహకారం, సత్యానంద్ సంభాషణలు, చక్రవర్తి సంగీతం, పి డి ప్రసాద్ ఛాయ, శ్రీనివాసరాజు శిల్పం, శివసుబ్రహ్మణ్యం నృత్యాలు, గోపాల్-నందూరి-కాశీ సహకార దర్శకత్వం, రాజు సాహసాలు, కోటగిరి వెంకటేశ్వరరావు కూర్పుతో విజయసారథి నిర్మాత.

## "అంతులేని ప్రేమ"

"శ్రీరామ్‌కుమార్ సరసన వాణీ విశ్వనాథ్ నాయిక" అన్నారు మహేష్‌కుమార్. ఈయన రచన-దర్శకత్వంలో ఎస్. టి. వై. రెడ్డి-వి. వి. రెడ్డి నిర్మించే ఫ్రెండ్స్ క్రియేషన్స్ "అంతులేని ప్రేమ" చిత్రంలో దగ్గుబాటి రాజా, ప్రదీప్‌శక్తి, పి. ఆర్. వరలక్ష్మి, తమిళ హాస్యనటుడు జనకరాజ్, నవనటులు స్వామిరాజా, సురేందర్‌రాజ్ తక్కిన పాత్రలు నిర్వహిస్తారు. కృష్ణ-చక్ర సంగీతం, జయసెన్ విన్సెంట్ ఛాయ, శివశంకర్ నృత్యాలు, అంతటి పాండుప్రొడక్షన్ మార్తాండ్ కూర్పు నిర్వహిస్తారు. ●

సీరియల్

# వజ్రసంకల్పం

## సాతవాహన

(గత సంచిక తరువాయి)

చీకటి!

చిమ్మ చీకటి!

నట్టడివిలోంచి జోరుగా పరిగెడుతోందా పాతకాలం నాటి గుర్రపుబగ్గీ.

బగ్గీకి రెండు వైపులా అమర్చబడిన శక్తివంతమైన బ్యాటరీలైట్లు దూరంవరకూ చీకటిని పారదోలుతున్నాయి. బగ్గీకి కట్టిన తెల్లగుర్రం డెక్కల చప్పుడు చేసుకుంటూ హుషారుగా దౌడు తీస్తోంది. నిశ్శబ్దంగా వున్న అడవిలో ఆ గుర్రపు డెక్కల చప్పుడు బిగ్గరగా లయబద్ధంగా వినిపిస్తోంది. బాటకు ఇరుపక్కలా జుట్లు విరబోసుకున్నట్టుగా వున్న ఎత్తైన చెట్లు ఆకాశంలో చుక్క కూడా కనిపించకుండా చేస్తున్నాయి.

"ఇట్టా చీకట్లో బయల్దేరడం మంచిదేనంటారా బాబూ!" చాబుక్‌తో గుర్రాన్ని అదిలిస్తూ అడిగాడు వీరన్న.

బగ్గీలో కూర్చొని వున్న విశ్వధరవర్మ గంభీరంగా తల వూపాడు.

"అవును వీరన్నా! ఇలా రహస్యంగా వెళ్తేనే మంచిది. పొద్దున్నే కలెక్టర్‌గారిని కలుసుకోవడానికి సూర్యనేత్రం సమాచారం వెంటనే ఆయనకు తెలియజేయడానికి వీలుంటుంది. మన చర్యల గురించి వజ్రపాణికి ఏమాత్రం అనుమానం కలిగినా తప్పకుండా అడ్డుకోవడానికి ప్రయత్నిస్తాడు. అందుకని ఇదే మంచి పద్ధతి."

"ఏటో బాబూ! అన్ని కోట్ల విలువజేసే వజ్రం దేనికో ఇచ్చేస్తానంటున్నారు! మీ యట్టంటోళ్ళని నేనేడా సూళ్ళేదు."

విశ్వధరవర్మ నవ్వేడు.

"వీరన్నా! నా తండ్రి దేశంకోసం ప్రాణాలే అర్పించాడు. నేనీ వజ్రం దేశానికి అర్పించలేనా? ఇప్పటికే ఈ రత్నగర్భ ప్రసాదించినఅమూల్యసంపదలెన్నోస్వార్థ పరుల సంకుచితమైన కుట్రల వల్ల దేశం నుంచి బయటికి తరలించబడ్డాయి. ఈ వజ్రాన్ని కనుక్కున్నందుకు ప్రభుత్వం నాకిచ్చే పారితోషికం కూడా నేను మన వూరికోసం ఖర్చు పెట్టేస్తాను."

"మీ యట్టంటోళ్ళుండబట్టే లోకం ఇంకా నడుస్తోంది బాబూ! లేకుంటే ఆ వజ్రపాణిలాంటోళ్ళతో నిండిపోయుండేది."

"మనిషి జీవితం కూడా ముడి వజ్రంలాంటిదే వీరన్నా! దాని ఉపయోగం కనిపెట్టి భూమిలోంచి బయటికి తీసి సానబెడితే తప్ప వజ్రం ప్రకాశించదు.

లేదంటే భూమి పొరల్లోపలే మగ్గిపోయి మట్టికొట్టుకు పోతుంది. స్వార్థం పొరల్లోంచి జీవితాన్ని బయటికి తీసి త్యాగమనే సానరాయికింద రాపిడిపెడితే తప్ప జీవితానికి సార్థకత లేదు!"

సరిగ్గా ఆయన ఆమాట పూర్తి చేశాడో



లేదో వున్నట్టుండి గుర్రం ముందరి కాళ్ళు పైకి లేపి భయంకరంగా సకిలించింది.

వాళ్ళిద్దరూ అదిరిపడి ఎదురుగా చూశారు.

చేతుల్లో కాగడాలతో దాదాపు పదిమంది వ్యక్తులు బగ్గీని చుట్టుముట్టి తమవైపే వస్తున్నారు.

* * *

రాజేంద్రవర్మ జాగ్రత్తగా మెట్లవెంబడి బావిలోకి దిగాడు.

సూర్యనేత్రాన్ని దాచిపెట్టిన చోటును టార్చిలైట్ వెలుగులో పరీక్షగా చూశాడు. ఎవరూ ఆ చోటును తాకినట్టు దాఖలాలు లేవు. తృప్తిగా వూపిరి పీల్చుకుని రెండు చేతుల్తోనూ అక్కడి మట్టి పెళ్ళగించసాగాడు. బావి గోడలోపల లోతుగా సూర్యనేత్రాన్ని విశ్వధరవర్మ దాచిపెట్టాడు.

రాజేంద్రవర్మ నుదురు చెమటతో తడిసిపోయింది.

బావిపైనుంచి శ్రావణి టార్చిలైటు వెలుతురును లోపలికి వేస్తోంది. పైనుంచి వెలుతురు ఆ నల్లని చీకట్లో తెల్లని తెరలా అతన్ని కప్పేస్తోంది.

హఠాత్తుగా రాజేంద్రవర్మ కళ్ళు మెరిసాయి.

సూర్యనేత్రం అతని చేతులకు తగిలింది. గొప్ప రిలీఫ్‌తో అతను నెమ్మదిగా దాన్ని

బయటకి తీశాడు.

ముడి వజ్రమే అయినా టార్చిలైటు వెలుగులో కూడా ఆ మహావజ్రం ప్రకాశవంతంగా వెలుగుతోంది. ధాని వెలుతురు బావి గోడలమీద ప్రతిఫలించి చిత్రంగా కనబడుతోంది. అర్ధరాత్రి సూర్యోదయం సంభవించినట్టుగా వుంది.

రాజేంద్రవర్మ తేలిగ్గా నిట్టూర్చి దోసిట్లో ఆ వజ్రాన్ని పట్టుకుని చకచకా బావిలోంచి పైకెక్కివచ్చాడు.

అతని కళ్ళల్లో ఆనందం తాండవిస్తోంది.

"ఇదే సూర్యనేత్రం," రహస్యం చెబుతున్నవాడిలా గుసగుసగా అన్నాడతను. "చరిత్రలోనే మానవుడు కనీవిని ఎరగనంత పెద్ద వజ్రం!"

ఆ ముగ్గురూ అతని చుట్టూ నిలబడి వేగంగా కొట్టుకుంటున్న గుండెల్తో ఆ మహావజ్రం వైపు కళ్ళప్పగించి చూశారు.

చరిత్ర కందని చీకటిరోజుల్లో ఒకానొక ఆదిమానవుడు ఆ వెలుతురు ముద్దను తన చేతుల్లోకి తీసుకొని ఎంతగా విభ్రాంతి చెందాడో కొన్నివేల ఏళ్ళ తర్వాత కూడా వాళ్ళు అంతే విభ్రాంతి చెందుతున్నారు.

ఏ మాత్రం పనికిమాలిన వస్తువుగా నిర్ణయించుకుని ఆ ఆదిమమానవుడు విసిరికొట్టిన ఆ 'రాయే' కొన్నివేల ఏళ్ళలో లెక్కలేనన్ని ప్రకృతి వైపరీత్యాలకు గురై భూగర్భంలోకి వెళ్ళి ఇప్పుడు బయటపడి మహావజ్రంగా గుర్తింపబడుతోంది. ఒకనాడు తొండ విలువ చెయ్యని ఆ పనికి మాలిన 'రాయి' ఈనాడు అమూల్యమైన మహావజ్రం! ఇది మానవుడు సాధించిన ప్రగతికి చిహ్నమనాలా? లేక పనికిమాలిన వస్తువుల పైన అతను అనవసరంగా పడుతున్న వ్యామోహానికి గుర్తు అనాలా?

క్రిస్టలైజ్డ్ కార్బన్ మూలఖనిజంగా ఏర్పడ్డ ఆ మెరిసే బొగ్గుముక్క అలాంటిదే మరో సాధారణమైన గాజుముద్దకన్నా అధకంగా ఏ విధంగా మానవజాతికి వుపయోగపడుతుంది? అరుదుగా లభించే అలంకరణ వస్తువు కావడం తప్ప దాని గొప్పతనమేమిటి?

నేపథ్యంలో......

హింస- అయోమయం- టూకీగా ఇదీ శాన్సీ చరిత్ర. చరిత్రకారుల్ని ఇంతకంటే తికమక పాలు చేసిన వజ్రం బహుశా మరొకటి లేదేమో. దీనికి తోడు మరో శాన్సీ వజ్రం తగుదునమ్మా అంటూ సవతిలా తయారు కావడంతో కథ మరింత రసకందాయంలో పడింది.

# సవతి పోరులో చిక్కుకున్న 'శాన్సీ డైమండ్'

ఫ్రెంచివాడైన నికోలస్ హార్లాయ్ అనే వ్యక్తి శాన్సీకి అధిపతిగా వుండేవాడు. 1570-లో ఆయన కాన్‌స్టాంటినోపుల్‌లో ఓ 55 కేరెట్ల వజ్రాన్ని కొన్నాడు. అదే శాన్సీ వజ్రం. నికోలస్ తన వజ్రాన్ని కాన్‌స్టాంటినోపుల్ నుంచి ఫ్రాన్స్‌కు తీసుకెళ్ళాడు. ఆ కాలంలో ఫ్రాన్స్‌కు రాజుగా వుండిన నాలుగో హెన్రీకి అకస్మాత్తుగా కొంత ధనం కావల్సి వచ్చింది. ఆ ధనం కోసం కుదువబెట్టడానికి వీలుగా శాన్సీ వజ్రాన్ని కొంతకాలం తనకు చేబదులుగా ఇవ్వమని ఆయన నికోలస్‌ను కోరాడు. రాజుగారి మాట తీసెయ్యలేక నికోలస్ శాన్సీని ఒక విశ్వాసపాత్రుడైన దూత చేతికిచ్చి పారిస్ పంపించాడు.

అయితే, శాన్సీని పంపించేశాక నికోలస్‌కు ఎందుచేతనో కాలు నిలువలేదు. దూత పారిస్‌కు బయల్దేరి వెళ్ళిపోయాక తనూ అతని వెనకే బయల్దేరాడు. కానీ, దురదృష్టవశాత్తూ నికోలస్ తన దూతను చేరుకునేటప్పటికే ఘోరం జరిగిపోయింది. నికోలస్ పంపిన దూతను బందిపోటు దొంగలు అప్పటికే దారుణంగా హత్య చేశారు. దూతతో పాటు తను పంపిన వజ్రం కనిపించకపోయేసరికి నికోలస్ గుండె గుభేలు మంది. అయినా ఆయన తొందరపడకుండా నిదానంగా కూర్చొని జాగ్రత్తగా ఆలోచించాడు.

హత్యకు గురైన దూత తనకు అత్యంత విశ్వాసపాత్రుడు. అతను అంత సులభంగా శాన్సీని బందిపోట్ల చేతుల్లో పడనిచ్చి వుంటాడంటే నికోలస్‌కు నమ్మబుద్ధి కాలేదు. అంతలో హఠాత్తుగా ఆయన కేదో అనుమానం వేసింది. తన వెంట వచ్చిన నౌకర్ల చేత దూత శరీరాన్ని కోయించాడు. చాలా విషాదకరమైన పరీక్ష తర్వాత శాన్సీ వజ్రం చనిపోయిన దూత పేగుల్లో సురక్షితంగా దొరికింది. చివరి నిమిషంలో కూడా ఆ దూత యజమాని పట్ల తన విశ్వాసాన్ని సడలనివ్వలేదు. బందిపోట్లు తనని చంపేస్తారని తెలిసి కూడా ఆ వజ్రాన్ని మింగేసి దుండగుల చేతుల్లో పడకుండా దాన్ని కాపాడాడు.



ఆ తర్వాత నికోలస్ ఇంగ్లండ్‌కు రాయబారిగా వెళ్లాడు. అక్కడే ఆయన శాన్సీని మొదటి జేమ్స్ రాజుకు 1604 లో అమ్మేశాడు. కొంతకాలం తర్వాత ఇంగ్లండ్‌లో తిరుగుబాటు చెలరేగి రక్తపాతరహిత విప్లవానికి దారి తీసింది. అప్పట్నుంచే ఇంగ్లండ్‌లో ప్రజాస్వామ్య ప్రభుత్వం ఏర్పడింధి. ప్రపంచంలో ఈనాడున్న ప్రజాస్వామ్య దేశాల్లో అత్యంత పురాతనమైనది ఇంగ్లండ్ ప్రజాస్వా-

**జరిగిన కథ-4 :** చేయని నేరానికి ఉరి శిక్ష పడి జైల్లో వున్న కొడుకును కలుసుకునేందుకు కాళ్ల పారాణి కూడా ఆరని తన కోడలికి అవకాశం కల్పించవలసిందిగా తనకు ఓనమాలు నేర్పిన మాస్టారు జైలర్ సత్యాన్ని అర్థించగా అందుకు అంగీకరిస్తాడు. ఒకరోజు రాత్రి ఆ అమ్మాయికి భర్తను కలుసుకునే అవకాశాన్ని కల్పిస్తాడు. తమకు జరిగిన అన్యాయానికి ప్రతీకారం తీర్చుకోగల మగబిడ్డను ప్రసాదించమని భర్తను కోరుకుంటుంది ఆ యువతి. విశ్వధరవర్మకు తండ్రి అనంతరం మిగిలిన బీడు భూమిని దాయాది వజ్రపాణి కాజేయాలనుకుంటాడు. ఆ భూమిలో త్రవ్విన బావిలో విశ్వధరవర్మకు అపురూపమైన వజ్రం దొరికిందని వజ్రపాణికి తెలుస్తుంది. విశ్వధరవర్మ కొడుకు రాజేంద్రవర్మ బావి దగ్గర కాపలాకోసం సతీ సమేతంగా బయల్దేరతాడు.

మ్యమే. విప్లవకాలంలో రాజ కుటుంబానికి ధనం కూడబెట్టవలసి వచ్చింది.

ఆ సందర్భంగా 1644 లో హెన్రీటా మేరియా రాణి మొదటి ఛార్లెస్ రాజు తరవాత రాచరికపు ఆభరణాలు తీసుకుని ఫ్రాన్స్ వెళ్ళింది. అక్కడే ఆమె శాన్సీని మరో వజ్రాన్నీ ఎపెర్నాన్ రాజ కుమారుడి దగ్గర కుదవబెట్టింది. హెన్రీటా ఆ అప్పు తీర్చలేకపోవడంతో ఆ రాజ కుమారుడు ఆ వజ్రాల్ని తనే వుంచేసుకున్నాడు. తర్వాత కొంతకాలానికి ఎపెర్నాన్ రాకుమారుడు ఆ వజ్రాల్ని కార్డినాల్ మజారిన్‌కు అమ్మేశాడు. మజారిన్ 1661 లో చనిపోయే ముందు వాటిని మరో పదహారు వజ్రాలతో పాటు ఫ్రెంచి రాచరికపు ఆభరణాల్లో చేర్చవలసిందిగా వీలునామా రాశాడు. అప్పట్నుంచీ ఆ పద్దెనిమిది వజ్రాలకూ మజారిన్ వజ్రాలని పేరొచ్చింది. అప్పుడే శాన్సీ 53.75 కేరెట్ల వజ్రంగా రికార్డుల్లో కెక్కింది.

ఆ కాలంలోనే శాన్సీకి సవతిపోరు ఎదురయ్యింది. శాన్సీ అనే పేరుతో- అదీ ఇంగ్లండులోనే- మరో వజ్రం కథ బయటికొచ్చింది 1688 లో రెండో జేమ్స్ రాజు పదవీభ్రష్టుడై ఫ్రాన్స్‌కు పారిపోయాడు. ఆ సమయంలో అతను 'శాన్సీ' అనే పేరున్న ఒక వజ్రాన్ని తనతో పట్టుకుపోయి పధ్నాలుగో లూయిస్ రాజుకు అమ్మేశాడు. దాంతో ఫ్రాన్స్ కోశాగారంలో ఒకే చోట రెండు శాన్సీలు తయారయ్యాయి. అది చాలదన్నట్టుగా 1791 లో జరిగిన రాచరికపు ఆభరణాల ఇన్వెంటరీలో కేవలం ఒకే ఒక్క శాన్సీ పేరు రికార్డు చేశారు. దాని బరువు 33.71 కేరెట్లని రిజిస్టర్ చేయడం జరిగింది. 53.75 కేరెట్ల శాన్సీ ఊసు ఆ రికార్డుల్లోనే లేదు.

దాంతో చరిత్రకారులు పెద్ద గందరగోళంలో పడిపోయారు. అసలు 'శాన్సీ' వజ్రాలెన్ని? ఒకటా, రెండా? రెండు శాన్సీ వజ్రాలే వుంటే ఒకటేమై పోయింది? వాటిలో అసలు శాన్సీ వజ్రమేది? 1644 లో హెన్రీటా రాణి ఎపెర్నాన్ రాజు దగ్గర కుదవబెట్టిన వజ్రం అసలైన శాన్సీ వజ్రమేనా? లేక, 1688 లో రెండో జేమ్స్ ఫ్రెంచి రాజుకు అమ్మినదే అసలైన శాన్సీ వజ్రమా?

ఈ అయోమయం అలా వుండగానే పులి మీద పుట్ర అన్నట్టు ఫ్రెంచి మహావిప్లవంలో 1792 లో ఫ్రాన్స్ రాచరికపు ఆభరణాలన్నీ దోపిడీ కావడంతో చరిత్రకారుల సందేహాలు మరింతగా పెరిగాయి. దోపిడీ అయిన వజ్రాల్లో కొన్ని తిరిగి దొరికాయి. కానీ, వాటిలో 'శాన్సీ' పేరు రికార్డుల్లో లేదు. అయితే 1795 లో ఫ్రెంచి డైరెక్టరేట్ కొన్ని వజ్రాల్ని స్పెయిన్ రాజుల దగ్గర కుదవ పెట్టడం జరిగింది. ఆ లిస్టులో 53.75 కేరెట్ల ఓ వజ్రం కూడా చేర్చబడింది. అదే అసలైన శాన్సీ వజ్రంగా చాలా మంది చరిత్రకారులు అంగీకరించారు. ఫ్రెంచివాళ్ళు తమ వజ్రాల్ని విడిపించుకోనే లేదు. దాంతో అవి స్పెయిన్లోనే వుండిపోయాయి.



1828 లో 'శాన్సీ' అనే పేరున్న ఒక వజ్రాన్ని ఓ ఫ్రెంచి వజ్రాల వ్యాపారి అనటోలె డెమిడాఫ్ రాజకుమారుడికి అమ్మడం జరిగింది. అప్పట్నుంచే దానికి డెమిడాఫ్ వజ్రం అనే పేరొచ్చింది. డెమిడాఫ్ రాకుమారుడు ఆ వజ్రాన్ని తన భార్య మెటిల్డేకు ఇచ్చాడు. ఈ మెటిల్డే యువరాణి నెపోలియన్ బోనపార్టే మేనకోడలు. 1865 లో బొంబాయికి చెందిన ఓ వ్యాపారస్థుడు డెమిడాఫ్ వజ్రాన్ని కొన్నట్టు రికార్డుల్లో వుంది. రెండేళ్ళ తర్వాత పారిస్‌లో ఆ వజ్రాన్ని ప్రదర్శనలో వుంచారు. అక్కడే దాని బరువు 53.75 కేరెట్లుగా రికార్డైంది.

అది అలా వుండగా 'శాన్సీ' అనే పేరున్న ఒక వజ్రాన్ని డెమిడాఫ్ కుటుంబం నుంచి 1906 లో విలియం ఆస్టార్ అనే వ్యక్తి కొనుగోలు చేశాడు. ఆస్టార్ ఆ వజ్రాన్ని తన కోడలికి పెళ్ళిలో ప్రెజెంట్ చేశాడు. అప్పట్నుంచీ ఆ వజ్రం ఆస్టార్ కుటుంబంలోనే వుండిపోయింది. దీని బరువు 53.67 పాత కేరెట్లు. చాలా మంది చరిత్రకారులు అసలైన 'శాన్సీ' వజ్రం ఇదేనని అంగీకరిస్తున్నారు. 1962 లో లోవ్రేలో జరిగిన ఒక ప్రదర్శనలో ఆస్టార్ వజ్రాన్నే అసలైన శాన్సీగా చూపించారు.

మొత్తానికి ఈ గందరగోళమంతా ఇప్పటికీ చరిత్రకారుల బుర్రలు వేడెక్కిస్తూనే వుంది. చాలా ప్రశ్నలు ప్రశ్నలుగానే మిగిలిపోయాయి. పాపం శాన్సీకి ఇంకా సవతిపోరు పూర్తిగా తప్పనే లేదు.

సృష్టిలో లభించిన ప్రతి అమూల్య వజ్రం వెనకా కనీసం ఒక్క దారుణ హింసాకాండ వుండి తీరుతుంది ఆ మెరిసే బొగ్గు ముక్కకోసం మనిషిని మనిషి హత్య చేయడానికి వెనకాడడు. ఆ మెరిసే బొగ్గుముక్క కోసం మనిషిని మనిషి అమానుషంగా దోచుకోవడానికి సందేహించడు ఆ మెరిసే బొగ్గుముక్కకోసం మనిషి ఎంత ఘాతుకం తలపెట్టడానికైనా, ఎన్ని కుట్రలు పన్నడానికైనా, ఎన్ని ప్రాణాలు బలిచేయడానికైనా వెనుదీయడు

మిలామిలా మెరిసే ఆ బొగ్గుముక్క

మానవజాతికి ప్రకృతి ప్రసాదించిన వరమా?

లేక శాపమా?

# వజ్రసంకల్పం

ఓ మహనీయ ప్రకృతీ!
సమాధానం చెప్పు.
వాళ్ళు ఆ వెలుతురు ముద్దను..., అర్ధరాత్రి సంభవించిన ఆ సూర్యోదయాన్ని మహా విభ్రాంతితో అలా కళ్ళప్పగించి చూస్తూనే వున్నారు.
హఠాత్తుగా చిన్న నవ్వు వినిపించింది.
దగ్గరగా!
చాలా దగ్గరగా!
ఎవరిదో అడుగుల చప్పుడు వినిపించింది.
దగ్గరగా!
చాలా దగ్గరగా!
వాళ్ళు ఒక్కసారిగా అదిరిపడి తలలు పైకెత్తి చూశారు.

నేలమీదికి దూకాడు.
అప్పటికే కాగడావ్యక్తులు వాళ్ళని సమీపించేశారు.
వాళ్ళందరి చేతుల్లోను ఖడ్గాలున్నాయి.
వాళ్ళందరి కళ్ళలోనూ కాలసర్పాలు న్నాయి.
వాళ్ళు తమని సమీపించగానే వీరన్న చేతిలోని చెర్నాకోల అప్రయత్నంగా పైకి లేచింది. ఆ మరుక్షణం వాళ్ళలో ఒకడి శరీరం మీద దాని దెబ్బ ఠివ్వున వచ్చిపడింది. ఆ వ్యక్తి కెవ్వున కేకపెట్టాడు.
అంతే!
ఆ దృశ్యం చూసిన మరొకడి చేతిలోని ఖడ్గం గాల్లో గిరగిరా తిరుగుతూ వచ్చి వీరన్న భుజాన్ని తాకింది.




ఎదురుగా......
వజ్రపాణి వికృతంగా నవ్వుతూ నిలబడి వున్నాడు.
రాజేంద్రవర్మ దోసిట్లో మెరుస్తున్న ఆ మహావజ్రాన్ని మహాద్భుతంగా చూస్తున్న అతని కళ్ళు అప్పుడే కబుసం విడిచి నాగస్వరానికి తలవూపుతున్న కాలసర్ప నేత్రాల్లా వున్నాయి.

★ ★ ★

ఎదురుగా కనిపించిన ఆ దృశ్యం చూస్తూనే విశ్వధర వర్మ ఒక్కసారిగా లేచినిలబడ్డాడు.
"వీరన్నా! ప్రమాదం!" బిగ్గరగా హెచ్చరిస్తూ గుర్రపుబగ్గీలోంచి కుప్పించి

భయంకరంగా ఒక్క పొలికేక పెట్టాడు వీరన్న!
అతని కుడి చెయ్యి భుజందాకా తెగి నేలమీద పడిపోయింది.
ఆ వ్యక్తి అంతటితో ఆగలేదు.

చేతిలోని ఖడ్గాన్ని గిరగిరా తిప్పుతూ మరోసారి ప్రయోగించాడు. ఈసారి సరిగ్గా వీరన్న కంఠం మీద పడింది వేటు. వీరన్నకు అరవడానిక్కూడా వీలు చిక్కలేదు. అతని తల బంతిలా పైకెగిరి నాలుగడుగుల కవతల నేలమీద పడిపోయింది.
కన్నుమూసి కన్ను తెరిచేలోగా జరిగిపోయిందా ఘోరం.

విశ్వధరవర్మ ఆ దృశ్యం చూశాడు.
ఆయన కళ్ళలోకి రక్తం ఒక్కసారిగా ఎగజిమ్మింది.
సింహంలా గర్జిస్తూ వెళ్ళి వీరన్న తలతెంచిన వ్యక్తి మీదికి కాలయముడిలా విరుచుకుపడ్డాడు.
మరుక్షణం ఆ వ్యక్తి విశ్వధరవర్మ చేతుల్లో చిక్కుకుని గాల్లోకి లేచాడు. విశ్వధరవర్మ వృద్ధుడైనా మహావీరుడు. బ్రిటిష్ పోలీసులతో నిరంతరంగా చేసిన యుద్ధాల్లో ఆయన శరీరం రాటుదేలింది. వీరన్నని చంపిన ఆ వ్యక్తిని రెండు చేతుల్తోనూ పట్టుకుని అమాంతం పైకెత్తి మిగిలిన వాళ్ళవైపు బంతిలా విసిరేశాడు.

ఆ వ్యక్తి చేతుల్లోని ఖడ్గం నేలమీద పడిపోయింది.
శత్రువులు కేకలువేస్తూ చెల్లా చెదురయ్యారు.
ఆయన ఒక్కక్షణం కూడా ఆలస్యం చెయ్యలేదు.
చప్పున కిందికి వంగి నేలమీద పడిన ఖడ్గం చేతుల్లోకి తీసుకున్నాడు.
అప్పుడు ప్రారంభమైంది యుద్ధం.
మహాయుద్ధం!

★ ★ ★

వజ్రపాణిని చూస్తూనే రాజేంద్రవర్మ చేతిలోని వజ్రం నేలమీదికి జారిపోయింది.
"వ...జ్ర...పా....ణి....!" అప్రయత్నంగా అతని నోటివెంట ఆ పేరు బయటికొచ్చింది.
వజ్రపాణి బిగ్గరగా నవ్వేడు.
"అలాగే తల్చుకో రాజేంద్రవర్మా! ఆఖరి క్షణాల్లో నాపేరు తలుచుకో!"
రాజేంద్రవర్మ పళ్ళు పటపట కొరుకుతూ వజ్రపాణి మీదికి పోబోయాడు.
అయితే అప్పటికే ఆలస్యం జరిగిపోయింది.
చేతుల్లో పొడవాటి ఖడ్గాలు ధరించిన పదిమంది దృఢకాయలు గుర్రాలమీద వాళ్ళని చుట్టుముట్టేశారు.

★ ★ ★

విశ్వధరవర్మ చేతిలో కన్నుమూసి తెరిచేంతలో ప్రత్యక్షమైన ఖడ్గాన్ని చూస్తూనే శత్రువుల మొహాలు వివర్ణమయ్యాయి. అంతలోనే వాళ్ళు తేరుకున్నారు.
విశ్వధరవర్మ ఎంతటి మొనగాడైనా



కండల్లో జవసత్వాలుడిగిన ముసలివాడు తాము పదిమందున్నారు చేతుల్లో ఆయుధాలతో వున్నారు ఒక్క ముసలి వాడు తమనేం చెయ్యగలడు!

ఆ వూహ వస్తూనే వాళ్ళు చేతుల్లోని కాగడాలు కిందపారేసి కత్తులుదూసి విశ్వధరవర్మ మీదికి విరుచుకు పడ్డారు

★ ★ ★

గుర్రాలమీద తమును సమీపించిన వ్యక్తుల్ని చూస్తూనే రాజేంద్రవర్మ ఎవరూ వూహించనిపనిచేశాడు

మెరుపులా కదుల్తూ పిడుగులా వెళ్ళి ఒక గుర్రం మీద పడ్డాడు

గుర్రాన్ని పక్కకు తప్పించడానికైనా ఆ రౌతుకు సావకాశం లేకపోయింది ఆడ వాళ్ళు కెవ్వున కేకపెట్టారు

రాజేంద్రవర్మ కళ్ళెం చేతుల్లో దొరక బుచ్చుకుని బలంగా కిందికి గుంజాడు. అంతటి గుర్రం ఒకే దెబ్బతో భయంకరంగా సకిలిస్తూ రౌతుతో సహా ఒక్క పల్టీ కొట్టింది రౌతు దూరంగా వెళ్ళిపడ్డాడు

ఆ మరుక్షణం పరిస్థితి మారిపోయింది

గుర్రం పైకి లేచేలోపల రాజేంద్రవర్మ ఒక్కదూకులో దాని జీనుమీదున్నాడు

బెదిరిపోయిన గుర్రాన్ని క్షణాలమీద తన అదుపులోకి తీసుకోవడమే కాదు, చకచకా వజ్రపాణి మీదికి నడిపించబోయాడు

కానీ, ఎదురుగా కనిపించిన దృశ్యాన్ని చూస్తూనే నిశ్చేష్టుడై వుండిపోయాడు

ఎట్నుంచి వచ్చారో ఇంకా వజ్రపాణి మనుషులు! చెరోవైపూ లక్ష్మినీ శ్రావణినీ బంధించారు

అనంత్ వజ్రపాణి చేతుల్లో గిలగిలా కొట్టుకుంటున్నాడు

వజ్రపాణి చేతిలోని పిడిబాకు ఆ పసివాడి కంఠం మీదుంది

★ ★ ★

ఆ పదిమందిలో ఏ ఒక్కరూ విశ్వధరవర్మ ఖడ్గ విద్యా నైపుణ్యాన్ని ఏ మాత్రం అంచనా వేయలేదు

ఒక్కుమ్మడిగా వాళ్ళు తనమీదికి దూకుతూనే విశ్వధరవర్మ మెరుపులా పక్కకు తప్పించుకున్నాడు పదికత్తుల్లో ఒక్కటి కూడా ఆయన్ని తాకలేదు ఆయన లాఘవానికి వాళ్ళందరూ విభ్రాంతులై చూస్తుండగానే విశ్వధరవర్మ చేతిలోని కత్తి వాళ్ళ కత్తుల్ని ఖణేల్ మంటూ తాకింది

మొదటి దెబ్బకే ఇద్దరి చేతుల్లోని కత్తులు జారిపోయాయి.



# టి.వి. దృష్టిపడని గాయకుడు

హసన్ జహంగీర్ పాటలంటే పాకిస్తా-న్‌లో చెవులు కోసుకుంటారట చాలామంది. పాక్ టి.వి. ఈ గాయకుడికి మంచి ప్రచారం కూడా యిచ్చిందట. మే మధ్యలో ఈ గాయకుడు భారత్‌ను సందర్శించి పాటలు వినిపించాడు.

అతని గానాన్ని విన్న సంగీత దర్శకులు నదీమ్- శ్రావణ్‌లు 'సోలహ్- సత్రహ్' చిత్రం-లో ఒక పాటకూడా పాడించుకున్నారట. మరి దూరదర్శన్‌కు ఈ గాయకుడిపై ఎందు-కు దృష్టి పడలేదో నంటున్నారు అనేకమంది. కాని ఈ 25 సంవత్సరాల గాయకుడికి మంచి భవిష్యత్తు వుందనే ఆశించాలి.

విశ్వధరవర్మ విజృంభించాడు

ఆయన ఒక్కడికత్తి ఎనిమిది మందికి ఏకకాలంలో సమాధానంచెబుతోంది చూస్తుం డగానే మరో ఇద్దరి కత్తులు నేలమీదున్నాయి

విశ్వధరవర్మ దృష్టి అంతా వీరన్నను చంపిన వాడిమీదే ఉంది

కొద్ది క్షణాలు అంతే!

విశ్వధరవర్మ సింహనాదం చేశాడు

ఆయన కత్తి గిరగిరా తిరుగుతూ గాల్లోకి లేచింది

అంతే!

ఆ మరుక్షణం వీరన్నను చంపిన వాడి కంఠం తెగిపోయింది

తల బంతిలా పైకెగిరింది

ఆ దృశ్యం చూస్తూనే అక్కడున్న వాళ్ళందరూ ఒక్కసారిగా హాహాకారాలు చేశారు

విశ్వధరవర్మ మరోసారి సింహనాదం. చేశాడు

అప్పటికే తమ సహచరుడు నేలకూలడం చూసి మిగిలిన వాళ్ళ గుండెలు జారిపోయాయి

ఆ సింహనాదం వింటూనే గజగజా వణికిపోతూ వాళ్ళు కత్తులు పారేసి ఒక్క పరుగుతీశారు

విశ్వధరవర్మ క్షణం ఆలస్యం చెయ్యలేదు

ఆయన కళ్ళముందు రాజేంద్రవర్మ మెదిలాడు

వజ్రపాణి తనమీదికే దాడి చేయించా డంటే రాజేంద్రపైకి కూడా వజ్రం కోసం వెళ్ళే వుంటాడు ఆ వజ్రం గురించి అతనికెలా తెలిసిపోయివుంటుందో ఆలోచిం చడం ఇక అనవసరం ముందు రాజేంద్ర వర్మ క్షేమంగా వున్నాడో లేదో తెలుసు కోవాలి

ఆ వూహ వస్తూనే ఆయన కాలు ఒక్కక్షణం నిలవలేదు

గుర్రపుబగ్గీ దగ్గరికి పరిగెత్తి ఒక్కంగలో ఎక్కి కూర్చుని ఛెళ్ళుమంటూ కళ్ళెం విదిలించాడు

మరుక్షణం వాయువేగంతో గుర్రపుబగ్గీ ముందుకు దూసుకుపోయింది

(ఇంకావుంది)




దేశంలో కోటీశ్వరులనేక మంది వుండవచ్చునేమో గాని ప్రపంచంలో నే కోటీశ్వరులకు కోటీశ్వరుడు బ్రూనీ సుల్తాన్!

ఈ సుల్తాన్‌కు కంటికి ఏది కనపడితే అది-అంటే హోటళ్లు, భవనాలు మొదలగునవి కొని పడెయ్యడమే పనట. ఈయన మొత్తం సంపద 2500 కోట్ల అమెరికన్ డాలర్లు. భారత్, ఆస్ట్రేలియా, దక్షిణ కొరియాల విదేశీ మారక ద్రవ్యాన్ని కలిపిన దానికంటే కూడా ఈ మొత్తం ఎక్కువేనంటున్నారు. అభివృద్ధి చెందిన దేశంలో సగటున సంవత్సరానికి 20 వేల డాలర్లు సంపాదించుకొనే కార్మికుడు 125 లక్షల సంవత్సరాలు కష్టపడినా ఈ సంపదను పొందగలడా అన్నది అనుమానమే!

ఒక చోటు నుంచి మరో చోటుకి వెళ్లాలంటే ఎక్కడికక్కడ రోల్స్‌రాయిస్ కార్లు సిద్ధంగా వుంటాయట ఈ సుల్తాన్‌కు.

## సమస్యలు...

ఇంత డబ్బుంది కదా హాయిగా సుఖజీవనం గడుపుతున్నారనుకుంటున్నారా ఈయన అంటే... లేదట. డబ్బెక్కువైతే సమస్యలు సహజమే మరి! సుల్తాన్‌కు తాను ఏ పనిలో నిమగ్నమవ్వాలో నిర్ణయించుకోవటం చాలా కష్టమైపోతున్నదట. తన జెట్ విమానంలో షికార్లు కొట్టాలో, పోలో ఆడాలో, షూటింగ్‌కు వెళ్లాలో నిర్ణయించుకోలేక సమస్యల వలయంలో ఈ సుల్తాన్ చిక్కుకుంటుంటాడట.

సాధారణ వ్యక్తి జీవన గమనానికి మన బ్రూనీ జీవనగమనానికి చాలా తేడా వుంది.




## దినచర్యలు

ప్రొద్దున్నే లేవగానే ఒక్కసారి కళ్ళు తెరిచి తాను ఏ భవనంలో నిద్రించానోనని గుర్తు చేసుకుంటాడట ఈ సుల్తాన్. అంటే దాన్నిబట్టి ఈ మహానుభావుడికి ఎన్ని భవంతులున్నాయో ఊహించుకోవచ్చు కదూ!

రాజధానిలోని ప్రధాన భవనంలో మొదటి భార్య రాణి సలేహాతో ఒక రోజు, ఊరికి చివర అడవుల సౌందర్యాన్ని ఆరాధించేందుకు కట్టుకున్న కొత్త భవనంలో రెండవ భార్య రాణి మేరియంతో మరో రాజు- యిలా రోజు విడిచి రోజు యిద్దరు భామలను సుఖపెడుతుంటాడట సుల్తాన్‌జీ. ప్రేమను యిద్దరికి సమంగా పంచిపెట్టేందుకు ఈ విధంగా కాలక్షేపం చేస్తుంటాడు ఈ సుల్తాన్.

కొత్త భవనంలో రెండవ భార్యతో వున్నప్పుడు ఉదయం లేవగానే ఈతకు వెళ్ళటం, ఆ తర్వాత టెన్నిస్ ఆడటం చేస్తుంటాడు తన రాణికి, తనకు ప్రత్యేకించి ఒలింపిక్స్‌లో మాదిరి ఈతకొలను కట్టించుకున్నాడట ఈ కోటీశ్వరుడు. నిద్ర లేవటమే తడవుగా ఈతకొలనూ దగ్గరకు సునాయాసంగా చేరే విధంగా రహదారి ఏర్పాటు చేసుకున్నారట.

ప్రధాన భవనంలో మొదటి భార్య సలేహాతో గడిపినప్పుడు ఉదయం లేవగానే హెలికాప్టర్‌లో షికారుకెళ్ళొస్తాడట. సుఖంగా కూర్చునే విధంగా దీన్ని తయారు చేయించుకున్నాడు సుల్తాన్. దీనిలో సీట్లకు వుండే బెల్టులు తోలువను కుంటున్నారేమో.... కాదు బంగారపు పూతతో తయారు చేసినవట. సంవత్సరానికో విమానాన్ని ఈ సుల్తాన్ కొనుగోలు చేస్తుంటాడు. డబ్బును మంచినీళ్ళ ప్రాయంగా ఖర్చు చేసే సుల్తాన్ సాబ్‌కు వీడియో గేములంటే మహా ప్రీతిట. 1988 లో కాలిఫోర్నియా లోని ఎమ్యూజ్‌మెంట్

# అంతులేని డబ్బున్న మనిషి జీవితం!

పార్కులో వేల డాలర్ల స్కిల్ గేమ్‌ల మీద తగలెట్టాడట....

## లండన్‌తో సంబంధం

లండన్‌కు- సుల్తాన్‌కు చాలా అవినాభావ సంబంధముందట. కారణం తన షాపింగ్‌నంతా ఎక్కువ లండన్‌లోనే చేస్తుంటాడటీయన. అందుకే అక్కడ నివసించే వాళ్ళకు కూడా తెలియని అనేక ప్రాంతాలు ఈయనకు కొట్టిన పిండట. హెయిర్ డ్రస్సింగ్‌కు ఒక వ్యక్తి ప్రత్యేకంగా వుండటమే కాకుండా, దంత వైద్యుడు లండన్ నుంచి వచ్చి వెళ్తుంటాడట. ఈ వైద్యుడు డబ్బున్న వాళ్ళకే వైద్యం చేస్తాడట ఎక్కువ డబ్బులు ముడతాయని.

## సతీమణుల ఆభరణాలు

సుల్తాన్ సతీమణులు ధరించే ఆభరణాలను లెక్కగట్టడం అంత తేలికేం కాదు. మొదటి భార్య 50 వజ్రాలు పొదిగిన కడియం వేసుకుంటుంది. కాగా రెండవ భార్య 25 క్యారెట్ల వజ్రపు ఉంగరాన్ని ధరిస్తుందట. మొదటి రాణి వేసుకునే కడియంలోని ఒక్కొక్క వజ్రం రెండు క్యారెట్లు వుంటుందిట. చేతి ఉంగరాలు, కడియాలే అంత ఖరీదుంటే మెడలో ధరించే ఆభరణాలు విలువ ఎంత ఉంటుందో ఊహించుకోవటం కష్టం కదూ! న్యూయార్క్‌లో 880 వేల అమెరికన్ డాలర్లు వెచ్చించి ఎర్ర వజ్రాన్ని కొనుగోలు చేశాడు సుల్తాన్. మరి అది ఎవరికిస్తాడో?

ఊరి పొలిమేరల్లో వున్న సుల్తాన్ భవనం ముందు కోటకున్న మాదిరిగా ఎత్తైన గోడలుంటాయి. మొదటి అంతస్తులో 32 అడుగుల వెడల్పుగల గది వుందట. అదే సుల్తాన్‌గారి స్పెషలు. ఈ భవనంలో వింతేమిటంటే ఈ గదికి అనుకుని వున్న రెండు పడక గదులు రెండవ అంతస్తుకు జరిగి వెళ్ళిపోతాయట. ఈ ప్రత్యేకమైన గదులను ఎందుకు కట్టించుకున్నాడో ఎవ్వరికీ అర్థం కావటంలేదు. ఈ రెండు పడకగదుల వెంబడి అనేక పడక గదులున్నాయట. ఏ పడక గదిలోకి వెళ్ళాలంటే ఆ గదిలోకి సునాయాసంగా వెళ్ళిపోయే విధంగా కట్టించుకున్నాడు సుల్తాన్. డబ్బుంటే ఎన్నయినా చేసుకోవచ్చు అనుకుంటాం. కాని డబ్బున్నా అనుభవించే యోగ్యత వుండొద్దూ!

36 అడుగుల పొడవుగల కప్ బోర్డులతో డ్రస్సింగ్ రూం ఏర్పాటయింది. ఇంకో వింత గొలిపే విషయమేమంటే క్రింద వున్న ఈతకొలనుకు నడిచి వెళ్ళే శ్రమ లేకుండా నేరుగా అక్కడ చేరుకొనే విధంగా మెట్లు కట్టించాడట. అవే జరిగి వెళ్ళిపోతాయి వాళ్ళు కదలకుండానే.



బ్రూనీసుల్తాన్



మొదటి భార్య రాణి సలేహ

**ద్వితీయ ... ఈతకొలను**

ఈ విధంగా అనేక అత్యాధునిక రీతుల్లో నిర్మితమైన సుల్తాన్ భవంతులను చూసి తీరాల్సిందే కాని వర్ణించనలవి కాదట.

ఆనందమయ జీవితం కోసం యింత డబ్బు తగలేసే బదులు దానధర్మాలు చేయవచ్చు కదా అంటారేమో! డబ్బుంటే దానం చేయాలని ఎక్కడైనా వ్రాసి వుందా? అది వుంటే ఎన్ని సౌకర్యాలైనా ఏర్పాటు చేసుకోవచ్చు కదూ! కాని ఆ డబ్బు సంపాదించటం ఎలాగా? ఆ సుల్తాన్‌గారినే అడగాలి.

(ది టెలిగ్రాఫ్ ఆధారంగా) (తిలక్)

"మీరప్లై చేసిన కంపెనీలో జాబ్ సంగతేమైందండీ?"

"సేల్స్ ఎక్జిక్యూటివ్ జాబ్ కదా? వేలకువేల క్యాష్‌తోమాట! అందునా అల్లాటప్పా కంపెనీకాదు! పెద్దకంపెనీ! ఇద్దరు గవర్నమెంటుద్యోగస్థుల ష్యూరిటీ వుండాలన్నారు!"

"ఎవర్నైనా కనుక్కోలేక పోయారా?"

"మన ప్రతాప్ వొకడున్నాడు! ఇంకొకరు కావాలి!"

"అయితే... యింకొకరి ష్యూరిటీ దొరికితే... ఆ వుద్యోగం ఖాయమేనన్నమాట! నెలకి పన్నెండొందల జీతం! టూర్లలో వున్నపుడు టి.యే, డి. యే సౌకర్యం! ఏమండీ... యెలాగేనా ప్రయత్నించండి! యీ అవకాశాన్నొదులుకోకండి!"

కుతూహలంగా అంది భర్త శివానంద్‌తో యమున.

"యమునా. మనకి ప్రతాప్ యెలాగో, వాడికీ అంతకన్నా క్లోజ్ అయిన ఫ్రండున్నాట్ట మురళీధర్ అని.... కనుక్కుని వెంటనే యే విషయం చెబుతానన్నాడు!"

"అలాగా.... ఆ దేవుడి దయవల్ల అది ఖాయమైతే యెంత బావుండు! యీ చాలీ చాలని వుద్యోగం బాధైనా మనకి తప్పుతుంది."

"ప్రతాప్ అన్నాడంటే.... నైంటీ పర్సంట్ గ్యారంటీ వుంటుంది! ఇహ మనకా జాబ్ వచ్చినట్టే ననుకో భార్యామణీ.... అవునూ... యీ రాత్రి కబుర్లతోనే తెల్లారి పోయేట్టుంది! టైం చూడు.... పదకొండు దాటింది! టూర్‌లోని వారం రోజుల విరహం వడ్డీతో సహా....."

"అబ్బో.... ఆశ..."

సిగ్గుపడ్తున్న భార్యను దగ్గరకు తీసుకుంటూ వుత్సాహంగా లైటార్పేశాడు శివానంద్. అంతలోనే ముందుగది తలుపు టక టకమంది. చటుక్కున మంచం మీది నుండి లేచాడతను. మరుక్షణంలోనే...."అ... యెవరోలెద్దూ.... నువ్వు లేవద్దు!"అంటూ భార్యను వెళ్లనివ్వకుండా ఆమె చేయి పట్టి దగ్గరకు లాక్కోబోయాడతను. మళ్లీ టకటకమంది రెండోసారి తలుపు.

"వెళ్లక తప్పేట్టులేదు.... ఖర్మ ఖర్మ..."

అనుకుంటూ.... ఆదిలోనే తపోభంగమైన మునిలా లేచివెళ్లి లైటు వేసి ముందుగది తలుపు తీశాడు. ఎదురుగా తలుపవతల యెవరో అపరిచిత వ్యక్తి. అదోలా మొహం పెట్టాడు శివానంద్.

"ఎక్స్‌క్యూజ్ మీ.... యీక్వార్టర్స్‌లోనే, 38 బ్లాక్ ఫ్లాట్ నెం. 5లో రాజారావు అనే ఆయన చేరాడు మొన్ననే.... స్టీల్ ఫ్యాక్టరీలో పన్జేస్తాడండీ.... దయచేసి ఆ క్వార్టర్ యెటువేపో చెబుతారా?"

చిట్లించిన మొహంలో చిరాకు దాచుకోలేక పోయాడు శివానంద్.

"రాజారావెవరో, రమణారావెవరో నాకు తెలీదు... సారీ..."

తుంచినట్టుగా అన్నాడు.

"అదికాదండీ.... జస్ట్... యీ బ్లాక్,



ఫ్లాట్ నెంబర్ సూచిస్తే...."

"తెలీదంటున్నానుగా...."

తలుపు వేసుకోబోయాడు.

"ఎవరండీ...."

అక్కడి కొచ్చిన యమున అడిగింది.

'సారీ ఫర్ ది డిస్టర్బెన్స్....'

అపాలజిటిగ్గా అంటూ వెనుదిరిగాడా వ్యక్తి.

"ఎవరో.... ఏమిటో? ఎవరిదో అడ్రస్ కావాలిట! అర్ధరాత్రప్పుడు అథార్టీ వున్నట్టు తలుపు కొట్టటం, డిస్టర్బ్ చెయ్యటం, తేలిగ్గా సారీ చెప్పటం... ముక్కూ మొహం యెరక్కున్నా, అలా యెలా చెయ్య బుద్దేస్తుందో?"

లీలగా ఆవ్యక్తికామాటలు విన్పించాయనే, విన్పించాలనే అన్పించగా తలుపు మూసుకున్నాడు శివానంద్.

* * * *

"హాయ్... ప్రతాప్... కమాన్.... కమాన్...."

ప్రొద్దున్నే వచ్చిన మిత్రుణ్నాప్యాయంగా ఆహ్వానించాడు శివానంద్.

"ఒరే శివా... యూ ఆర్ సో లక్కీ... నీకు ష్యూరిటీ యివ్వటానికొప్పుకున్నాండ్రా మురళి! నే చెప్పలే? వాడు చాలా మంచి మనిషని? యెంతో హెల్పింగ్ నేచరని? ఆదివారం యింట్లోనే వుంటాను! రేపు నిన్ను తీసుకు రమ్మని చెప్పాడు నిన్న. పద వెళ్దాం! ఫామ్స్ కూడా తీసుకో! సంతకాలవీ పూర్తి చేసుకోవచ్చు!"

త్వరపెట్టాడు ప్రతాప్.

యమునందించిన టీ తీసుకుని ఆతురతగా బయట పడ్డారిద్దరూ.

* * * *

తిలక్‌నగర్‌లోని వో యింటిముందాగి కాలింగ్ బెల్ నొక్కాడు ప్రతాప్.

"నువ్వా ప్రతాప్... లోపలికిరా, నాయనా..." అంటూ సాదరంగా ఆహ్వానించినామెను మురళీధర్ తల్లిగా పరిచయం చేశాడు ప్రతాప్ శివానంద్‌కు.



"మురళీ... స్నానం చేస్తున్నాడు... యిప్పుడే వచ్చేస్తాడు కూర్చోండి బాబూ... కాఫీ తెస్తాను!"

అంటూ ఆవిడ లోపలికెళ్లి పోయింది.

"హమ్మయ్య... అతనున్నాడు. ఇవాళే పని పూర్తవుతుంది. ఇహ ఆ ఉద్యోగం ఖాయం. పేరొందిన ఆ కంపెనీలో జాబ్ అంటే .. అదృష్టం పండినట్లే.!"

దాగలేని ఆనందం శివానంద్ వదనంలో ప్రస్ఫుటమవుతుంది.

ఆత్మీయంగా, ఆదరంగా అటు మురళి తల్లిదండ్రులూ, ఇటు అతడి భార్యా బిడ్డలూ.... ప్రతాప్‌ను పరేసరి, తన్నుకూడా అంత అభిమానంగా రిసీవ్ చేసుకున్న తీరుకి ముగ్ధుడయ్యాడు శివానంద్.

"ఎంత సంస్కారవంతమైన కుటుంబం? ప్రతాప్ మాటబద్ధంకాదు! దీన్ని బట్టి చూస్తుంటే, వెరీ నైస్ జంట్లిమన్ మురళీధర్.. అన్పిస్తుంది!" అనుకోకుండా వుండలేకపోయాడతను.

"వచ్చేశారా? " అంటూ ప్రవేసించిన మురళీధర్‌ని శివానంద్‌కు పరిచయం చేశాడు ప్రతాప్.

"నమస్కారం.. " అంటూ నవ్వుతూ చూసిన శివానంద్ మరి కాస్త పరిశీలనగా మురళీధర్ వేపు చూసాడు.

అప్పుడే స్నానం, ధ్యానం పూర్తి చేసుకొచ్చినట్టుగా తెల్లని లుంగీ, షర్టుతో నుదుట చుక్కలాటి కుంకుమ బొట్టుతో, మృదుమందహాసంతో, ఎదురుగా సోఫాలో కూర్చున్నాడతను!

ప్రతాప్ శివానంద్ గూర్చి చెబుతున్నాడు. టిఫిన్, కాఫీలనంతరం, ఫామ్ తీసి మురళీధర్ ముందుంచాడు ప్రతాప్.

సంతకం పెట్టబోయాడు మురళీధర్.

"ఆగండి"

హఠాత్తుగా అడ్డుకున్నాడు శివానంద్.

"మురళీధర్‌గారూ.. మీరూ.. మీరూ.. నన్ను..నన్ను... గుర్తించారా?"

"అఫ్‌కోర్స్" తేలిగ్గా నవ్వేశాడతను.

"ప్లీజ్ మీరా కాగితంమీద సంతకం పెట్టకండి! నన్ను మనస్ఫూర్తిగా క్షమించానని అండి! అప్పుడుగాని సంతోషంగా ఆ సంతకం స్వీకరించలేను!"

బాధ; పశ్చాత్తాపం శివానంద్ స్వరంలో

"ఏమిట్రా ఇదంతా?"

వింతగా అడిగాడు ప్రతాప్.

"ఒరే..ప్రతాప్.. మొన్న మురళీగారు మా యింటి కొచ్చార్రా.. ఎవరిదో అడ్రస్ అడిగితే... అపరిచితుడని నిర్లక్ష్యంగా కాదు పొమ్మన్నాను!"

మురళీధర్ వేపు చూసాడు ప్రతాప్.

"ఆ మరేం లేదురా ప్రతాప్.. మా యింటి పక్కనున్న రాజారావు మొన్ననే యిల్లు ఖాళీ చేసి వెళ్లిపోయాడు. తల్లి ఆరోగ్య పరిస్థితి బాగాలేదని ఆయన పేరిట టెలిగ్రామొచ్చిందా అడ్రస్‌కే! అది తీసుకుని నేను వెంటనే ఆయన కొత్త అడ్రస్‌తో క్వార్టర్స్‌లో ఎంక్వైరీ చేయడం శివానంద్‌గారిని డిస్టర్బ్ చేయటమూ జరిగింది!"

దెబ్బతిన్నట్లు చూశాడు శివానంద్.

"అంతమాటనకండి మురళిగారూ.. కేవలం బంధుమిత్రులూ, స్నేహితులూ, పరిచయస్థులైతేతప్ప వారి అవసరమేమిటో గ్రహించలేని, ఆదరించలేని, మర్యాద చూపించలేని నా అవివేకపు ప్రవర్తనను మన్నించండి!

గుమ్మంముందుకొచ్చిన మనిషిని మీ అవసరమేమిటని, మీకోసం నేనేం చేయగలనని.. వో ఆదరణీయమైన పలకరింతతో, ఆచరణీయమైన సహన భావంతో, మనిషికీ మనిషికీ మధ్య నుండాల్సిన అవగాహనను స్నేహ భావనని సృష్టించుకోగల్గటంలో ముక్కూ మొహం ఎరిగుండాల్సిన అవసరంలేదని అర్థమైపోయిందిప్పుడే. ఏ ముక్కూ మొహం ఎరుగని నాకింతటి ఫూరిటీ, ఎంతో నమ్మకంతో మీరివ్వసిద్ధపడితే.. చిన్నపాటి సమాచారమివ్వటానికే భంగపాటుగా న్యూసెన్స్‌గా ఫీలయ్యానంటే నిజంగా సిగ్గుపడుతున్నాను మురళీధర్‌గారూ!..."

శివానంద్ మనసూ, కళ్లూ రెండూ చెమర్చాయి.

"ఇట్సాల్‌రైట్.. టేకిట్ ఈజీ శివానంద్‌గారూ.." స్నేహభావంతో శివానంద్ భుజం తట్టాడు.

ఆ చేత్తోనే కాగితంపై సంతకం పెట్టాడు. మురళీధర్..

తను, తనవాళ్లు.. తనకు తెల్సిన వాళ్లకే తన కర్తవ్యాదరణలు, ప్రేమాభిమానాలు పరిమితమనుకుంటే ఆ పరిధక్కడికే అంతమౌతుంది కూపస్థమండూకంలా!

మనిషిగా ప్రతి సాటి మనిషిపట్ల తనకున్న కనీస కర్తవ్యం గుర్తు చేసుకుంటే ఒకరికొకరన్న స్నేహ సౌహార్ద్ర భావాలతో మనగల్గితే.. ఆ పరిధి విస్తృతమై విశ్వవ్యాప్త మౌతుంది కూడా!

అన్నట్టుగా రెపరెపలా డిందా కాగితం విశ్వకేతనంలా విపులీకృతమౌతూ! ●



# ఫాలాక్షుని డైరీ

## నగల కోసం హత్య

నామక్కల్ చిన్న అయ్యంపాళయం అనే గ్రామానికి చెందిన కందసామి భార్య కాళియమ్మ పశువులను మేపడానికి వూరి బయటికి తోలుకు వెళ్లిందట. మేత మేసి ఆవులన్నీ తిరిగి వచ్చాయట కానీ, ఆమె రాలేదట. దాంతో కందసామికి భయమూ, అనుమానమూ పుట్టి, వెతకడానికి బయల్దేరితే మనకాదు అనే చోట ఆమె చచ్చి పడుందట. కొడవలి వంటి ఆయుధంతో పీక కోసినట్టుందట. చెవులకూ, మెడలోనూ వున్న బంగారు నగలు ఎవరో ఎత్తుకుపోయారట. వీటి కోసమే హత్య జరిగిందని పోలీసులనుమానిస్తున్నారట.

## గుహలో 130 రోజులు

అమెరికాకు చెందిన స్టెఫానియా పొల్లిని అనే వో సాహసవంతురాలు ఇటలీ శాస్త్రజ్ఞుల బృందం చేసే వో ప్రయోగాని కోసం నూట ముప్పయి రోజులు వో గుహలో వంటరిగా గడిపి, క్షేమంగా నూట ముప్ఫయి ఒకటో రోజుకు బయటకు వచ్చిందట. ఈమెకు టైము తెలియడానికి కనీసం చేతికి గడియారం కూడా లేకుండా ఆ గుహలో గడిపిందట. అటువంటి చీకటి, నిరాశాజనకమైన ప్రదేశంలో వంటరి మనిషి మానసిక ప్రవృత్తిపై ఆ శాస్త్రజ్ఞులు జరిపే పరీక్షకా యువతి అట్టి విధంగా సహకరించిందట.

## బలవంతంగా గర్భస్రావం: ఆర్గురి అరెస్ట్

తిరుచెంగోడు కందపాళయానికి చెందిన మణి అనే అతను మూడున్నరేళ్ల క్రితం పాప్పాతి అనే ఆమెను వివాహం చేసుకుని కొన్నాళ్లు గడిచాక, మీ అమ్మనడిగి డబ్బు పట్రా అని భార్యను వేధించుకు తినేవాడట. కొన్నిసార్లు అయిదు, పది వేలు తెచ్చిన ఆమెకి విసుగుపుట్టి ఇహ నా వల్ల కాదు అందట. దాంతో డబ్బు కోసం వేరే పెళ్లయినా సరే చేసుకొని తీరాలి అన్న నిర్ణయానికి వచ్చిన మణి తన భార్య పాప్పాతి రెండున్నర నెలల గర్భిణి అని తెలిసి, తనకు తెలిసిన డాక్టరింటికి ఆమెను పిల్చుకుపోయి, మైకం మందిచ్చి గర్భస్రావం చేయించాడట. ఆనక ఆ పాప్పాతి యిచ్చిన ఫిర్యాదుపై పోలీసులు ఆమె భర్త, అత్తమామలను ఆడ డాక్టరు, మరో యిద్దరిని పోలీసులు అరెస్ట్ చేశారట.! చైరా మరి!

## పాపకోసం కోర్టుకెక్కిన రెండు జంటలు

అలనాటి సోల్మన్ కథలలో లాగ ఒక పాపకు తలిదండ్రులం మేమంటే మేమని రెండు జంటల తలిదండ్రులు వాదిస్తున్నారట. మద్రాసుకు చెందిన లక్ష్మి లేక- మేరి అనే అయిదేళ్ల పాప తమ కూతురని నక్కీరన్ అనే పత్రిక న్యాయ సలహో విభాగం అధిపతి రాజగోపాల్ అనే ఆయన వో పిటిషన్ దాఖలు చేశారట. అదే పిల్ల తమ కూతురని పెరుమాళ్, కాళియమ్మ అనే దంపతులు కూడా కోర్టుకు ఎక్కడంతో కోర్టు ఆ పాపను బాలమందిర్‌లో వుంచాలని, లేనిచో డి. జి. పి. కస్టడీలో వుంచాలనీ తీర్పు చెప్పిందట.



## రెండో పెళ్లాం హత్య

సేలం జిల్లా ఆడయాంపట్టికి చెందిన 25 ఏళ్ల అమరావతికి, పనమరత్తు పట్టికి చెందిన 28 ఏళ్ల సుందరరాజనుకు రహస్య ప్రేమాయణం ఆరంభమయి అది పెళ్లిగా రూపొందిందట. అతనికి యిదివరకే రత్నమ్మ అనే ఆమెతో పెళ్లయిన విషయం ఆనక తెలిసిందట. దాంతో అమరావతికీ అతనికీ రోజూ పోట్లాట వస్తుండేదట. నిండు గర్భిణిగా వున్న ఆమెను అతనోనాడు నూతిలో తోసేస్తే చుట్టుపక్కల వారు రక్షించారట. ఆ పాటుకు ఆమెకు మృత శిశువు జన్మించిందట. మళ్లీ ఆమె తల్లిదండ్రులామెను సమాధాన పరచి కాపురానికి పంపారట. సుందరాజన్ అమరావతిని తీసుకుని ,సేలం వెళ్లొస్తానని చెప్పి, యిహ తిరిగి రాలేదట. మల్లూరు అనే వో నూతిలో వో గోనె సంచిలో దొరికిన స్త్రీ శవం అమరావతిదేనని తేలిందట. హత్య జరిగిన రోజు సుందరాజన్ దొంగసారా అమ్మకం నేరంలో ఖైదు చేయబడి జైల్లో ఉన్నాడట. హత్య కేసు తప్పించుకోడానికి యీ పన్నాగమని పోలీసులు విశ్వసిస్తున్నారట.

## హెరాయిన్ పట్టివేత

ఢిల్లీ నుంచి నైరోబికి వెళ్లే విమానంలో 'బొమా'కు వెళ్తున్న వో ప్రయాణీకుని వద్ద దాచిన 12 కోట్ల విలువగల 12 కిలోల హెరాయిన్ను, జుహు ప్రాంతంలోని వో అయిదుగురు నైజీరియా దేశస్థుల నుంచి 6 కోట్ల విలువగల ఆరు కిలోల హెరాయిన్‌ను (బొంబాయిలో) పోలీసులు పట్టేశారట. ●





# యువతా కవితా

## హుండీలో దక్షిణ

కొట్టుకు పోయే రోడ్లు వేసి
కూలిపోయే బ్రిడ్జీలు కట్టి
అనర్హులకు ఉద్యోగాలిప్పించి
ఆక్రమించుకున్న బంజర్లకు
ప్రభుత్వం నుండి పట్టాలు సంపాదించి
హత్యలెన్నో గావించి
ఆత్మహత్యలుగా సృష్టించి
అబలలనెందర్నో మోసగించి
కోట్లు కోట్లు కూడబెట్టి
ఈ సమస్త పాపాలనూ
కడిగేసుకునేందుకూ
కాటికి చేరే వరకూ
కాలాన్ని చల్లగా చూడమనీ
దోచుకున్న దాంట్లో
కొంత కొంత పైని దేవుని
హుండీలో వేస్తా(రు)!

—శరగడం నరసింగరావు

## నిజం

అవినీతి
అందలం ఎక్కినప్పుడు
సహజ వనరులకు
గ్రహణం పట్టినప్పుడు
జీవ నదులున్నా
గొంతు తడపలేవు
పంట భూములున్నా
పొట్ట నింపలేవు!

—గిడ్డి వెంకటరమణ

## నేనెవరిని?

అందరికి అందుబాటులో ఉంటాను
కొందరు నన్ను అవసరానికి
ఉపయోగించుకొంటారు
మరి కొందరు వినాశనానికి
వాడుకొంటారు
ఇంతకీ నేనెవరిని... 'అగ్ని'ని కదూ!

—పాటిబండ్ల శ్రీనివాస్

## అందం... ఆనందం

అందం ఆనందం. అదియే మధురం
అందం ఆ మధురం అదియే స్వర్గం ॥ అం.॥

అటునిటు గాలికి- ఆకులమాటున
కదిలెడి విరులే- లతలకు అందం
చివురులు తింటు- ఆమనికోయిల
కూసిన కూతలే- మావికి అందం ॥ అం.॥

అలల తాకిడికి- అటునిటు ఊగెడి
కలువల కన్నెలు- కొలనుకు అందం
తళతళలాడెడి- తారల గుంపులో
మెరిసే చంద్రుడు- మింటికి అందం ॥ అం.॥

గణగణ మ్రోగే- గంటల సవ్వడి
బసవడి మెడకే- ఒక అందం
మూడు రంగులా- మురిసే జెండా
భారతావనికే- ఒక అందం ॥ అం.॥

- జి. సుబ్రమణ్యం



సీరియల్

# సూపర్ గర్ల్

## వింజమూరి విజయ శాంభవి

(గత సంచిక తరువాయి)

తమ పాపాలకి తగిన శిక్షను ఈ విధంగా అనుభవించారు వాళ్ళు. చివరికి సంజయ్ రంజన్‌ల లాంటి వాళ్ళ జీవితాలకి చివరికి ఇలాంటి ముగింపే లభిస్తుందేమో?

దేశంకోసం ప్రాణాల్నే త్యాగం చెయ్యడానికి సంతోషంగా సిద్ధపడాల్సిన యువత ఈ విధంగా సంఘ విద్రోహక శక్తిగా ఎందుకు తయారవుతోంది? ఈ లోపం ఎవరిది?

డిగ్రీలు పుచ్చుకున్నా ... బ్రతకడానికి ఇంత ఆధారం అంటూ చూపలేక పోతున్న ప్రభుత్వానిదా?

పైసా ఆదాయంలేని వాడ్ని ఓ పురుగులా చూస్తూ ... వారిని పెడదారులు పట్టిస్తున్న సమాజానిదా?

లేక ... భోగలాలసతకి అలవాటు పడిన యువతరానిదా?

దేశంలోని ఆర్థిక అసమానతలు ... నిరుద్యోగ సమస్య రూపుమాసి పోనంత కాలం, యువతరంలో కష్టపడి బ్రతకాలన్న ఆలోచన పట్టుదలా రానంతకాలం ... సంజయ్‌లు ... రంజన్‌లు ... శంకర్‌లు తయారవుతూనే వుంటారు సమాజంలో! వారిని పోషించే ధర్మరాజులూ వృద్ధి చెందుతూనే వుంటారు!

దీర్ఘంగా నిట్టూరుస్తూ అడిగింది కార్తి ... "అంకుల్! రోజ్ ఎలా వుంది? పాపం ... నాతోపాటు తనూ చాలా కష్టపడింది ..."అని!

చైతన్య నవ్వుతూ ..." ఫరవాలేదులే! అందుకు తగిన ఫలితాన్నే పొందింది ! రోజ్ నీ కోసం ఓ శుభవార్తతో ఎదురుచూస్తోంది హైదరాబాదులో ...తెలుసా"? అన్నాడు!

"ఏమిటది"? ఆసక్తిగా అడిగింది కార్తి!

ఊహూఁ? నేను చెప్పను! తనే చెబుతుంది..." అంటూ మళ్ళీ నవ్వాడు చైతన్య!

వెంటనే అతను మాటమారుస్తూ ..."విజయవాడలో నేను నిన్ను ఎక్కడ పట్టుకుని రహస్యాన్ని మాయంచేస్తానో అని భయపడి ... హైదరాబాదునుండి నన్ను వెంబడిస్తూ వచ్చిన సోఫియా మనిషి జానీ ... బారినపడకుండా రోజ్‌ని నా ఫ్రెండ్ ఒకతను రక్షించాడు తెలుసా..."?

"అలాగా? ఎవరతను?" ఆసక్తిగా అడిగింది!

"విజయవాడ సూపరింటెండెంట్ ఆఫ్ పోలీస్ రమేష్ చంద్ర..." చెప్పాడు చైతన్య!

"అవునూ అంకుల్! నువ్వు ఇన్ని విషయాలు చెప్పావు! పురందర్ బృందం నన్ను కిడ్నాప్ చెయ్యడానికి ప్రయత్నిస్తోందన్న విషయం నీకు తెలియజేసిన ఆ అజ్ఞాత వ్యక్తి ఎవరు? అతడ్ని గురించి చెప్పనే లేదు నువ్వు"?

ఆసక్తిగా అడుగుతున్న కార్తి వైపు చూసి నవ్వి..."రాజేష్...సంగమేశ్వరరావు కొడుకు..."అని చెప్పాడు!

అదిరిపడింది కార్తి..."వ్వాట్? నువ్వు చెబుతున్నది నిజమా? రాజేష్ స్వయంగా తన తండ్రి దుర్మార్గాన్ని...రహస్య-జీవితాన్ని గురించి బయట పెట్టాడా"? నమ్మలేనట్టు అడిగింది బిందు!

"అవును బేబీ! పాపం... అతడు నిన్ను ఎంతగానో అభిమానిస్తున్నాడు! ఆ అభిమానమే తండ్రి కటకటాల వెనక్కి పోవలసి వస్తుందన్న భయానికి అతన్ని లోబడకుండా చేసింది..."!

కార్తి కళ్ళముందు ... చీటికి మాటికి తన వెంటబడి అల్లరి చేస్తూ ... చివరికి సహనం కోల్పోయిన తన చేతుల్లో చావు దెబ్బలు తిన్న రాజేష్ గుర్తు వచ్చాడు! కార్తి మనసు జాలితో ద్రవించింది!

"ప్చ్...పూర్ బోయ్..." అనుకుందామె!

"అంకుల్ ఈ విషయం మమ్మీకి... డాడీకి తెలిసిందా"? మెల్లగా అడిగింది కార్తి!

నవ్వాడు చైతన్య..." తెలిసింది.."!

"ఏమన్నారు"?

"ఈ ఉదయం ఫోన్లో మాట్లాడాడు ఆనంద్! ఈ విషయం వినగానే సుమిత్ర హార్ట్ ఎటాక్ వచ్చినంతగా భయపడి పోయిందట! వెంటనే ఢిల్లీకి ప్రయాణం కట్టబోతే...మనమే వచ్చేస్తున్నామని ఆనంద్ నచ్చచెప్పాడట! బేబీ...డాడీ కూడా బాగా ఖంగారు పడి పొయ్యాడు! అయినా...ముందు వెనుకలు ఆలోచించకుండా ఇలాంటి విషయాల్ని నెత్తిన రుద్దుకోకూడదు! ఈ వయసులోనే ఇంత సాహసం పనికిరాదేమో..అనిపిస్తోంది ఇప్పుడు నిన్ను చూస్తుంటే..." ఆలోచనగా అన్న చైతన్య మాటలకి కార్తి బుంగమూతి పెట్టి..

"మీరూ ఇలా మాట్లాడుతారనుకోలేదుఅంకుల్...అతి మామూలు మనిషిలా! ఇంకా నన్ను ఎంకరేజ్ చేస్తారనుకున్నాను! నన్ను మెచ్చుకుంటా రనుకున్నాను..." అంది!

"యూ ఆర్ కరెక్ట్ బేబీ! నిజంగా నిన్ను నేనెంతో ఎంకరేజ్ చేస్తాను! నిన్ను నేను ప్రత్యేకంగా మెచ్చుకోనక్కరలేదనే అనుకుంటున్నాను! నీ సాహసం... తెలివితేటలు...నువ్వు సాధించిన ఈ ఘనకార్యం...దేశానికి నీ వలన కలిగిన ఈ మేలు...నావలనయినంత ఆనందంగా వుంది నాకు! తమ గొప్పదనాన్ని తామే మెచ్చుకుంటారా ఎవరైనా..."అన్నాడు చైతన్య!

"థాంక్యూ అంకుల్..."కృతజ్ఞతగా ఆనందంగా అంది కార్తి!

"సో...ఒక విషయాన్ని గుర్తుంచుకోవాలి నువ్వు! నీకు ఇంకా వయసు రావాలి! నీ మేధ పదునెక్కాలి! నీ ఆలోచనల్లో

**జరిగిన కథ-25 :** రాణికి సహాయం చేద్దామని కంకణం కట్టుకున్న కార్తికి అడుగడుగునా శత్రువుల ముఠాలు ఆటంకాలు కల్గిస్తుంటాయి. రోజ్ ద్వారా సమాచారం తెలుసుకొని కార్తిని వెతుకుతూ మద్రాసు చేరిన చైతన్య నిరాశకు గురవుతాడు. బావ అర్జున్ కళ్లు గప్పి తప్పించుకు పోయిన కార్తి వేరే హోటల్‌లో దిగుతుంది. శత్రువుల ముఠా ఒకటి కార్తిని కిడ్నాప్ చేసి అక్కడ్నించి ఢిల్లీకి తీసుకువెళ్తుంది. ఆ ముఠా నాయకుడు తనను చంపాలని పథకం వేస్తున్న విషయాన్ని పసిగట్టి ఆ భవనాన్ని డైనమేట్‌తో పేల్చేసి తప్పించుకున్న కార్తిని చైతన్య రక్షిస్తాడు. అంతకుముందు కార్తిని వెంబడించిన ముఠాలు ఎలా సర్వనాశనమైందీ వివరిస్తాడు చైతన్య.

నడవడికలో తొందరపాటు అన్నది తగ్గిపోయి స్థిరత్వం అన్నది చోటుచేసుకోవాలి! అంతవరకూ...ఇలాంటి క్లిష్ట తరమైన బాధ్యతల్ని నువ్వు నెత్తిన వేసుకోకూడదు! ఇలాంటి పరిస్థితి మళ్ళీ నీకు ఎదురైతే నాకు తెలియజేసి నా సలహా తీసుకోవాలి నువ్వు..."హెచ్చరిస్తున్నట్లన్నాడు చైతన్య!

"ష్యూర్ అంకుల్..." అంది మనస్ఫూర్తిగా కార్తి!

"అంతేకాదు...అమ్మా నాన్నల మనసులకి కష్టం కలగకుండా...వారిని నొప్పించకుండా మసలుకొనే బాధ్యత నీమీద వున్నదని కూడా మర్చిపోవద్దు..."

బుద్ధిగా తలూపింది కార్తి!

"హల్లో...ది మోస్ట్ బ్రిలియంట్ గర్ల్ ఆఫ్ ఇండియా మిస్ కార్తీ..."!!!

ఈ అల్లరి పలకరింపుకి చివ్వున తలతిప్పి చూసింది కార్తి!

ఎదురుగా అందాల చందమామ అర్జున్...అందంగా అల్లరిగా ...నవ్వుతూ...!

కార్తి అందాలకనులు మిలమిల మెరిశాయి! వెంటనే అతడి కళ్లల్లోని అల్లరికి మూతి ముడుచుకుంది కార్తి!

"ఓహ్! దిగ్రేట్ సూపర్ గర్ల్ ఆఫ్ ఇండియాగారికి కోపంవచ్చిందా! సారీ...సో సారీ..." అర్జున్ కంఠంలో అల్లరి వెనుక ఉప్పొంగుతున్న అభిమానం!

కార్తి గుండెలు చిత్రంగా స్పందించాయి! పైకి మాత్రం..."తమరేం వెక్కిరించనక్కర్లేదులే..." పెదవులు బిగించింది కార్తి!

"మీరు చెప్పండి చైతన్యా? నాది వెక్కిరింతా? స్వయంగా ఈ బిరుదుల్ని తమరికి దిగ్రేట్ ప్రెసిడెంట్ ఆఫ్ ఇండియా అండ్ ప్రైమ్ మినిస్టర్ ఆఫ్ ఇండియా అందజేశారు తెలుసా డియర్"?

"అర్జున్ మాటలు నిజం బేబీ" అన్నాడు చైతన్య!

"రియల్లీ"? నమ్మలేనట్టు చూస్తూ అంది కార్తి!

"అవును బేబీ! రాష్ట్రపతిగారు నీ సాహసాన్ని ... నీ వలన మన దేశానికి కలిగిన మేలు పదే పదే కొనియాడితే...నిన్ను సూపర్ గర్ల్‌గా అభివర్ణించారు మన ప్రైమ్ మినిస్టర్! నీకు తెలుసా...రహస్యంగా వచ్చి ప్రైమ్ మినిస్టర్...హోం మినిస్టర్ నిన్ను చూసి వెళ్ళారు కూడా..." గర్వంగా చెప్పాడు చైతన్య!

నమ్మలేనట్టు చూస్తున్న కార్తి కళ్ళు తళుక్కున మెరిసాయి! ఆమె గుండెలు ఆనందంతో ఉప్పొంగాయి!

చైతన్య అన్నాడు..."అంతేగాదు...ఈ వార్తని నీ ఘనతని ప్రపంచమంతా ఎలుగెత్తి



# సూపర్ గర్ల్

చాటాలని తమకి ఎంతగా అనిపిస్తున్నా...ఇది దేశ భద్రతకే కాక పరువు ప్రతిష్టలకి సంబంధించిన విషయం కూడా కాబట్టి గోప్యంగా వుంచబడింది అన్నారు..."!

అప్పుడు అన్నాడు అర్జున్ ..."కార్తీ...నీకు మీ చైతన్య అంకుల్ ప్రొఫెషన్ ఏమిటో తెలుసా"?

తెలీదన్నట్టు తలూపింది కార్తి... "ఎన్నో సార్లు అడిగాను! అంకుల్ చెప్పనే లేదు! ఆ టాపిక్ వచ్చినప్పుడు వెంటనే మాట మార్చేసేవారు అవునూ...నీకు తెలుసా"? అడిగింది!

"ఆయన ఐడెంటిటీ...ఈ మార్నింగ్ ప్రైమినిస్టర్ గారు నిన్ను చూడడానికి వచ్చినప్పుడు తెలిసింది నాకు...భారత ప్రభుత్వ గూఢచారి శాఖలో ఓ ముఖ్య మైన...కీలకమైన పదవి నిర్వహిస్తున్నారని..."

"ఏమిటి? నువ్వు చెబుతున్నది నిజమా అర్జున్? నమ్మలేనట్టుగా చైతన్యవైపు చూసింది కార్తి!

చిరునవ్వు నవ్వాడు చైతన్య!

"అవును! అధికారులను లోబరుచుకుని రాణి సేకరించిన రహస్య పత్రాలు హఠాత్తుగా మాయమైన విషయం గుర్తించి కలవరపడి...వెంటనే చైతన్యని ఢిల్లీ రప్పించి...అవి ఎలా మాయమై ఎక్కడికి చేరాయి...అన్న రహస్యాన్ని పరిశోధించే బాధ్యత తనకి అప్పగించింది గవర్నమెంటు! అందుకోసంగా ఇక్కడికి వచ్చిన చైతన్యకి... నువ్వు కంటబడటం యాధృచ్ఛికంగా జరిగింది! తన డ్యూటీని నువ్వు అందిపుచ్చుకువి...తనకి శ్రమని తప్పించావు! అందుకే సూపర్ గర్ల్‌వి అయ్యావు! ఫ్యూచర్‌లో నిన్నూ తనలాగే ఓ శక్తిలా తయారుచెయ్యాలన్న ఆలోచన రూపు దిద్దుకుంటోంది అతని మనసులో..." అంటూ ఆగాడు అర్జున్.

కార్తి నమ్మలేనట్టే చూస్తోంది! తమ మధ్య మామూలు మనిషిలా వుంటున్న అంకుల్ ప్రభుత్వ గూఢాచారా? ఈ నిజం నమ్మశక్యంగానట్టుగా అనిపిస్తోంది కార్తికి?

అంతలోనే అనుకుంది కార్తి..."తనకి అనిపించేది...అంకుల్ చాలా ప్రత్యేకమయిన వ్యక్తి అని, తమ దృష్టికి స్పష్టంగా అందని గొప్పతనం ఏదో ఆయనలో వుంది అని. తన వూహ నిజం అయిందన్నమాట"!

చైతన్య వైపు చూస్తున్న కళ్ళల్లో కొండంత గౌరవం వెల్లి విరిసింది !

× × × ×

ఆ సాయంత్రం ... చైతన్యతో వెళ్ళి రాష్ట్రపతి గార్ని ప్రధానమంత్రిని కలుసుకుంది కార్తి!

ఇద్దరూ ఆమె సాహసాన్ని ... దేశానికి ఆమె వలన తప్పిపోయిన ముప్పును గురించి ప్రస్తావిస్తూ...కార్తినిఎంతగానోఅభినందిస్తూ... దేశమూ...ప్రభుత్వమూ..ప్రజలూ ఎంతగానో ఋణపడ్డారని అన్నారు!

వినోద విజ్ఞాన యాత్రలకోసం గవర్నమెంటు కార్తిని ఫారిన్ పంపడానికి నిశ్చయించుకున్నదన్న విషయం ఆమెకి చెప్పారు...ప్రభుత్వ ప్రధాన కార్యదర్శి!

వారికి కృతజ్ఞతలు తెలుపుకుని ఆనందంగా తన తల్లి దండ్రుల దగ్గరికి బయలుదేరింది కార్తి!

× × × ×

హైదరాబాదు....

ఎయిర్ పోర్టులో చైతన్య అర్జున్‌లతో ఫ్లయిట్ దిగిన కార్తికి ఘనస్వాగతం చెప్పారు ఆమె తల్లిదండ్రులు..బిందు..రోజ్..రాజేష్!

కూతుర్ని గాఢంగా కౌగిలించుకుని కళ్ళనీళ్ళు పెట్టుకుంది సుమిత్ర..."ఎంత సాహసం చేశావే తల్లీ! నీకేదయినా అయితే మేం ఏమయిపోవాలనుకున్నావే"? అంటున్న తల్లి కౌగిలిలోని వెచ్చదనాన్ని ఎన్నో ఏళ్ళ తరువాత తిరిగి పొందుతున్న దానిలా ఓ నిమిషం పాటు అలాగే వుండిపోయింది కార్తి!

"ఇంకెప్పుడూ ఇలాంటి సాహసం పనులు చెయ్యనని నాకు మాట ఇవ్వు..." అంటున్న భార్యని ప్రేమగా విసుక్కున్నాడు ఆనంద్...

"దాన్ని కాస్త తేరుకోనిస్తావా లేదా"? అని!

"ఓహ్..డాడీ..." అంటూ దగ్గరికి వచ్చిన కూతురి నుదుటి మీద ప్రేమగా ముద్దుపెట్టుకుంటూ...."కార్తి నా బిడ్డ! అని చెప్పుకోడానికి గర్వపడుతున్నానురా బేబీ..." ఆనందంతో కళ్ళు చెమర్చగా అంటున్న తండ్రి కళ్ళల్లోకి ప్రేమగా చూస్తూ అతడి మెడచుట్టూ చేతులు వేసి పసిపాపలా వ్రేలాడింది కార్తి!

నిజంగా ఆనంద్‌కి చెప్పలేనంత గర్వంగా వుంది! అతని మనసు అంతరాంతరాల్లో ఏ మూలనైనా తనకి మగసంతానం లేదన్న చింతవుండివుంటే ఈ రోజుతో అది పూర్తిగా మాసిపోయింది!

సుమిత్ర మాత్రం అప్పుడు కూడా అనుకుంది..."కార్తి నిజంగా మగపిల్లాడై వుంటే ఎంత బాగుణ్ణు..." అని!

తరువాత కార్తి రాజేష్ దగ్గరికి నడచి స్నేహపూరితంగా అతడి చెయ్యి పట్టుకుంటూ..."హల్లో రాజేష్! హౌ ఆర్ యూ..."? అంది!

ఉప్పొంగిపోయింది ఆ పలకరింపుకి రాజేష్ హృదయం! "కార్తీ ఈ రోజునుండి మనం మంచి స్నేహితులం" అన్నాడు రాజేష్! మనస్ఫూర్తిగా తలూపింది కార్తి..అవునన్నట్టు!

"హాయ్ రోజ్ సిస్టర్..." రోజ్ చేతిని ఆప్యాయంగా పట్టుకుని ఆమె తో మాట్లాడుతున్న కార్తి హఠాత్తుగా గమనించింది ఆమె ప్రక్కనున్న ఆజానుబాహువు... స్ఫురద్రూపి అయిన యువకుడ్ని!



"వీరు..." అంటూ సందేహంగా ఏదో అనబోతున్న కార్తికి తనను తాను పరిచయం చేసుకున్నాడు అతను...

"నా పేరు రమేష్ చంద్రబేదీ! చైతన్య ఫ్రెండుని..."

చప్పున గుర్తు వచ్చింది కార్తికి..."ఓ యస్.పి.అంకుల్ కదూ"?

అవునన్నట్టు తలూపాడు చిరు నవ్వుతో!

"విజయవాడలో వుండాల్సిన మీరు... ఇక్కడ..." అంటూ అతని వైపు రోజ్ వైపు మార్చి మార్చి చూస్తున్న కార్తితో... వెనక నుండి అన్నాడు చైతన్య...

"మీ లేడీ డ్రైవర్ గారు మావాడి మనసుని దొంగిలించుకొచ్చారట బేబీ! దానికి పనిష్మెంట్‌గా ఆమెని పర్మినెంటుగా తన జీవితం అనే జైల్లో బంధించడం కోసం...ప్రేమ అనే అరెస్ట్ వారెంట్‌తో పరుగెత్తుకువచ్చారు పాపం మా పోలీసు సూపర్నెంట్‌గారు...!

ఈ మాటలకి అందరూ నవ్వగా... రమేష్ చంద్ర కొంటె చూపులు విసరగా రోజ్ సిగ్గుపడి తలదించుకుంది!

పట్టరాని సంతోషంతో అంది కార్తి..."కంగ్రాచ్యులేషన్స్ అక్కా..." అని!

కార్తి అప్పుడు గమనించింది... చూపులతోనే వూసులాడుకుంటున్న చైతన్యా బిందుల్ని! వెంటనే విషయం పసిగట్టేసిందామె!

"అంకుల్...ఇన్ని శుభవార్తల్ని వినిపించిన నువ్వు...ఈ విషయం నాకు ఎందుకు చెప్పలేదు..."అతన్ని నిలదీసింది ఆమె!

"ఏ విషయం బేబీ..." ఓరగా బిందు వైపు చూస్తూ అడిగాడు చైతన్య!

"తమరీ మధ్య...ఆడవాళ్ళు...వారి అంతర్యాలు అన్న సబ్జెక్ట్ మీద రీసెర్చి ప్రారంభించి...ఆ ప్రయత్నంలో చిత్తుగా ఓడిపొయ్యి...ఓ అమ్మాయికి దాసానుదాసులై పోయారన్న ఆ సత్యం నాకు చెప్పడానికి మీకు నామోషీగా వుందా ఏమిటి"?

అంటున్న కార్తి మాటలకి గట్టిగా చప్పట్లు కొట్టాడు రమేష్ చంద్ర...ఇప్పుడు తమ వంతు వచ్చిందన్నట్టు! అందరూ నవ్వారు!

చైతన్య తన తప్పు ఒప్పుకుంటున్నట్టుగా తమాషాగా తలవంచి అభివాదం చేస్తే...బిందు అల్లరిగా నవ్వింది!

ఆ పూట ఆనంద్ తన ఇంట్లో అందరికీ విందు ఇచ్చాడు!



# తోలుబూట్లు తొడిగేవారికి సూచనలు

టిప్‌టాప్‌గా బూట్లు తొడుక్కొని వెళ్ళేవారు ఈ క్రింది సూచనలను జాగ్రత్తగా పాటిస్తే మంచిదట. అవి-

* బూట్లను శుభ్రంగాను, పొడిగాను వుంచాలి.
* బూట్లను తొడుక్కునే ముందు పైభాగాన్ని శుభ్రంగా తుడవాలి.
* బూట్లు తడిసిపోతే పేపరుతో శుభ్రంగా తుడిచి గదిలో అరబెట్టాలి.
* నీళ్ళలో తడిసి తెల్లగా అయినట్లయితే వెచ్చటి కుంకుడు రసంలో తడిపిన గుడ్డతో ఆ ప్రాంతాల్లో తుడవాలి.
* లోపల లైనింగ్ పోయినట్లయితే వాటి స్థానంలో క్రొత్తవి మార్చుకోవటం మంచిది.

ఈ సూచనలు పాటించినట్లయితే బూట్లు ఎక్కువకాలంమన్నేందుకు వీలుంటుందట. మరి పాటించి చూద్దామా!

తరువాత అందరూ కార్తిని మరోసారి అభినందించి వెళ్ళిపొయ్యాక...

తన రూమ్‌లో కూర్చుని చైతన్యతో కబుర్లు చెబుతోంది కార్తి...! మెల్లగా ఆ గదిలోకి ప్రవేశించాడు అర్జున్!

అతడ్ని చూసి హఠాత్తుగా గుర్తు వచ్చినట్టు... "అన్నట్టు ఈ విషయం తెలుసా బేబీ నీకు"అని కార్తితో అన్న చైతన్య...అర్జున్ వైపు తిరిగి....

"ఇన్ని కబుర్లు చెబుతున్నావే గాని నీకు సంబంధించిన గుడ్ న్యూస్ చెప్పవేమిటి? ఆ వార్తవింటే నీకంటే ఎక్కువగా సంతోషించేది బేబీ అన్న విషయం మర్చిపొయ్యావా"? అన్న చైతన్య...

అర్జున్ వైపు ఏమా గుడ్ న్యూస్? అన్నట్టు చూస్తున్న కార్తితో తనే చెప్పాడు...

"బేబీ! వచ్చే నెలలో ఆస్ట్రేలియాలో జరగబోతున్న ఇంటర్ నేషనల్ క్రికెట్ మాచ్ కోసం వెళ్ళబోయే భారత జట్టుకోసం అర్జున్ సెలక్టయ్యాడు! తెలుసా"? అన్నాడు చైతన్య!

తలతిప్పి అర్జున్ వైపు మెరిసే కన్నులతో చూసింది కార్తి.. "నిజమా"? అన్నట్టు!

అవునన్నట్టు కళ్ళతో సంజ్ఞచేశాడు అర్జున్!

చైతన్య మెల్లగా లేచి వెళ్ళిపొయ్యాడు అక్కడినుండి..ఏదో పని వున్నట్టుగా!

"కంగ్రాచ్యులేషన్స్"అంది కార్తి అర్జున్‌తో!

"ప్చ్...ఒట్టి కంగ్రాచ్యులేషన్సేనా"? నిరాశగా అంటూ అలిగినట్టు మొహం పెట్టాడు అర్జున్!

"మరి"? పెదవులు బిగించింది కార్తి!

సమాధానం చెప్పలేదు అర్జున్! గులాబీ మొగ్గల్లాంటి ఆమె పెదవులమీద వాలిందతని దృష్టి!

చప్పున చెయ్యిచాపి ఫ్లవర్ వాజ్‌లో వున్న ఓ గులాబీని అందుకుంది కార్తి! తరువాత అర్జున్ వైపు చూస్తూ అంది....

"ఆస్ట్రేలియా వెళ్ళి...నీ ప్రతాపం అక్కడ చూపించి... సెంచరీలు చేసి... దిగ్రేట్ వండర్ బోయ్ ఆఫ్ ఇండియా మిస్టర్ అర్జున్..... అని ప్రపంచం మొత్తం చేత ప్రశంసింపబడి.. కీర్తింపబడి...విజేతవై... యువ రాజులా తిరిగిరా...అప్పుడు..."అంటున్న కార్తి విశాలనయనాలలో మునుసిగ్గులు దోబూచులాడగా...కనురెప్పలు వాలిపోగా.. ఆమె చేతులు గులాబీని పెదవుల దగ్గరికి చేర్చుకున్నాయి!

ఆమె పెదవుల మెత్తదనం... తియ్యదనం తనకెంతో హాయిని ఆనందాన్ని పులకరింతనీ కలిగించిందన్నట్టుగా ఆ గులాబీ రెక్కలు అల్లల్లాడాయి!

ఆ దృశ్యాన్ని చూసి..."ఓహ్...." అంటూ కళ్ళు మూసుకున్నాడు అర్జున్!

అతని మీదకి విసిరింది కార్తి ఆ ఎర్ర గులాబీని!

సరిగ్గా .... గురిగా వచ్చి తన ఛాతీకి మెత్తగా తగిలి క్రిందకి జారబోతున్న ఆ గులాబీని తియ్యని బాధతో.."అబ్బా" అంటూనే ఒడుపుగా రెండు చేతుల్లోకి తీసుకుని...

"థాంక్యూ డియర్..." మెరుస్తున్న కళ్ళతో అంటూ తన్మయత్వంగా తన పెదవులకి హత్తుకున్నాడు అర్జున్ మృదువుగా!

అరమోడ్పు కనులతో... ఎర్రబడిన బుగ్గలతో చూసింది అతడి వైపు...అందాల చందమామ అర్జున్ వైపు సూపర్ గర్ల్ కార్తి!

(అయిపోయింది)




**మేషం:** 'శుక్రశనివారాలు' లాభదాయకములు. గురు, శుక్ర కుజ గ్రహాలు వారాంతం వరకు మేలు చేయగలరు. ఉద్యోగ యత్నం అనుకూలించుట నిశ్చయం. బిడ్డలకు సహాయం చేసి, వృద్ధికి తెచ్చుయత్నములందు నిమగ్నులవుతారు. స్త్రీలకు: వృత్తి వికాసం, స్వల్పాదాయం.

**వృషభం :** ధన విషయంగా యిబ్బందిలేదు. వ్యాపార సంబంధంగా మేలున్నది. విద్యా వేత్తల సహాయమున్నది. ఉద్యోగాభివృద్ధికి, మీరు గావించిన యత్నాలు సానుకూలం కావటం గ్రహింపదగిన అంశాలు. వ్యాపార సంబంధంగా ప్రయాణిస్తారా? మేలే, గ్రహించండి, స్త్రీలకు : మిత్ర సమాగమం, ధనవసతి, సభాగౌరవం, గ్రహించాలి.

**మిధునం:** సహవాసమైన మనకన్నా మేలైనవారితోనే మేలు. మహదాశ్రయమే మేలని గ్రహిస్తారు. సభారంగాన ప్రసిద్ధి ఏర్పడనున్నది. ఉద్యోగించేవారికి పై అధికారుల మన్నన, పంపిణీదారులకు సదవకాశాలు ఏర్పడగలవు. స్త్రీలకు: విద్యావేత్తల సహాయం. వృత్తి వికాసం, వ్యాపారం చేసేలాగైతే మేలే.

**కర్కాటకం:** ఏ వ్యవహారం ఎలాగున్నా ధన లోపం ఏమాత్రం లేదు. వృత్తి యందు పెంపు చెప్పదగిన సమయం. షష్ఠమ రాశీయందున్న 'శని' సర్వ విధాలా అనుకూలుడు. శుభ కార్యానుకూలత, వివాహ వ్యవహారాలను గూర్చిఅనుకూల చర్చలు. ఇంట శుభం జరుగుట చెప్పదగిన ముఖ్యాంశం. స్త్రీలకు: మనకెందుకు 'రాజకీయా'లన్న విసుగు జనిస్తుంది. వృత్తియందు మార్పు.

**సింహం :** ఆదాయమున్నది. వ్యాపారానుకూలతయున్నది. జాయింటు వ్యాపారం, మరీ ఆనందదాయకంగా ఉంటుంది. సభారంగాన ప్రసిద్ధియున్నది. ప్రయాణం ఉన్నది. మానివేయటం శ్రేయస్కరం. ఏనాడు ఎలాంటి ఆపద వెన్నాడుతుందో, చెప్పవీలులేదు. ప్రజారంగాన ప్రసిద్ధి ఏర్పడనున్నది. స్త్రీలకు: సర్వవిధాలా మేలే.

**కన్య:** అధికారులవలన మీ వృత్తియందుగాని, ఉద్యోగమందుగాని, అనుకూల మార్పులు రానున్నవి. ఇష్ట బంధువుల వివాహ నిమిత్తమై తర్జనభర్జనలుంటాయి. అధికారమందు స్వల్పంగా పెంపు చేకూరుట గమనింపదగిన అంశం. స్త్రీలకు: అధికార వృద్ధి, స్వల్పాదాయం. చలనచిత్ర రంగానుకూలత కొందరకు.

**తుల:** ఉత్తముల స్నేహం లభ్యం. 'శని, రాహువు'ల బలంచేకూరుతుంది. ప్రభుత్వ పరంగా రావలసిన డబ్బు సమయానికి అందటం, అవసరాలు తీరటం గమనింపదగిన అంశం. వృత్తి రీత్యా మేలున్నది. కుటుంబానందమున్నది. స్త్రీలకు: రాజకీయంగా మేలు, వృత్తియందు పెంపు.

**వృశ్చికం:** ఆదాయ లోపం లేదు. అయితేనేం? మిత్రులెవరో కాని వారెవరో, తెలిసికొనలేక తికమక పడుతారు.. దూర ప్రాంతానికి, వ్యవహార నిమిత్తమో, వ్యాపార నిమిత్తమో, వెళ్లవలసిన అగత్యం ఏర్పడుతుంది. ప్రజ్ఞావంతుల పరిచయం, బంధుమిత్ర సమాగమం. స్త్రీలకు: ద్వితీయ రాశిస్థిత వక్ర శని కొంత మేలు చేయగలడు.

**ధనుస్సు:** అభిమానించేవారున్నారు. బంధుమిత్రులు యింటికి రానున్నారు. కళా సాహితీ రంగాన మీకు ప్రసిద్ధి ఏర్పడనున్నది. చలనచిత్ర రంగావకాశాలు కొందరకు అనుకూలమని గ్రహించాలి. స్త్రీలకు : అభిమానుల సహాయం, అధికారుల వలన మేలు, బంధువర్గీయుల రాక, సభా గౌరవం చెప్పదగిన అంశాలు, గ్రహించండి.

**మకరం :** మీరేమనుకొన్నా అన్ని వ్యవహారాలు సాంగంగా, సక్రమంగా జరుగుతాయని అనుకొనవీలులేదు. 'శని' ఉద్రిక్తత కొంత తగ్గినా, యింకా లేకుండా పోలేదు. సుఖశాంతులకు, ఆనందానికి, రాజకీయావకాశాలకు లోపం ఏర్పడవచ్చు. స్త్రీలకు: సభా గౌరవం, వృత్తియందు పెంపు. ప్రజారంగాన ప్రసిద్ధి, వాహన సేకరణకు అవకాశం.

**కుంభం:** నూతన మిత్ర సమాగమం. 'శని' గురుల ప్రభావం. రాజకీయంగా, సాంఘికంగా, ప్రజారంగాన మేలున్నది. ఆదాయ లోపం లేదు. బంధుమిత్ర సమాగమం. వృత్తియందు పెంపు. సభా గౌరవం, దాయాదివర్గంతో తగాదాలు, యిలాంటి విషయాలెన్నో. స్త్రీలకు: ధనలబ్ధి, వృత్తి పెంపు.

**మీనం:** దూర ప్రాంతాల నుండి బాగా మీకు పరిచితులు, వానవంగుడులతో బాధపడి మీ సమీపానికి రానున్నారు. చాలకాలంగా కనిపించని వారు యింటికి రానున్నారు. ప్రజారంగాన ప్రసిద్ధి, ఉపకారులను పేరు తెచ్చికొనుటకు ఆస్కారం. స్త్రీలకు : రాజకీయాలందు అనుకూలం, ఆదాయవృద్ధి, యత్నకార్యసిద్ధి, గ్రహించండి.

-విద్వాన్ కోట సత్యరంగయ్యశాస్త్రి





'ఉత్తరాలు' శీర్షికకి రాసేవారు

తమపేరు, పూర్తి చిరునామా తెలుగు లిపిలో రాయాలని మనవి చేస్తున్నాము.

—సంపాదకుడు.

# ప్రాణ వదిలిన మంచితనం

వాసిపల్లె వెంకట సుబ్బారెడ్డి

"రంగయ్యా! నా మాట విను! పెద్ద వాళ్లతో గూడిన పని! ఆయన చూస్తే నా- గ్రామంలో కెల్లా పెద్ద రైతు! పైగా- సర్పంచ్! ఇది నీకు మాత్రమే సాధ్యమయ్యే పని! కాబట్టే- నన్ను నీ వద్దకు పంపాడు! బాగా ఆలోచించుకో! గతించిన విషయాలను మనసులో ఉంచుకోని, ఇంకా పంతాలకు, పట్టింపులకు పోవడం ఏమంత మంచి పని అనిపించుకోదు! అందుకే ఈ సహాయాన్ని నీ వాయనకు తప్పకుండా చెయ్యి! పైగా ఆయన నీ రుణం ఉంచుకోడు గూడాను!" వేపపుల్లతో పళ్లు తోముకుంటూ- "పంతు- లు"అని పిలువబడే ఆ వ్యక్తి వృద్ధుడైన రైతు కూలి రంగయ్య గుడిసె ముందు నిలువ- బడి అతనికి నచ్చచెప్పడానికి శత విధాలా ప్రయత్నిస్తున్నాడు.

"అయ్యా! మీరు సదువుకున్నోరు! అన్నీ తెలిసినోరు! కాని, నా కడుపులో మండే మంట మీకేం తెలుస్తదయ్యా! మేమెంత కూటికి లేనోల్లమైనా- కూలీ నాలీ చేసుకుని పొట్ట బోసుకునే వాల్లమైనా- మాకూ మానం, మర్యాద ఉంటాయయ్యా! అందుకే నేను మాత్రం నా పేవం పోయినా ఫరవాలేదుగాని ఆల్ల యింటి దరిదాపులకు గూడా రాను! రాలేను. చమించండయ్యా!" అన్నాడు రంగయ్య వణికే కంఠంతో. పంతులుతోటి సర్పంచ్ గారింటికి వెళ్లడానికి అతడు ససేమిరా అంగీకరించడంలేదు!

ఎండు పుల్లల్లాంటి కాళ్లు, చేతులు కలిగి- ఉన్న బక్క ప్రాణి ఆత్మాభిమానానికి పంతులు ముక్కుమీద వేలేసుకున్నాడు. అయినప్పటికీ తన ప్రయత్నాన్ని విరమించలేదు.

"నిజమే రంగయ్యా! నీ మాటను నేను కాదనడం లేదు! జరిగిపొయ్యిందేదో జరిగి పొయ్యింది! దాన్ని పట్టుకుని నీవింకా మొండిగా వ్యవహరించడం ఏమీ బాగా లేదు రంగయ్యా! మనమా- ఈ వూరిని నమ్ము- కుని జీవించేవాళ్లం! పెద్దా, చిన్నా అందరికీ



అనుకూలంగా నడుచుకుంటేనే గాని మనకు గడవదు!" అని పంతులు అనగానే రంగయ్య చివాలున తలెత్తి-

"ఆ మాటనగాకు సామీ! ఈ ఊరు గాకపోతే ఇంకో ఊర్లవుద్ది! కట్టం చేసుకొని బతికేవోల్లకు ఏ ఊరైతేనేం! నేను మాత్రం నా గొంతులో పేనముండగా ఆల్లింటికాడ అడుగు పెట్టను!" రంగయ్య తలను అడ్డంగా ఊపేడు. ఇక లాభం లేదనుకుని పంతులు చివరిసారిగా-

"ఆఖరుమాటగా చెబుతున్నా రంగయ్యా! నీవు గొప్ప నిజాయితీగల్లవాడివని ఊరందరికీ తెలుసు! ఇప్పుడు నీ మంచితనాన్ని మరోసారి రుజువు చేసుకోడానికి ఇది నీకు మంచి అవకాశం. అపకారం చేసిన వాడికి ఉపకారం చెయ్యమని మన పెద్దవాళ్లు చెప్పారుకదా! అంచేత ఆ సద్భావంతోనైనా నీవు ఆ ఉపకారాన్ని వాళ్లకు చెయ్యి! ఈ విషయమై అమ్మగారు కూడా నీతో మరీ మరీ చెప్పమన్నారు!" ఎంతో అనునయంగా నచ్చచెప్ప సాగేడు పంతులు.

"అంతపెద్ద మనసు నాకు లేదయ్యా! నేను అలుపుడిని! దయచేసి నన్నిక వదిలి పెట్టండి! ఇప్పుడికే యెండబడిపోయింది! పొలంలోకి ఎల్లాల గద సామీ!" అంటూ మెల్లిగా గుడిసెలోకి జారుకుని-

"సిన్నీ! సద్ది కలుపు తొందరగా!" అన్నాడు రంగయ్య, ఇరవై సంవత్సరాల ప్రాయం గల తన ఏకైక పుత్రిక చిన్నితో.

ఇది లొంగే ఘటం కాదని నిర్ణయించుకున్న పంతులు తిరుగుముఖం పట్టాడు.

చిన్ని చద్దిని కలిపి రంగయ్య దోసిట్లో పోయసాగింది. అతడి మెదడు పొరల్లో ఆనాటి దుర్ఘటన తళుక్కున మెరిసి మాయమైంది. గుండె కలుక్కుమనగా "థూ" అని నోటిలోని చద్దిని ఉమ్మేసి, చేతులు కడుక్కుని లేచాడు.

చిన్ని తండ్రి చర్యకు విస్తుపోయి,

"ఏం అయ్యా! సద్దిలో ఉప్పేమైనా ఎక్కువ పడిందా?" అని అడిగింది అమాయకంగా.

"ఏంలేదులే! నేను పోతుండా గాని- మద్దేనేలకు మెరక చేనికాడికి కూడెత్తకరా!" అంటూ రంగయ్య చరచరా వెళ్లిపొయ్యాడు చిరిగిన పాత తుండుమ భుజాన వేసుకుని. చిన్ని తన తండ్రి వెళ్లిన వైపే చూస్తూ నిలుచుండిపోయింది చాలీ చాలని పమిటను సవరించుకుంటూ.

చిన్నికి పుట్టుకతోటే ఒక కాలు అవిటి. మూడేళ్ల ప్రాయంలోనే తల్లిని పోగొట్టుకున్న అభాగ్యురాలు. తనను ప్రాణంతో సమానంగా పెంచి పెద్ద జేసిన తండ్రికి వేళ కింత ఉడకేసి పెట్టి రుణం తీర్చుకుంటున్న ఉత్తమురాలు!

★ ★ ★

అప్పటికి సుమారు మూడు సంవత్సరాల క్రితం-

రంగయ్య కూలి పనికి వెళ్లి రాత్రి ప్రొద్దుపోయి ఇంటికి వస్తున్నాడు. గుడిసె ముందు కుక్క ఒకటి వెల్లికిలా పడుకుని గుండెలు పగిలేలా రోదిస్తున్నది! రంగయ్య దాన్ని "శేయ్!" అని అదిలించి నెమ్మదిగా గుడిసెలోకి అడుగు పెట్టాడు కలవరపడుతూ.

గుడిసె లోపల తన కూతురు చిన్ని నేలమీద కూర్చుని, మోకాళ్లలో తలను దూర్చి, ఎక్కిళ్లు పెడుతూ రోదిస్తున్నది! రంగయ్య లోపల అడుగు పెట్టగానే ఆయన కాళ్లను చుట్టుకుని హృదయవిదారకంగా విలపించసాగింది! కుక్కలు చింపిన విస్తరిలా ఉన్న కూతుర్ని చూడగానే రంగయ్య గుండెలు బ్రద్దలై పోయాయి! అచేతనుడై పోయాడు! కొంచెం సేపటికి తేరుకుని , నెమ్మదిగా ఆమెను లేపి, నులక మంచం మీద కూర్చోబెట్టి , తాను ప్రక్కన కూర్చుని, వీపు నిమురుతూ బుజ్జగించి- "ఏం జరిగిందో సెప్పమ్మా! " నా బంగారు తల్లీ! నీ ఏడుపును నేను సూడలేనమ్మా!" అని బ్రతిమాలసాగేడు.

కొంచెంసేపటికి చిన్ని తమాయించుకుని జరిగిన ఘోరాన్ని నెమ్మది నెమ్మదిగా చెప్పసాగింది.

"పొద్దుకొండలో పడ్డాక సెన్నారాయుడు వచ్చిండు! గుడిసె ముందు నిల్చోనున్న నన్ను "చుట్ట కాల్చుకోను నిప్పివ్వ" మన్నడు! నిప్పు తేను గుడిసెలోకి వచ్చినా! సప్పుడు గాకుండా నా ఎనకనే లోపలికి వచ్చి, నన్ను గెట్టిగా వాటేసుకున్నడు! అరవబోతే నోటి మీద చెయ్యేసి అదిమిండు! " అరిత్తే సంపేత్తా! అంటూ నా గొంతు మీద సెయ్యేసిండు! ఊపిరాడక గిలగిలా తన్నుకున్నా వదిలిపెట్టలా! నేను భయంతో గడగడ వనకతా ఉంటే- నన్ను కిందపడేసి.... నన్ను... సెరిసిండయ్యా!"

చిన్ని ఏడుపు కట్టలు తెంచుకున్నది.

రంగయ్య గభాలున మంచం దిగి-

"ఆ సరపంచి బామ్మర్ది సెన్నారాయుడా? నా కొడుకు వాడింత పని జేసిండా! వాడికేం పొయ్యే గాల మొచ్చిందమ్మా! మనింట్లో దూరి నీకీ అన్నాయం సెయ్యడానికి వాడికేం అపకారం సేసినం మనం? మనమేనాడైనా వాడి సొమ్ము తిని ఎగేసినమా లేక వాడి మోసేతి కింది నీళ్లు తాగుతుండమా! మన కట్టం మనకు తప్పదే! అసలు వాడేం మనసులో బెట్టుకోని మనింట్లో దూరిండు? నలుగురిలో మన పరువేంగాను? ఎంత లేనోల్లమైనా మనకేమీ మానం మరియాదలు లేవా? నిన్ను సూత్తంటే నా కళ్లు తిరిగి పోతండయే తల్లా! తల్లి లేని పిల్లవు, గోవుతో సమానమైన దానివే నువ్వు! నిన్నీ అన్నాయం సెయ్యడానికి వాడికి మనసెట్టొచ్చిందమ్మా! వాడి చేతులిరిగిపోను! ఎప్పటికైనా ఒకయ్య సేతిలో పెట్టి నా ఋరువు దించుకుందామని నేను ఆశపడతా ఉంటే నిన్నీ గతి పట్టిచ్చినాడే వాడు! ఇక నీ బతుకేంగాను తల్లీ! నా గుండెలు పగిలి పోతుండయ్యే తల్లా!" అంటూ

## టిట్ ఫర్ టాట్-24

"పిల్ల నచ్చిందిగా ముహూర్తాలు చూద్దామా?"

మరి కొన్ని వాగ్బాణాలు

"మీ కందరికీ నచ్చంగానే సరిపోయిందా? నాకు పిల్లాడు నచ్చలేదు."

- ఎస్. శ్రీనివాసమూర్తి (నెల్లూరు)

"పిల్ల నచ్చితేసరా ఏమిటి? ఆమె చేసే ఉద్యోగం కూడా నచ్చాలి కదా!"

- ఎ. రాంబాబు (తుని)

"పిల్ల నచ్చగానే సంబరం కాదండి- పిల్లాడుకూడా నచ్చాలిగా?"

- ఎస్. నరసింగరావు (విశాఖపట్నం)

-డి. జ్వాలా నరసింహారావు (నూజివీడు)



నేలమీద కూలబడి రంగయ్య గుండెలవిసేలా విలపించసాగేడు!

కొంచెం సేపటికి సర్దుకుని, ఏడుపుని దిగమ్రింగి-

"నేను బోయి ఆ సరపంచితోనే మాట్లాడొస్తా! నెయ్యన్నం తిన్న ఆ పెద్దమనిషి మనకు నాయం ఎట్టా సెయ్యడో సూద్దం" అంటూ రంగయ్య గుడిసె వెలుపలికి వచ్చాడు. సర్పంచ్‌గారింటి వైపుకు భారంగా అడుగులు వేయసాగాడు.

రాత్రి తొమ్మిది గంటలు కావస్తున్నది. అప్పటికే పొలాల్లో పనులుచేసి అలసి వచ్చిన జనాలు కలో అంబలో త్రాగి నిద్రలోకి జారుకుంటున్నారు.

మసక వెన్నెల.,.. ఆ సమయంలో - సర్పంచ్ తన యింటి ఆవరణలో- ఆరుబయట కుర్చీలో కూర్చుని, తాపీగా చుట్ట త్రాగుతున్నాడు. ఐదారుమంది ఆయన ముఖ్య అనుచరులు నేలపై చతికిలబడి, తమకు తోచిన విధంగా - కల్లబొల్లి కూతలు కూస్తూ - ఆయనకు ఆనందాన్ని కలిగిస్తున్నారు.

రంగయ్య రాక వారి ఆనందానికి అంతరాయాన్ని కలిగించింది. రంగయ్య కన్నుల నుండి అశ్రువులు జలజల రాలుతుండగా- గద్గద స్వరంతో - తన బిడ్డకు జరిగిన అత్యాచారాన్ని విన్నవించుకున్నాడు.

"అయ్యా! మేం దిక్కులేని పచ్చులం! మాకు జరిగిన ఈ అన్యాయం సూడండయ్యా! మాకు నాయం సెయ్యండయ్యా! గొప్ప మనసున్న మారాజులు మీరు! బిడ్డలను గన్న తండ్రులు" అంటూ చేతులు జోడించి అర్థించాడు.

సర్పంచ్ చుట్టను గట్టిగా పీల్చి, పొగ వదిలి రంగయ్యను ఎగాదిగా చూచాడు. చిరాగ్గా ముఖం పెట్టి -

"అంతా అయిపోయె ఇప్పుడు నన్నేం జెయ్యమంటవూ?" అని ప్రశ్నించాడు.

"మాకు నాయం సెయ్యమంటుండా సామీ! "

తిరిగి అదే వేడికోలు.

"ఏమి నాయం చెప్పాలయ్యా! వాడేమో గడ్డి దినే నాయాలు! యాడున్న నానా గడ్డీ వాడికి జాలడంలేదు! ఇలా నేను రోజూ వాడి కేసులన్నీ విచారిస్తా ఉండాలంటే ఇక నాకు వేరే పనేం లేకుండా పొద్దస్తమానం అదే సరిపోద్ది! అందుకు నేనీ మద్దె వాడి సంగతి పట్టించుకోవటం అసలు మానేసినా! ఏం చేస్తాం రంగయ్యా! పోయిన మానం మళ్లా రాదు! ఎట్లాగో సర్దుకుపో! " అన్నాడు సర్పంచ్ తేలిగ్గా.

"అంతేలే రంగన్నా! అయ్యగారి మాటిని ఎల్లిపో!" సర్పంచ్ అనుచరులు వంత పాడారు.

వారి మాటలకు విచలిత మనస్కుడైన రంగయ్య -

"ఇదేనా సామీ మీ నాయం? అమాయకురాలు! కుంటిది! నోరూ వాయా లేని ఆ అవిటి బిడ్డను అలా అన్నాయం సేసి వచ్చినాడె మీ బామ్మర్ది! పిలవనంపి యిశారన జరిపించేది గూడా లేదా సామీ? ఎవురి బిడ్డయినా ఒకటే గదా అయ్యా! దరమ పెబువులు మీరని వచ్చినానయ్యా! " అన్నాడు వినయంగా.

అతని మాటలు జాలిగొల్పుతూ పాషాణ హృదయులను గూడా కరిగించేవిగా ఉన్నాయి! కాని, దయాదాక్షిణ్యాలు ఏ కోశానా లేని ఆ సర్పంచ్‌కు అంతా హేళనగా ఉంది! నెమలి కన్నీరు వేటగానికి ముద్దా!

"రంగయ్యా! ఈ సోదంతా ఎందుకు గాని - ఇక ఇంటికెళ్లి, దిట్టంగా తిని, ఆయిగా పండుకో పో! నేను రేపు వాడిని పిలవనంపి, గట్టిగా మందలిస్తాపో! మళ్లీ మీ గుడిసె దాపులకు రావద్దని గట్టిగా జెబుతాలే! ఇంకెల్లు! " అన్నాడు పక పక నవ్వుతూ. అక్కడున్న వారంతా సర్పంచ్ నవ్వుతో శృతి కలిపారు. జరిగిన అవమానాన్ని తట్టుకోలేని రంగయ్యలో దుఃఖం, రోషం, ఆవేశం ఒకదానినొకటి పెనవేసుకొని పెల్లుబుకుతున్నాయి! కాని తాను బలహీనుడు! నిరుపేద! నిస్సహాయుడు! అంగబలం, అర్ధబలం పుష్కలంగా ఉన్న ఆ మదాంధులను ఏమి చెయ్యగలడు! 'పేదవాని కోపం పెదవికి చేటు' అనే సామెత ఇంకా సజీవంగానే ఉన్నది కదా!

భుజాన ఉన్న తుండుగుడ్డను తీసి నోటికడ్డం పెట్టుకుని, కుమిలి పోతూ అక్కడి నుండి నిష్క్రమించాడు రంగయ్య.

"పిచ్చినాయాలు!" అంటూ చుట్టముక్కను నేలపై విసిరికొట్టాడు సర్పంచ్. అందరూ గలగలా నవ్వేరు.

ఎంత కూలీనాలీ చేసుకుని బ్రతికేవాడైనా రంగయ్య పౌరుషంగల వ్యక్తి! ఆత్మాభిమానం కలవాడు. ఆనాటినుండీ ఆ సర్పంచ్ ఆవరణలోకే కాదు, ఆ వీధివైపు కూడా వెళ్లడం మానుకున్నాడు! పాపం, ఆ అల్పజీవి అంతకంటె ఏమి చెయ్యగలడు?

* * * * * *

ఎంత పనికిరాని వస్తువని తృణీకరించినా దానితోనూ ఒకప్పుడు అవసరం వస్తుంది! అలాగే ఇప్పుడు ఖడ్గమృగంలాంటి ఆ సర్పంచుకు తూనీగలాంటి రంగయ్యతో అవసరం వచ్చిపడింది!

సంక్రాంతికని తల్లిగారింటికి వచ్చిన

# నలభీమపాకం



## కచూరి

ఒక కప్పు గోధుమపిండి, మూడు కప్పుల పచ్చిబటానీ గింజలు, ఒక కప్పు నెయ్యి, తగినంత పోపు- మిరియాలు, అల్లం, ఉప్పు.

ముందుగా గోధుమపిండిలో కొద్దిగా నెయ్యిపోసి, చిటికెడు ఉప్పు వేసి, నీళ్ళుతగినంతగా వేసి పూరి పిండి మాదిరిగా కలిపి పెట్టుకోవాలి.

బటాని గింజలు తొక్కలు తీసి తగినంత ఉప్పు వేసి మిక్సిలో వేయాలి. ఈ పిండి గట్టిగా కచ్చాపచ్చాగా వుండాలి. మిరియాలు, మసాలె దినుసులు, అల్లం మెత్తగా నూరి ఈ బటాని పిండిలో కలపాలి. కొద్దిగా నెయ్యి కూడా పోస్తే రుచిగా వుంటుంది.

ఈ పిండిని మనకి కావలసిన సైజులో వుండలు చుట్టుకుని పెట్టుకోవాలి. తర్వాత గోధుమపిండిని తీసుకొని సమమైన సైజులో వుండలు చేసి పెట్టుకోవాలి.

పూరీ ప్రెస్ తీసుకొని గోధుమపిండి వుండలని పూరీ మాదిరి ఒత్తుకుని, ఈ వత్తిన పూరీ మధ్యగా బటాని వుండని వుంచి, గోధుమపూరీతో లోపలి వుండ కనబడకుండా కప్పాలి. అన్ని కచూరీలు తయారు చేసుకోవడం అయ్యాక బాణలిలో నెయ్యిపోసి (లేదా నూనెగాని) ఈ కచూరీలను గోధుమరంగు వచ్చేదాక వేయించాలి.

-శ్రీప్రియ.(అత్తిలి)

సర్పంచ్ గారి ఏకైక పుత్రికా రత్నం యాదాలాపంగా తన పెరట్లోని బావిలోకి తొంగి చూచింది. ఆమె మెడలో ఉన్న పది తులాల బంగారు గొలుసు- కొక్కీ వదులుగా నుందో ఏమో- సర్రున జారి బావిలో పడిపోయింది! ఆమె గాభరా పడిపోయి, పరుగెత్తుకెళ్ళి తల్లితో చెప్పింది. ఆమె భర్తను పిల్చి, భయపడుతూనే, అమ్మాయివల్ల జరిగిన పొరపాటును తెలియజేసింది. ఆ మాట వింటూనే సర్పంచ్ నిరుత్తరుడైపొయ్యాడు! ఎందుకంటే-

అది పన్నెండు నిలువుల లోతుగల పురాతనమైన బావి. అంటే దాని లోతు 72 అడుగులన్నమాట! పైగా- ఆ బావికి మంచి ఊట ఉందేమో- నిరంతరం నిండుగా ఉండి నీలాలను ఒలికిస్తూ ఉంటుంది. ఆ ప్రాంతానికల్లా ఆ బావిలోకి దిగగల ఒకే ఒక మొనగాడు రంగయ్య మాత్రమే! అది స్ఫురించాక సర్పంచ్ కలవరపడిపోయాడు. అతని బుర్రలో ఇంకా మూడేళ్లనాటి ఆ సంఘటన మెదులుతూనే ఉంది! ఆ నాటి నుండీ రంగయ్య ముఖాన్ని తనకు చూపడం జరగలేదు! అంతేగాదు- అతడు తమ వీధిలోకి గూడా అడుగు పెట్టకుండా భీష్మించుకోవడం ఆయనకెరుకే! అందుకనే ఇక ఆ గొలుసు మీద ఆశ వదులుకున్నాడు!

కాని, ఇంటిలో ఆడవాళ్ల పోరుపడలేక తన వద్ద లెక్కలు చూచే గుమాస్తా పంతులును పంపాడు ప్రయత్నించి చూడమని. పంతులు రంగయ్య వద్దకు వెళ్లి నయానా భయానా చెప్పి చూచాడు. అతడిఎత్తులు పారక- ఇక లాభంలేదనుకుని తిరిగొచ్చి రంగయ్య మొండి పట్టుదలను గురించి సర్పంచ్‌కు తెలియపరిచాడు.

ఇప్పుడు విషయం నలుగురిలో పడింది. సర్పంచ్ అహం దెబ్బతిన్నది! ఎందులోను అపజయ మెరుగని తాను ప్రయత్నించి విఫలుడయ్యాడు! "కూటికి గతిలేని ఒక అనామకుడు నన్ను నిర్లక్ష్యం చేస్తాడా? సరే, వాడి సంగతి తర్వాత చూస్తాను!" అని తలను పంకించాడు క్రోధాతిశయంతో.

ఇంతలో ఎవరో చెప్పారు- సమీపంలోనే ఉన్న ఏదో గ్రామంలో ఎవరో ఒక గజ ఈతగాడున్నాడని! తక్షణం అతనిని పిలుచుకు రమ్మని మనిషిని తరిమాడు.

సమయానికి ఆ గ్రామంలో ఆ ఈతగాడు లేడు. అతడు వచ్చే వరకు ఉండి మరునాడుదయాన్నే వెంటబెట్టుకొచ్చాడు ఆ వెళ్ళిన వ్యక్తి. ఈతగాడు వస్తూనే బావిచుట్టూ గబగబా నాలుగుసార్లు ప్రదక్షిణం చేసాడు. గంభీరంగా కనుపించే ఆ బావిలోకి దిగను ధైర్యం చాలలేదు. "లోతు ఏ మాత్రముంటుంది?" అని అక్కడ ఉన్న ఒక ముసలాయన్ను అడిగేడు గుసగుసగా.

"పన్నెండు నిలువులు బాబూ!" అన్నాడాయన వణికే కంఠంతో. ఆ మాట వినగానే అతని గుండె ఝల్లుమంది!

కాని అక్కడ గుమిగూడి ఉన్న వారంతా అతడిని ఊపిరి తీసుకోనిస్తేనా! ఆడా, మగా అందరు "ఫరవాలేదు, దిగు!" అని ప్రోత్సహించసాగేరు. "గొలుసును తీసిచ్చావంటే వందరూపాయలు బహుమానంగా ఇస్తా!" ఆశ పెట్టాడు సర్పంచ్.

ఆ గజ ఈతగాడు ఇక విధిలేక బావిలోకి దిగాడు. రెండు మూడు సార్లు మునకేసి వచ్చి, "అబ్బే, లేదండీ!" అన్నాడు నీళ్లు కారే తలను విదిలిస్తూ.

"బాగా వెదికినవా?" అడిగాడు సర్పంచ్ ఆతృతగా.

"వెదికానండీ! గొలుసు కనపిస్తేనా? సూది పడ్డా తేగలనండీ! మీ గొలుసు కనిపిస్తే ఎందుకు తేలేనండీ?" వళ్లు తుడుచుకు ని పొడి బట్టలు వేసుకోసాగాడు.

సర్పంచ్ ఆలోచనలో పడ్డాడు. అతని మెదడులో తటాలున ఒక దురూహ మెదిలింది! "బావిలో గొలుసు పడ్డ సంగతి రంగయ్యకు తెలుసుగదా! వాడు రాత్రికి రాత్రే వచ్చి బావిలో దిగి గొలుసును మెత్తకపోయిండో ఏమో! లేకపోతే- ఈ గజీతగాడికి గొలుసు ఎందుకు కనవడలేదు? కచ్చితంగా అదే జరిగుంటది!"

ఈ ఆలోచన రాగానే సర్పంచ్ పండ్లు పటపట కొరుకుతూ ఆ నాలుగు గ్రామాల కూడలిలో ఉండే పోలీసు స్టేషను వైపుకు వేగంగా నడక సాగించాడు పంతులును వెంటబెట్టుకుని. ఇంత జరుగుతున్నా సర్పంచ్ బావమరిది పత్తాలేడు!

*    *    *    *    *    *

"ఎవర్రా గుడిసెలో?" కర్కశమైన ఆ పిలుపుకు- "ఏంది సామీ!" అంటూ వెలుపలికి వచ్చాడు రంగయ్య. ఎదురుగా- యమదూతల్లాగా నిలువ బడున్న ఇద్దరు పోలీసులను చూచి గతుక్కుమన్నాడు.

"నీవేనా రంగయ్యవు?" అడిగాడొక పోలీసు రంగయ్యను ఎగాదిగా చూస్తూ.

"అవును సామీ!"నెమ్మదిగా గొంతును పెగల్చుకుని అన్నాడు రంగయ్య.

"అయితే పద- స్టేషనుకు!" లాఠిని మెడ మీద పెట్టాడు.

"నేనేం నేరం చేసినా సామీ?" గొంతులో మాట్లాడుతున్నాడు రంగయ్య.

"ఏమో! స్టేషన్‌కు పద! అక్కడే తెలుస్తది నీ నేరమేందో!" అని రంగయ్యను ముందుకు నెట్టుకుంటూ తమ వెంట తీసుకుపోసాగేరు. అది చూచిన చిన్ని భోరున విలపించసాగింది.

స్టేషన్‌లో- ఇన్స్‌పెక్టరు ముందు నిలిపారు రంగయ్యను. ఎస్.ఐ.- "నిన్నటి రాత్రి నీవు సర్పంచ్‌గారి బావిలోకి దిగావట, నిజమేనా?" కఠినంగా ప్రశ్నించాడు. రంగయ్య దిగ్భ్రాంతి చెందుతూ-

"అయ్యా! నేనా? వాళ్ల బాయి దగ్గర నాకేం పనయ్యా?" అన్నాడు రంగయ్య అమాయకంగా. ఎస్.ఐ. కోపం సర్రున నూట పది డిగ్రీలలోకి వెళ్లింది!

"ఒరే ముసలి ముండా కొడకా! దొంగ కూతలు కుయ్యకురా! అర్ధరాత్రి వేళ సర్పంచ్ గారి బావిలో దిగి బంగారం గొలుసును కాజేసి, ఏమీ ఎరగనట్లు నటిస్తావురా? అసలా బావిలోకి నీవు తప్ప యింకెవరూ దిగలేరని గ్రామస్తులంతా చెబుతున్నారు గదా! ఖచ్చితంగా నీవే తీశావు! చెప్పు, ఆ గొలుసు నెక్కడ పెట్టావ్?" అరిచాడు బిగ్గరగా.

"రామ రామ! నాకేం పాపం తెలియదయ్యా! నేను నిన్న రాములమ్మ సేలో పనిజేసి, రేత్రి పొద్దుబోయి యింటికి వచ్చినా! ఇంత సంగటి దిని పడుకున్నా! పేనమెట్ట బొయ్యిందో యెరికేలేదు! అంతేగాని నాకేం తెలవ దయ్యా! సత్తె పెమానకంగా, నా బిడ్డ సాచ్చిగా చెబుతుండా సామీ! " అంటూ రంగయ్య గట్టిగా చెంపలేసుకున్నాడు.

ఎస్. ఐ. ఆగ్రహోదగ్రుడయ్యాడు. గుడ్లురుముతూ-

"ఏరా ముసలోడా! నా దగ్గరట్రా నీ కల్లబొల్లి కూతలు! " ఫట్ మంది రంగయ్య వీపు మీద లాఠీ దెబ్బ.

"చెప్పు! లేకపోతే నీ ఎముకలిరిచేస్తా! " మళ్లీ ఫట్ ఫట్!

"ఓరి నాయనో! ఓయమ్మో! నేనేమెరుగను దేవుడో! " శోకండాలు పెట్టసాగేరు రంగయ్య మెలికలు తిరిగిపోతూ.

"చెప్పరా, దొంగ రాస్కెల్!." ఫటా ఫట్! దెబ్బ మీద దెబ్బ! రంగయ్య బడుగు దేహం హూనమై పోతున్నది! పాపమా వృద్ధుడు ఆ

## వర్షం కురిసిన రాత్రి

కరువుతో అల్లాడు భువి సీమ
ప్రజల చూపుల్లో ఆకలి కురిసిన రాత్రి
తిండి బరువుతో జోగేదివి సీమ
ప్రజల్లో అమృతం కురిసిన రాత్రి
నిత్య సమస్యలతో తపించే
త్రిశంకు సీమ
జనుల్లో వర్షం కురిసిన రాత్రి!

—మల్లంపల్లి విజయకుమార్

దెబ్బలకు ఓర్చుకోలేక హాహాకారాలు చేస్తున్నాడు!

"చెప్పరా చెప్పు!" ఇన్‌స్పెక్టర్ కొంచెం అలుపు తీర్చుకుంటున్నాడు!

ఇంతలో రంగయ్య బుర్రలో తటాలున ఏదో స్ఫురించింది! వెంటనే-

"సామీ! ఈ ఒక్క మనవి ఆలకించండయ్యా! ఆ బాయిలో దిగేవోడు యీ పక్క లేడు? ఆ మాట నిజం! వాడెవరో దిగి సూసినాడంటే నాకు నమ్మకం కుదరడంలేదు! నేనే దిగి సూత్తాను! నన్నా బాయికాడికి తీసుకు పోండి సామీ! నా అనుమానం తీర్చుకోనీండి సామీ!"

అని ఏడవసాగాడు.

ఏ కళ నున్నాడో గాని ఎస్. ఐ. అందుల కంగీకరించాడు.

వెను వెంటనే ఎస్. ఐ. మరి ఇద్దరు పోలీసులు రంగయ్యను వెంట బెట్టుకుని సర్పంచ్ యింటి వద్దకు వచ్చారు. రంగయ్య అవమాన భారంతో - శిరస్సును పూర్తిగా వంచుకుని ఖిన్నుడై- దేవుని మీద భారం వేసి - వాళ్లతోటే బావి దగ్గరకు నడిచాడు. వారిని చూస్తూనే సర్పంచ్, ఆయన పరివారం బావి దగ్గరకు పరుగెత్తారు.

"దిగరా, దిగు!" అని ఎస్. ఐ. గర్జించగానే రంగయ్య నెమ్మదిగా- మొల పంచెను గట్టిగా పైకి ఎగ్గట్టి, గోచీని బిగించాడు. బావి పైన గిలక బిగించిన దూలానికి ఒక చేంతాడును గట్టిగా బిగించాడు. దాన్ని ఆసరాగా చేసుకుని - సర సరలోనికి దిగి- చేంతాడును వదిలి - బుడుంగున నీటిలోకి వెళ్లిపొయ్యాడు!

అందరూ బావి చుట్టూ నిలువబడి లోపలికి ఆత్రుతగా చూస్తున్నారు. నీటి పైకి బుడ బుడమని బుడగలు వస్తున్నాయి! నిముషాలు గడుస్తున్నాయి! ఎస్. ఐ. క్షణ క్షణానికి వాచీ వంక చూస్తున్నాడు. ఒకటి.... రెండు.... మూడు.... నాలుగు.... ఐదు నిముషాలు కావస్తుండగా బుడుంగున నీళ్ల పైకి వచ్చాడు రంగయ్య. నోటిలోని నీటిని ఉమ్మి, చేంతాడును అంది పుచ్చుకొని చక చకా పైకి ఎగబ్రాకి వచ్చాడు. తలపై నుండి క్రిందికి నీళ్లు కారి పోతున్నాయి. గడ గడ వణుకుతూ మొలలో దోపుకోనున్న గొలుసు ను తీసి ఎస్. ఐ. చేతిలో పెట్టాడు! అందరూ సంభ్రమాశ్చర్యాలలో మునిగిపోయారు! ఎస్. ఐ. చిరునవ్వుతో గొలుసును సర్పంచుకు అందించాడు. గొలుసును అందుకున్న సర్పంచ్ ముఖం క్షణాలలో గంభీరంగా మారిపోయింది! క్రూరంగా చూస్తూ -

"నా అనుమానం నిజమే అయ్యింది సార్! నిన్నటి రాత్రి వీడే ఆ గొలుసును బావిలోపల ఏ బొక్కలోనో దాసి పెట్టుంటాడు! అందుకనే నిన్న ఆ గజీతగానికి కనపడక పోయింది. ఈ ముసలోడు మీ దెబ్బలకు తట్టుకోలేక సరా సరి తాను పెట్టిన చోటికెళ్లి గొలుసు తెచ్చిచ్చాడు! నా కోసరం మీరు శ్రమపడ్డందుకు నమస్కారాలు!" అన్నాడు.

ఆ మాటలకు అందరూ ఆశ్చర్య చకితులయ్యారు. కాని రంగయ్య గుండె లకు ఈటెల్లా తాకినై అతని మాటలు.

కోపాన్ని, దుఃఖాన్ని లోలోపలే దిగమ్రింగి,

"నన్ను వదిలెయ్యండి సామీ! యెల్లిపోతా!" అని ఎస్. ఐ. ని వేడుకున్నాడు. ఆయన ఒక్క క్షణం ఆలోచించి -

"ఒరే ముసలోడా! కనికరంతో నిన్ను ఇప్పటికి వదిలిపెడుతున్నా! ఇంకెప్పుడూ ఇలాంటి దగాకోరు పనులు చెయ్యమాక! వెళ్లు!" అన్నాడు అసహ్యించు కొన్నట్లుగా.

రంగయ్య గ్రుడ్ల నీరు గ్రక్కుకుంటూ, కాళ్లు తడబడుతూండగా నెమ్మదిగా యిల్లు చేరాడు. చిన్ని తండ్రిని చుట్టుకుని బావురుమంది. పేదవారి నిజాయితీ. సోదెలోకి కూడా రాదన్న సత్యాన్ని ఎరుగని అమాయకులు!

తెల్లవారేసరికి ఆ గుడిసెను ఖాళీ చేసి, అసలా గ్రామాన్నే వదిలి ఎటో వెళ్లిపోయారు అభిమానధనులైన ఆ తండ్రీ తనయలిద్దరూ! ●




**జరిగిన కథ-9 :** పాంచాలరాజు ద్రుపదుడివల్ల అవమానం పాలైన ద్రోణుడు అర్జునుడి ద్వారా తన ప్రతీకారం తీర్చుకుంటాడు. ద్రుపదుడు చేసిన యజ్ఞ ఫలంవల్ల ధృష్టద్యుమ్నుడు, కృష్ణ జన్మిస్తారు. అర్జునుడు స్వయంవరంలో కృష్ణను చేపడతాడు. పాండవు లయిదుగురికి ద్రౌపదినిచ్చి పెళ్లి చేయటంలో అధర్మ మేదీ లేదని వ్యాసమహర్షి సందేహ నివృత్తి చేయటంతో ద్రుపదుడు వారి పెళ్లి జరిపిస్తాడు. ధర్మరాజు పట్టాభిషేకానంతరం సోదరులను, ద్రౌపదిని తీసుకొని ఖాండవప్రస్థం వెళ్తారు. విహారానికై ఖాండవవనం వెళ్లిన కృష్ణార్జునులు ఖాండవ దహనానికి పూనుకుంటారు. నారదుడి సలహాపై ధర్మరాజు రాజసూయ యాగానికి సిద్ధమవుతాడు. కృష్ణుడి సహాయంతో భీముడు జరాసంధుడ్ని వధిస్తాడు.

కృష్ణుడు భీమార్జునులనూ, చెర నుండి విడిపించిన రాజులనూ రథమెక్కించుకొని ఇంద్రప్రస్థానికి బయలుదేరి వెళ్ళాడు. ఆయుధాలవల్ల చావని జరా సంధుణ్ణి భీముడు జుట్టుపట్టుకు లాగి, బంతిలా ఎగరేసి, వెల్లకిలా పడేసి, పిడి గుద్దులు గుద్ది, ఎముకల సంధులు విరిచేసి చితకపొడిచేసరికి అతను రక్తం కక్కుకున్నాడని తెలిసి ఇంద్రప్రస్థ పౌరులందరూ సంతోషంతో చప్పట్లు కొట్టారు.

బాలకృష్ణ దేవుడికి చేతులు జోడించి జయజయ వినాదాలు చేశారు.

కృష్ణార్జునులూ, భీముడూ సభా మందిరం లోకి ప్రవేశించి తాము మగధ దేశం నుంచి తెచ్చిన రాజులందర్నీ ధర్మరాజుకు చూపించారు.

ధర్మరాజు ఆ రాజులందర్నీ గౌరవించి వాళ్ళ వాళ్ళ దేశాలకు పంపించేశాడు.

కృష్ణుడు కూడా ద్వారకా పురానికి బయలుదేరాడు. పాండవులు ఆనంద బాష్పాలతో ఆయనకు వీడ్కోలు చెప్పారు.

కృష్ణుడి రథం వెళ్తుంటే వెనక ఇంద్రప్రస్థ మంతా చూస్తూ నిలబడిపోయింది.

### దిగ్విజయం

మరునాడే ప్రయాణం.

ధర్మరాజు నలుగురు తమ్ములూ నాలుగు దిక్కులూ జయించి అపార ధన కనక వస్తువాహనాలు తెచ్చి అన్నగారికి ఇచ్చేందుకు బయలుదేరుతున్నారు.

ద్రౌపది హారతులిచ్చింది.

సుభద్ర అర్జునుడికి వీర తిలకం దిద్దింది.

ముత్తైదువలు, కన్నెపిల్లలు, కపిలగోవులు, లేగదూడలు శకునం వచ్చారు.

భీమార్జున నకుల సహదేవులు తల్లికి, అన్నకూ నమస్కరించారు.

ద్రౌపది ఎవరికీ వినపడనంత మెల్లగా 'గాండీవీ! నువ్వు లేని ఇంద్రప్రస్థం నాకు దుర్భరం. నాకళ్ళు నీ దర్శనం కోసం ఎదురు చూస్తుంటాయి. త్వరగా వచ్చేయ్ . . .' అంది.

ఆమె కళ్ళు ఊట బుగ్గలలాగా వున్నాయి.

అర్జునుడు కళ్ళతోనే ద్రౌపదిని అనునయించి రథ మెక్కాడు.

రథం కదిలింది.

అర్జునుడు ప్రేమతో వెనక్కి తిరిగి చూస్తునే వున్నాడు, దూరమవుతున్న ఇంద్రప్రస్థం కేసి, ప్రియసతి ద్రౌపది కేసి ..........

సవ్యసాచి సురక్షితంగా దిగ్విజయంతో తిరిగి వచ్చేటట్లు అనుగ్రహించు స్వామీ అని ద్రౌపది నల్లని వానికి, తెల్లని నవ్వుల వానికి, చల్లని చూపుల వానికి, అల్లరి చేష్టల వానికి గోపాల దేవునికి మొక్కింది.

× × ×

అగ్ని వల్ల లభించిన దివ్యరథం ఎక్కి గాండీవ హస్తుడై అర్జునుడు ఉత్తరదిశగా వెళ్ళాడు. పుళింద మహీపతినీ, అఖిల ద్వీప మండలేశ్వరులనూ ఓడించి ప్రాగ్జ్యోతిష పురాన్ని ముట్టడించాడు. ప్రాగ్జ్యోతిషపతి భగదత్తుడు అనేక మంది యోధులను పోగు చేసుకుని అర్జునుడితో ఎనిమిది రోజులు యుద్ధం చేశాడు.

కాని విజయుడిదే పై చెయ్యి అయింది.

'అర్జునా! నేను ఇంద్ర సఖుడ్ని. నువ్వు ఇంద్ర కుమారుడివి. నీతో యుద్ధం చెయ్యడానికి మనస్సు ఒప్పడం లేదు. నీకు ఏం కావాలో చెప్పు' అన్నాడు భగదత్తుడు.

'ధర్మరాజు రాజసూయ యాగం చెయ్యబోతున్నాడు. అతనికి కప్పం చెల్లించు. నువ్వుకూడా ఆ యాగానికి వచ్చి కురువిభుడ్ని గౌరవించు' అన్నాడు అర్జునుడు.

భగదత్తుడు సంతోషించి అపార ధన రాసులు ఇచ్చాడు.

అవి తీసుకుని అర్జునుడు ముందుకు సాగిపోయాడు. మాళవ, పౌండ్ర, కాశ్మీర, కాంభోజ, కోసల దేశాల రాజులందరూ అతనికి రకరకాల బంగారు వస్తువులు కానుకలుగా ఇచ్చారు.

ఆ తరువాత సింహపురం మీదగా శ్వేత పర్వతం చేరుకుని అక్కడనుంచి హాటక దేశం వెళ్ళాడు. అక్కడ మానస సరస్సులో ఋషి కుల్యను చూసి అక్కడున్న రాజుల దగ్గర నుండి చిత్ర విచిత్రాలైన గుర్రాలను తీసుకున్నాడు. హేమకూట, నిషధాచలాలను గడిచి, గంధర్వ నగరాలను గెలిచి మేరు పర్వతం చేరుకున్నాడు. అక్కడ జంబూ వృక్షం, బంగారు నది వున్నాయి. వాటిని దర్శించి హరి వాసమనే పట్టణం మీదకు దండెత్తి వెళ్ళాడు. ఆ పట్టణాన్ని అమిత బలవంతులు కాపలా కాస్తుంటారు.

వాళ్ళు అర్జునుణ్ణి చూసి 'నీవంటి

శూరుడ్ని మేమింత వరకూ ఎక్కడా చూడ లేదు. ఏ యుగంలోనూ ఏ రాజూ ఈ పట్టణం దరిదాపుకు రాలేదు. వీటిని ఉత్తర కురుభూములంటారు. అసలివి మనుష్యలకు కనిపించవు. మరి నీకెలా కనిపించాయో మాకు తెలీడం లేదు. అయినా నీకేం కావాలో అడుగు' అన్నారు.

'అయ్యా! మా అగ్రజుడు ధర్మరాజు రాజసూయయాగం చెయ్యబోతున్నాడు. మీ దగ్గర వుండే విలువైన వస్తువులేవైనా ఆయనకు కానుకగా సమర్పించండి. అందువల్ల అతని సామ్రాజ్యం అతిశయిల్లుతుంది' ద్వారపాలకులు వెళ్ళి ఉత్తర కురు భూముల రాజులకి సంగతి చెప్పారు. వాళ్ళు రత్నాభరణాలు తెచ్చి అర్జునుడికి ఇచ్చారు. ఆవిధంగా ఉత్తర కురు భూముల వరకూ ధర్మరాజు రాజసూయ యాగం చెయ్యబోతు న్నాడన్న సంగతి తెలిసిపోయింది.

భీముడు తూర్పు దిక్కును జయించ బోయాడు. విదేహ రాజు జనకుణ్ణి జయించాడు. దశార్ణపతి సుధన్వుడ్ని ఓడించాడు. శిశుపాలుడు రాజసూయ యాగానికి కావల్సిన ధనరాసులు బహుమానంగా ఇచ్చాడు. కళింద, కుమార, కోసల, అయోధ్య, కాశీ పురాధీశ్వరులు భీముడితో తలపడి చావు దెబ్బలు తిన్నారు. వాళ్ళు చివరికి వశు లయ్యారు. మత్స్య, మలద దేశాధీశులనూ, కర్ణాట దక్షిణ మల్లులనూ వాయు నందనుడు మర్దించాడు. పౌండ్రక వాసుదేవుణ్ణి జయించాడు. వాళ్లందరూ వెండి బంగారాలు ఇచ్చి భీముణ్ణి గౌరవించారు.



ఆంధ్ర సచిత్ర వారపత్రిక



## వినాయక చవితి సంచిక

ఎప్పటివలె యీ సంవత్సరం వినాయక చవితి సంచిక కూడా ఆంధ్ర సచిత్ర వార పత్రిక జన్మ దిన సంచికగా వెలువడుతుంది ! రచయితలు, చిత్రకారులు ప్రత్యేక రచనలను వినాయక చవితి సంచిక, ఆంధ్ర సచిత్ర వార పత్రిక, గాంధీ-నగరం అన్న చిరునామాకి పోస్టు చేయాలి. కార్టూనిస్టులు "విఘ్నేశ్వరు"ని మీద వ్యంగ్య చిత్రాలు పంపనక్కరలేదు. వ్యాసకర్తలు హాస్య రచనలు పంపినట్లే కార్టూనిస్టులు కూడా యితర అంశాలపై కడుపుబ్బ నవ్వించే కార్టూన్‌లు పంపడం మంచిది.

\- ఎడిటర్

సహదేవుడు దక్షిణ దిశగా వెళ్ళాడు. సుమిత్ర, శూర సేనాది మహీపతులనూ, యవనులనూ, గో శృంగగిరి నివాసులనూ జయించాడు. అక్కడనుంచి కుంతిభోజుని రాజధాని చేరుకున్నాడు. కుంతిభోజుడు మనవణ్ణి చూసి మహదానందపడ్డాడు. సహదేవుడు తాతగారి దీవనలందుకుని జంభకుడికి మీదకు యుద్ధానికి వెళ్ళాడు. ఒక్క దెబ్బతో అతన్ని పడగొట్టాడు. జంభకుడు భయపడి పోయి తన దగ్గరున్న మంచి మంచి గుర్రాలను, ఏనుగులనూ బహుమతిగా ఇచ్చాడు. అక్కడనుంచి తిన్నగా వెళ్ళి మహిష్మతీ పురాన్ని ముట్టడించాడు. పుర ప్రవేశం చెయ్యగానే సహదేవుడి సైన్యాలను అగ్ని చుట్టు ముట్టింది. అందరు హాహాకారాలు చేశారు. ఎక్కడి వాళ్ళక్కడ చెల్లాచెదు రయ్యారు. సహదేవుడు కలవరపడ్డాడు. కళ్ళు మూసుకుని కృష్ణుడ్ని ధ్యానించాడు. అర మోడ్చిన కన్నుల్లో నల్లనయ్య కదిలాడు. అభయ హస్త మందించాడు.

....... మహిష్మతీ రాజ్యాధిపతులకు అది అగ్ని దేవుడిచ్చిన వరం .

పూర్వం నీలుని వంశంలో నిషధుడనే రాజుండేవాడు. ఆయన రాజ్యపాలన చేస్తున్న రోజుల్లో అగ్నిహోత్రుడు బ్రాహ్మణ వేషం ధరించి ఆ పట్టణంలో వేదాధ్యయనం చేస్తుండేవాడు. ఆయనొకసారి పర స్త్రీని అనుభవించాడు. అది గమనించిన రాజ సేవకులు ఇతరుని భార్యను పొందిన నేరానికి అతన్ని బంధించి రాజ సమక్షంలో నిలబెట్టారు. విప్ర వేషంలో వున్న అగ్ని అవమాన భారంతో కుమిలిపోయాడు. కోపం తట్టుకోలేక నిషధ రాజా ఎదుట పొగలు కక్కుతూ, నిప్పు రవ్వలు ఎగజిమ్ముతూ తన అసలు రూపం చూపించాడు. పాపం ఆ రాజా హడలిపోయాడు.

'అగ్నిదేవా! నా అజ్ఞానం సహించు. నన్నూ, నా భటులనూ మన్నించు' అని ప్రాధేయ పడ్డాడు.

అగ్ని అతని వినయానికి మెచ్చుకుని వరం కోరుకోమన్నాడు.

'ఈ పట్టణాన్ని జయించడానికి ఎవరు వచ్చినా వాళ్ళు అగ్నికి ఆహుతి కావాలి'

'మహారాజా! నువ్వు కోరిన వరమిస్తున్నాను. మరి నువ్వు కూడా నేనడిగినది ఇవ్వాలి'

'అడగండి మహానుభావా! ' నిషధకుడు ముకుళిత హస్తాలతో అన్నాడు.

'ఈ పురంలో ఆడవాళ్ళందరికీ మదన తాపం ఎక్కువ. కనుక వీళ్ళు స్వైరిణులైనా నువ్వేమి తప్పు పట్టకూడదు'

మహారాజా సరే నన్నాడు.

అప్పటి నుంచి మాహిష్మతీ పుర స్త్రీలకు స్వైరణీత్వం నిర్దోషమైంది.

నిషధుడికిచ్చిన మాట ప్రకారం అగ్ని దేవుడు ఆ పురాన్ని జయించడానికి వచ్చిన వాళ్ళందరినీ దగ్ధం చేస్తూ వుంటాడు.

....... కనుక అగ్నిని మంచి చేసుకో అన్నాడు కృష్ణుడు.

సహదేవుడు శుచియై అగ్ని సూక్తాంతో స్తోత్రం చేశాడు.

అగ్ని శమించాడు.

నిషధుడికిది తెలియగానే సహదేవుడ్ని రప్పించి కానుకలిచ్చి సత్కరించాడు.

అతని ఎదుట రత్నాలూ, ముత్యాలూ కుప్పలు పోశాడు.

వేలాది అశ్వాలను బహుమతిగా ఇచ్చాడు.

ధర్మజుడి రాజసూయ యాగానికి తన మద్దత్తు ప్రకటించాడు.

సహదేవుడు అక్కడనుంచి తాళవన, పాండ్య, కేరళ, కళింగ, ద్రవిడ దేశాల మీదకు దండెత్తి వెళ్ళి అక్కడి రాజాలందర్నీ జయించాడు.

లంకాధిపతి విభీషణుడికీ సంగతి తెలిసింది. ఎందుకైనా మంచిదని సహదేవుడికి ఎదురేగి స్వాగతం చెప్పాడు.

రకరకాల బహుమానాలిచ్చి గౌరవించాడు.

అవి తీసుకుని అతను ఇంద్రప్రస్థాన్ని చేరుకున్నాడు.

నకులుడు పడమర దిక్కుగా వెళ్ళాడు. మరు, మాళవ, బర్బర, కర్పర, దాశార్ణ దేశాల రాజాలందర్నీ దెబ్బకు ఓడించాడు. తరువాత పశ్చిమ సముద్ర గర్భంలో వున్న కిరాత వీరులను వెతికి పట్టుకున్నాడు. వాళ్ళందరూ అతనికి పాదాక్రాంతులయ్యారు. ఆ విధంగా పశ్చిమ దిగ్విజయం చేసి సంపాదించిన ధన కనక వస్తు వాహనాలను పది లొట్టి పిట్టల మీద వేసుకుని ఇంద్రప్రస్థానికి వెళ్ళాడు. అలా తమ్ములు నలుగురూ నాలుగు దిక్కులూ జయించి తెచ్చిన ధన రాసులు అన్నగారి పాదాల ముందు గుట్టలు గుట్టలుగా పోశారు.

వేలాది గుర్రాలు - తెల్లవి, నల్లవి, తెలుపూనలుపూ కలగలిసినవి, గోధూళి రంగువి ఆరుబయలు ప్రదేశంలో కట్టేశారు.

వాటికి కొంచెం ఎడంగా ఏనుగుల్ని నిలిపారు.

నల్లని మేఘాల గుంపులా వున్నాయవి.

రథాలూ, బళ్ళూ సరేసరి. బారులు తీరి వున్నాయి.

వాటన్నిటినీ చూసి తన వైభవానికి తనే మురిసిపోయాడు ధర్మరాజా.

ఇంతలో ద్వారక నుంచి కృష్ణుడు వచ్చినట్టు కబురందింది.

గబగబ సింహాసనం దిగి బావకు ఎదురు వెళ్ళాడు.

గౌరవ పురస్సరంగా తీసుకువచ్చి తన

సింహాసనం మీద కూర్చోబెట్టాడు.

ఆయనను చూడగానే అక్కడవున్న వాళ్ళందరి కళ్ళు ఆనందంతో జ్యోతుల్లా వెలిగాయి.

కృష్ణుడు తను తెచ్చిన కానుకలన్నీ ధర్మరాజుకిస్తూ –

ధర్మజా! లోకంలో వున్న భూపతులందరూ ఇప్పుడు నీకు సామంతులయ్యారు. సామ్రాజ్య వైభవంలో ఇంద్రుడితో సమానుడివయ్యావు. ఇంక రాజసూయ యాగానికి ఏర్పాట్లు చేయించు ' అన్నాడు.

' బావా! నీ మాట మాకు వేదం. నీ ప్రేమ వల్లే మేమింత వాళ్ళమయ్యాం. నీ ఆజ్ఞ ప్రకారమే చేస్తాను ' అన్నాడు ధర్మరాజు.

సహదేవుణ్ణి పిలిచి ' యజ్ఞ మండపం తయారు చేయించు. యజ్ఞోపకరణ ద్రవ్యాలు ఏవేం కావాలో ధౌమ్యుల వారిని అడుగు. రాజసూయానికి వచ్చే రాజులకు విడిది గృహాలు కట్టించు ' అని చెప్పి బావగారిని తీసుకుని అభ్యంతర మందిరానికి వెళ్ళిపోయాడు మహారాజు.

## రాజసూయం

రాజసూయ యాగం నాలుగు రోజుల్లో కొచ్చింది.

ఇంద్రప్రస్థమంతా కోలాహలంగావుంది.

అతిథుల కోసం విశ్రాంతి మందిరాలు నిర్మించారు.

దిగుడు బావులూ, చెంగల్వ కొలనులూ ఏర్పాటు చేశారు.

వీధుల కటూ యిటూ చక్కని మొక్కలు, చెట్లు నిలిపారు.

గుబాళిస్తూ పూలవాసన.

కృష్ణుడు పట్టణమంతా కలయ తిరిగాడు.

ఖాండవ ప్రస్థం ఎంత సిరిగల గడ్డగా మారిపోయిందీ

విశాలమైన రహదార్లు

అందమైన భవనాలు

నీటి పడియల చుట్టూ మొగలి పొదలు, వాటి పరిమళం.

ఎటు చూసినా పచ్చదనం

ఎటు చూసినా పైరు పొలాలు

ఎటు చూసినా పంట సిరులు

లక్షల మందికి నిత్యాన్నదానం జరుగుతోంది.

అన్నిటికంటే ఆశ్చర్యం-విశ్వకర్మ సృష్టి.

ఆయన నిర్మించిన సభాభవనం చూసేందుకు రెండు కళ్ళు చాలవు.

అంతకన్నా చిత్రమైనది మయసభ.

స్వర్గం మరిగిన మనుషులకైనా కన్ను కుట్టేంత గొప్పగా వుందది.

లోపలికి అడుగు పెట్టగానే –

నింగో నేలో తెలీనట్టు

ఆకాశంలో తేలుతున్నట్టు

మబ్బుల్లో ఈదుతున్నట్టు

చీకటి పడ్డట్టు

వెన్నెల కురుస్తున్నట్టు

వింతలోకంలో విహరిస్తున్నట్టు

మాయా నగరంలో పరిభ్రమిస్తున్నట్టు

తమాషాగా వుంటుంది.

మయసభ ముందు కృష్ణుడు ఒక చెట్టుకు ఆనుకుని విలాసంగా నిలబడి వేణువు వాయించాడు.

సమ్మోహనంగా వుంది.

(ఇంకా ఉంది)

# పుస్తకాల పేజీ

## ★ స్మోకింగ్ మానడం ఎలా?

రచయిత: హిప్నాటిస్ట్ టి. ఎస్. రావ్. పుటలు: 127. వెల: పన్నెండు రూపాయలు. ప్రతులకు: పల్లవి పబ్లికేషన్స్, ఏలూరు రోడ్, విజయవాడ-2.

పొగ త్రాగే అలవాటున్న వారు దాన్ని ఏవిధంగా మానుకోవాలి. అసలు పొగత్రాగినందువల్ల వచ్చే దుష్పరిణామాలు ఏమిటి? మొదలగు అనేక విషయాలను రచయిత ఈ చిన్ని పుస్తకంలో తెలియ జెశారు. అధికంగా పొగ త్రాగేవారు పూర్తిగా ఆ అలవాటును మానుకోలేకపోయినా దానిపై అదుపు సాధించేందుకు ఈ పుస్తకం ఎంతో ఉపయుక్తంగాగలదు.

## ★ వైదిక ఆర్థిక విధానము-యాజమాన్య సిద్ధాంతము

రచయిత : టి. సూర్యనారాయణ. పుటలు : 20. వెల : ఒక రూపాయి. ప్రతులకు వైదిక క్రాంతి ప్రచురణలు, సికింద్రాబాదు. వ్యక్తి సమాజం కోసం, సమాజం వ్యక్తి కోసం అనే నీతిని ప్రబోధిస్తూ, వేదజ్ఞానంలోని విశిష్టతను ఈ గ్రంథం తెలియ జేస్తుంది.

## ★ దేశం కాలిపోతోంది (కవితా సంపుటి)

రచయిత : పాటిబండ్ల శ్రీమన్నారాయణ. పుటలు : 52. వెల : ఐదు రూపాయలు. ప్రతులకు : ప్రజాశక్తి బుక్‌హౌస్, విజయవాడ- 520002 లేదా పాటిబండ్ల శ్రీమన్నారాయణ, యు. పి. స్కూల్, అద్దంకి-523201, ప్రకాశం జిల్లా. సమాజంలోని కబుర్లకూ- కార్యాచరణకూ మధ్య గల వైరుధ్యాన్ని తెలిపే కవితలు, వ్యంగ్యధోరణులతో కూడుకున్న కవితలు యిందులో చోటు చేసుకున్నాయి.

## ★ కావ్య కన్య

గ్రంథకర్త : ఎం. పి. జాన్ కవి. పుటలు : 55. వెల : ఐదు రూపాయలు. ప్రతులకు : ఎం. పి. జాన్ కవి. పాలబజారు, బాప్టిస్టుపాలెం, విజయవాడ-520016. ఆధునిక సామాజిక ప్రయోజనాలకు అనుగుణంగా కావ్యస్వరూపాన్ని హృద్యమైన రీతిలో రచించిన గ్రంథమిది.

## ★ వరవిక్రయం (కథాసంకలనం)

రచయిత : ఐతా చంద్రయ్య. పుటలు : 62. వెల : సాదా ప్రతి 10 రూపాయలు- గ్రంథాలయ ప్రతి 15 రూపాయలు. ప్రతులకు : ఐతాచంద్రయ్య, ఇం. నెం. 4-4-11, షేర్‌పురా, సిద్దిపేట-502103, లేదా సాహిత్య నికేతన్, బర్కత్‌పురా, హైదరాబాద్-27.

## ★ చిరు చిరు దివ్వెలు (కవితలు)

రచయిత్రి : శ్రీమతి బుద్ధరాజు సులోచన. పుటలు : 116. వెల : పదిహేను రూపాయలు. ప్రతులకు : ఐ 8, గిరిరాజ సొసైటీ, స్వామినారాయణ మందిరం ఎదుట, అట్లాద్రీ, బరోడా-390012.




## ★ తమస్

రచయిత: డాక్టర్ యార్లగడ్డ లక్ష్మీప్రసాద్. పుటలు: 332. వెల: ఇరువది అయిదు రూపాయలు. ప్రతులకు: నవజ్యోతి పబ్లికేషన్స్, ఏలూరు రోడ్, విజయవాడ-2.

దేశంలో సంచలనం సృష్టించి, టెలివిజన్ ద్వారా ప్రసారం కాబడిన డాక్టర్ భీష్మసహాని "తమస్" హిందీ సీరియల్‌కు అనువాదమే ఈ పుస్తకం. మతోన్మాద శక్తులపై శ్రీ సహానీ సంధించిన అస్త్రమే యిది. సీరియల్‌లోని పాత్రల చిత్రీకరణకు తగినట్లుగా ఎంతో నేర్పుతో, చక్కని శైలిలో డాక్టర్ యార్లగడ్డ అనువాదం చేశారు. మసీదు ముందు చంపిన పందిని పడవేయటం అనే చిన్న సంఘటన ఏవిధంగా మతకలహాలకు దారి తీసిందో చాల చక్కగా చిత్రీకరించారు. ఈ సీరియల్ అనేక విమర్శలకు గురైనప్పటికీ డా. సహానీ తాను చెప్పదలుచుకున్నది నిర్భయంగా చూపించి కృతకృత్యు లయ్యారు.

## ★ మనోనేత్రం (వికలాంగుల సమస్యల కవితా చిత్రం)

రచయిత : వేముల ప్రభాకర్ గౌడ్. పుటలు : 44. వెల : ఐదు రూపాయలు. ప్రతులకు : చంద్రభాగ, విరాట్ పబ్లికేషన్స్, బి. 225, వనస్థలిపురం, హైదరాబాద్- 500661 ఉద్యోగ రీత్యా తటస్థపడే అనేక మంది వికలాంగులను చూసిన పిదప రచయితలో కలిగిన స్పందనకు అక్షరాకృతే ఈ కవితా సంపుటి.

## ★ మంత్రాలయ మహర్షి స్తోత్ర పుష్పాంజలులు

రచయిత : పంచాంగం శేషప్పశాస్త్రి. పుటలు : పదిహేను, వెల : రెండు రూపాయలు. ప్రతులకు : పంచాంగం శేషప్పశాస్త్రి, శ్రీ సత్యశాయి గోకులం, ప్రశాంతి నిలయం, పుట్టపర్తి-515134, అనంతపురంజిల్లా.

## ★ కిర్మీరంజీవన బింబం

రచయిత : మాదిరాజు రంగారావు. పుటలు : 53. వెల : ఐదు రూపాయలు. ప్రతులకు : సాహితీ సమితి, 6-7-42/ఎ, రాగన్నదర్వాజ, హన్మకొండ, వరంగల్ లేదా రసధుని పబ్లికేషన్స్, క్వార్టర్ నెం. 14, విద్యారణ్యపురి, కె. యు. క్యాంపస్, వరంగల్-506009.

## ★ చంచల (కవిత)

రచయిత : డి. మహేష్‌కుమార్. పుటలు : 34. వెల : ఆరు రూపాయలు. ప్రతులకు : నిశి పబ్లికేషన్స్, 20-10-19, రాగిమానువీధి, మిట్టూరు, చిత్తూరు-517001.

## ★ చైతన్యతరంగిణి (సాహిత్య వ్యాససంపుటి)

రచన : పి. వి. సుబ్బారావు. పుటలు : 100. వెల : పదిహేను రూపాయలు. ప్రతులకు : కవితా పబ్లికేషన్స్, కేరాఫ్ పి. విజయలక్ష్మి, ఎల్. ఐ. సి. ఏజెంటు, సుబ్బయ్య తోట, చిలకలూరిపేట-522616.

## ★ అర్చన (స్వేచ్ఛా కవితల కలయిక)

రచయితలు : దేవరకొండ సుబ్రహ్మణ్యశాస్త్రి, రాచకొండ వి. ఎస్. సుబ్బలక్ష్మి. పుటలు : 23. వెల : నాలుగు రూపాయలు. ప్రతులకు : శ్రీమతి దేవరకొండ అన్నపూర్ణ భవాని, కేరాఫ్. డి. ఎస్. శాస్త్రి, సబ్‌జడ్జి, మచిలీపట్నం-521001 లేదా శ్రీ కళాభారతి, బొబ్బిలి. ●

# "సయామి కవలలు"

"సయామి కవలలు" ఈ వారం పత్రికకే హైలెట్. నిజంగా అలాంటి రచనలే మేం కోరుకుంటున్నాం. "సయామి కవలలు" ద్వారా వైజ్ఞానికంగా మనం ఎంతగా అభివృద్ధి చెందామోనని గర్వపడుతున్నాం. నాలుగు సీరియల్స్ నాలుగు కథలు, సినిమా వార్తల ద్వారా మాత్రమే పత్రికలని లాక్కు వస్తున్న ఈ తరుణంలో పాఠకుల ఉత్తమాభిరుచికి శ్రమిస్తూ ప్రతి పత్రిక ఓ ప్రత్యేక పత్రికగా రూపొందిస్తున్నారు.

బాణాల రమేష్‌బాబు (ఖమ్మం)

## శత్రుసంహారం

దీపిక ముఖచిత్రం దివ్యంగా వుంది. లల్లాదేవిగారి శత్రుసంహారం సీరియల్ సూపర్ ఫాస్ట్ రైలులా దూసుకుపోతుంది. టూలేట్ కథ నిజ జీవితంలో జరిగే సజీవ చిత్రంలా ఆసక్తికరంగా వుంది. ప్రయాగ రామకృష్ణ ద్రౌపదిలో ఎన్నో విశేషాలు అర్థమయ్యేలా స్పష్టంగా చాలా బాగా మమ్మల్ని ఉత్తేజపరచింది. మంచిని ఎన్నుకొనేదేదైనా అది మంచినే కోరుతుంది. ఒక క్రొత్త ప్రయోగం వల్ల పాఠకులనే పరవశింపజేసింది.

చోడవరపు నాగేశ్వరరావు (సికిందరాబాదు)

## ద్రౌపది

"ద్రౌపది" జన్మరహస్యం పండిత పామరులను ఆకట్టుకునే విధంగా సులభశైలిలో విపులీకరిస్తున్నందుకు శ్రీ రామకృష్ణగారికి, ప్రచురిస్తున్న ఆంధ్రసచిత్ర వారపత్రికకు నా మనః పూర్వక ధన్యవాదాలు.

-ఎస్సార్ తురగా, దానవాయిపేట.

## వజ్రసంకల్పం

ఈవారం ప్రారంభమయిన "వజ్రసంకల్పం" ఇంటరెస్టింగ్‌గా సాగుతున్నది. ఇలాగే పట్టు తప్పకుండా వ్రాయగల సత్తా శాతవాహనగారికి ఉన్నది. 'వజ్రసంకల్పం' సీరియల్‌లో మాస్టారుగారికి గుండెలదాకా గడ్డం ఉన్నట్టు వ్రాశారు రచయిత. కాని సీరియల్‌కి సంబంధించిన బొమ్మలో మాస్టారుకి గడ్డంలేదు.




# వీక్లీ పోస్ట్

మొదటివారంనుండీ సస్పెన్స్‌గా సాగుతుంది 'శత్రుసంహారం.' లల్లాదేవిగార్కి కృతజ్ఞతలు. 'పొగత్రాగెడి వారి సంగతి' సంపాదకీయం ఆలోచింపచేసేదిగా ఉంది. కనీసం నూటికొక్కరైనా మారుతారని ఆశిద్దాం. ఈ వారం ఇంకొక గుడ్‌న్యూస్- హీరో రాజేంద్రప్రసాద్ జవాబులు. రెండువారాల 'వారఫలాలు' ఇవ్వడం మీ సూక్ష్మబుద్ధికి నిదర్శనం.

-పి. కరీంఖాన్, మదనపల్లిరోడ్(ఆర్.-యస్).

## టైపుచేసి....

నవనవోన్మేషపూరిత మా అభిమాన ఆంధ్రసచిత్ర వారపత్రిక ప్రతివారం మమ్మల్నెంతగానో ఆకట్టుకుంటుంది. రచయితలకు ఇచ్చిన సూచనలు చదివాను. కాగితంపైన వ్రాసిపంపాలి. అడ్రసు తెలుగులోనే వ్రాయాలని చెప్పారు. చక్కగా, అందంగా టైపు చేసి పంపవచ్చా లేక తప్పనిసరిగా చేతివ్రాతే ఉండాలో తెలియక వ్రాస్తున్నాను. టైపు చేసినవి పంపవచ్చంటే లెటరు ప్రచురించండి. లేకపోతే...

-పామర్తి శివరామకృష్ణ, కావలి.

## నిష్పాక్షికబుద్ధి

మా అభిమాన ఆంధ్రపత్రికలో మూస ఉత్తరాలకు ఉద్వాసన చెప్పి చక్కని విమర్శనాత్మక ఉత్తరానికి బహుమతి ఇస్తారని ప్రకటించటం చూసి చాలా సంతోషించాను. అయితే ఆ సంతోషం ఎక్కువకాలం నిలవలేదు. ఇప్పటి వరకు బహుమతి పొందిన ఉత్తరాలు పరిశీలిస్తే ఎక్కువశాతం ఏదో ఒక విధంగా పత్రికను ప్రశంసిస్తూ ఉన్నవే. నిష్పక్షపాత ధోరణికి పెట్టింది పేరు అయిన మా పత్రికలో ఈ విధమయిన లోపాన్ని సవరిస్తారని ఆశిస్తున్నాను.

-పి.ఎస్.ఎన్. కుమార్, గార్లబయ్యారం.

(మీరు కూడా పత్రికలో లోపాలు ఏమీ చెప్పలేదే.-ఎడిటర్)




Editorial Adviser: S. RADHAKRISHNA, Editor: VEERAJI,

Printed and Published by S. NAGESWARARAO for Nageswara Rao Estates Ltd.,

at the Andhra Patrika Press, Gandhi Nagar, Vijayawada-520003.

Phones: Editorial: 75667, Business: 61247, 61248.

# లంకేశుని రంకెలు!

మన ప్రధానమంత్రి శ్రీ రాజీవ్ గాంధీ - రానున్న ఎన్నికలని దృష్టిలో ఎలాగూ పెట్టుకుంటారు. - కాని మద్రాసును కొంచెం ఎక్కువ దృష్టిలో పెట్టుకున్నారు అనుకోవలసి వస్తున్నది - మొన్నటి అసెంబ్లీ ఎన్నికల్లో అక్కడ కాంగ్రెస్ పార్టీకి చావు తప్పి కన్ను లొట్టబోయింది - అన్నట్లయింది. శ్రీలంకలో తమిళ ప్రజల పరిరక్షణ అవసరం అయినంతకాలం అక్కడ భారత సేనలు - (రోజుకి రెండు కోట్ల రూపాయలు ఖర్చు అయినా సరే) వుండి తీరుతాయి అని - ఆయన ముఖ్యంగా దక్షిణాది ప్రాంతాలకి వచ్చినప్పుడు గట్టిగా చెపుతూ వచ్చారు- కాని ప్రేమదాస మాత్రం భారతీయ సైన్యాలు ఇక్కడ వుంటే వాటిని "బారకాసుల్లో మూసేస్తాను" అని ఒకసారి - ఐక్యరాజ్య సమితి దాకాకూడా వెడతాను అని మరొకసారి రకరకాలుగా పబ్లిక్‌గా రంకెలు వేస్తూనే వున్నారు. పైగా "జూలై 29" అన్న తారీఖు నాటికే వీటిని ఒడలెక్కించాలని లంకేశుని ప్రగల్భాలైతే ఆ జూలై 29 నాటికి ఒక్క సైనికుణ్ణి కూడా మేము భారత్‌కు తీసుకుపోము అన్న ధోరణిలో భారత ప్రధాని ప్రెస్టేజి ఇష్యూ చేసుక్కూచుంటున్నారు. ఈ వివాదం ఇప్పటికే చిలికి చిలికి గాలివాన అయ్యింది.

శ్రీలంక ప్రెసిడెంట్ శ్రీ ప్రేమదాస కేవలం ఇండియా గవర్నమెంట్ మీద "కక్షదాస" అయిపోయినాడు! రాజకీయం చేస్తున్నాడు. బజారుకెక్కి అల్లరి చేస్తున్నాడు - విదేశీ శక్తుల దృష్టిని బాగా ఆకర్షిస్తున్నాడు. ఇదంతా చూడగా - అసలీ ప్రేమదాస గారి విజృంభణ వెనుక అంతర్జాతీయ రాజకీయం ఏమైనా సాగుతున్నదా ? ప్రచ్ఛన్న హస్తం ఏమైనా కీలుబొమ్మలాటకి రంగం సిద్ధం చేస్తున్నదా ? అన్న అనుమానం కొంతమందికైనా తల ఎత్తుతున్నది.

## "సార్క్" మీద...

శ్రీ లంకేశుడిప్పుడు "సార్క్" మీద పడ్డాడు. ఈసారి సార్క్ అనగా దక్షిణ దేశాల సహకార సంఘం సమావేశాలు కొలంబోలో జరగాలి. వాటికి సన్నాహాలు చేయవలసింది పాకిస్తాన్. పాకిస్తాన్‌లో జరగవలసిన ఈ సప్త దేశాల విదేశాంగ




మంత్రుల సభకి తాను హాజరు కాబోనని - శ్రీలంక విదేశాంగ మంత్రి విజయరత్న ఒక లేఖ పంపటంతో ఆ సమావేశం వాయిదా పడిపోయింది - శ్రీలంక రాసిన ఈ లేఖ అంతా భారత్ మీద నిందారోపణలే వున్నాయి - ఈ దేశాలన్నింటా అతి పెద్దదైన భారతదేశం మీద శ్రీలంక ఇంతగా గొంతెత్తి అరవటం రాజకీయంగా పాకిస్తాన్‌కు మహా సంబరంగా వుండొచ్చును కాని 'సార్క్' సమావేశాలు వాయిదా పడటం - శ్రీమతి బెనజీర్‌కి కూడా యిష్టం వుండదు. 'సార్క్' సమావేశాలలో రెండు దేశాల మధ్య తలయెత్తిన యే సమస్యను ప్రస్తావించకూడదన్న నిబంధన వున్నది కాని శ్రీలంక దీన్ని కూడా లక్ష్యపెట్టలేదు. మొండిపట్టు వదలనంటున్న శ్రీలంకకి యిప్పుడు లంకలోనే మరో విజయం-రాజకీయ ఘనత లభించింది! తమిళ టైగర్లు యిప్పుడు ప్రేమదానగారి మాటల గారడీలోపడి అసలు "ఈలం" (ప్రత్యేకరాజ్యం) వూసెత్త మంటూ అన్ని సమస్యలు చర్చలు ద్వారా పరిష్కరించుకుంటాం అన్నారు. ఇది శ్రీలంక ప్రేమదాన చేత ఒక "తురుపుముక్క" అనుకోవాలి -



ఇదియిలావుండగా మరొక "యీలం" దళం ఐ.ఐ.ఆర్.ఎల్.ఎఫ్. వారు ఎల్.ఐ.టి.టి.ఇ. (తమిళ టైగర్లు) వారికి శ్రీలంక సైన్యం ఆయుధాలు యిచ్చి మరీ యింతకాలం భారత సేన మీదకి వారిని 'ఉసి' కొల్పిందని ప్రకటించారు. మరో సంస్థ ఇ.ఎన్. డి.ఎల్.ఎఫ్. (ఈలం నేషనల్ డెమోక్రాటిక్ లిబరేషన్ ఫ్రంట్) భారతీయ సైన్యాలు వైదొలగరాదని- వారు వెళ్లిపోయిన మరుక్షణం తమిళులను వూచకోత కోసేస్తారని తాము భయపడుతున్నామని అంటున్నది యీ సంస్థ.

పాకిస్తాన్, ఆ వెనుక నుంచి అమెరికాలు ఈ వ్యవహారంలో "తలదూర్చే" ప్రమాదం వున్నదని, కొన్ని వర్గాలు అప్పుడే భయం ప్రదర్శిస్తున్నాయి. సందర్భ శుద్ధి లేకుండా "శాంతి సేనల" సమస్యను "సార్క్" సభల సన్నాహక సమావేశాలతో ముడిపెట్టి వాయిదా కోసం తెగించిన శ్రీ ప్రేమదాన తన దేశానికి తనకి బాసటగా వున్న భారతదేశానికి కూడా హిందూమహాసముద్ర జలాల్లో చిక్కులు తెచ్చుకుంటున్నాడన్నది స్పష్టం. కాని ఆ మాట ఎవరు నచ్చ చెప్పగలరు? రాజీవ్‌గాంధీగారి గర్వాతిరేకమైన నిర్ణయంవల్ల యివాళ శ్రీలంకకు నచ్చచెప్పవలసిన స్థాయినుంచి భారతదేశం దిగజారిపోయింది!

## పంజాబ్‌లో రక్తపుటేరులు

పంజాబ్ సస్యశ్యామలమై భాంగ్రా నృత్యాలతో నిత్యకళ్యాణం పచ్చతోరణంగా వుండవలసిన రాష్ట్రం- ఖలిస్తాన్ కర్కశ కమెండోల విజృంభణతో నిత్య నరమేధాలకు గురియై అశాంతికి ఆలవాలమై పోయింది. జూన్ 24వ తేదీనాడు పార్క్‌లో సమావేశమైవున్న ఆర్.ఎస్.ఎస్. వారిమీద టెర్రరిస్టులు అమాంతంగా దాడిచేసి- సభలోని వారిలో 26 మందిని నిష్కారణంగా చంపివేశారు.

పంజాబ్ రాష్ట్రం ఒకరకంగా దేశం మొత్తంమీద భాషాప్రయుక్తంగా కాక- మత విహితంగా- సిక్కులు ఎక్కువమంది వున్న ప్రాంతాలను చేర్చి ఏర్పాటు చేసిన రాష్ట్రం. అట్లాగాకపోతే- పంజాబ్-హర్యానాలు కలిసే వుండేవి- అక్కడ ప్రజలకు ఏమి కావాలన్నది తెలియనివ్వకుండా వేర్పాటు టెర్రరిస్టు శక్తులు- ఆరు సంవత్సరాలుగా రక్తపుటేరులు పారిస్తున్నాయి. కేంద్ర ప్రభుత్వం

నిస్సహాయంగా వుండిపోయింది. పైగా మొన్న మొన్ననే- పంజాబ్‌లో పంచాయితీ ఎన్నికలు జరిపిస్తామని కూడా డాంబికాలు పలికింది. పంజాబ్ గవర్నర్ రాజకీయ దురంధరుడు శ్రీ సిద్ధార్థ శంకర్‌రాయ్ గారు మరొక అడుగు ముందుకు వేసి- అక్కడ లోక్‌సభ ఎన్నికలే జరుపుకోవచ్చునన్నారు! ఇది వారికి తన "సొంత" రాష్ట్రంమీద అక్కడి స్థితిగతులమీద వున్న అవగాహన. బర్నాలాగారి ఎన్నికైన ప్రజా ప్రభుత్వం- టెర్రరిస్టుల ఆగడాలను అరికట్టలేక పోయిందని- కేంద్రం పరిపాలనా యంత్రాంగాన్ని హస్తగతం చేసుకుంది, కాని ఇప్పుడు అక్కడ టెర్రరిస్టుల ఆగడాలలో మరణిస్తున్న వారి సంఖ్య యింకా ఎక్కువైంది- దేశంలో మత కలహాలకు ప్రేరణకాగల విధంగా యిప్పుడు టెర్రరిస్టుల ఆగడాలు యెక్కువ అవుతున్నాయి.

లెక్కలు చూస్తే బర్నాలా గవర్నమెంటు టైములో కన్నా సిద్ధార్థ శంకర్‌రాయ్ గారి పాలనలో ఈ దారుణ హత్యలు మూడింతలైనాయి. నాయకులు జైళ్లల్లో వున్నారు. ప్రభుత్వం అన్ని కీలకాలు తనదగ్గరే వుంచుకున్నది. అయినా ఎక్కణ్నుంచి వస్తున్నారో ఎక్కడికి పోతున్నారో- యీ టెర్రరిస్టులు అంతు చిక్కకుండా వున్నది. "జలియన్‌వాలాబాగ్" మాదిరి దారుణ మారణకాండ జరగకపోతే- టెలివిషన్‌మీద ఎమ్.జె. అక్బర్ పంజాబ్ గవర్నర్‌తో చేసిన యింటర్వ్యూ ప్రసారం అయ్యేండేది. అది అయివుంటే కేంద్ర ప్రభుత్వం ఎంతైనా అభాసుపాలై వుండేది!

సైన్యం, పోలీసు బలగాలు, అంతులేని వేగులవారి బలగాలు కూడా వున్నా టెర్రరిస్టుల ఆగడాలు కొంచెం కూడా విరామం యివ్వడంలేదు- గవర్నమెంట్‌కి వున్న వార్తా సేకరణ, రహస్య సమాచార గ్రహణ యంత్రాంగంలోనే లోపమున్నదన్న- మాట!

## దూర్‌దర్శన్‌మీద ప్రదర్శన

దీనిమీద అందరికీ తెలిసింతర్వాత రాయకపోతేనే తప్పు! దూరదర్శన్ యివాళ 270 ట్రాన్స్‌మిటర్‌ల సాయంతో యించుమించు 75 శాతం ప్రజానీకానికి అందుతున్నది, 19 గంటలసేపు యిది రాజీవ్‌గాంధీకీ, పాన్‌మసాలాకీ, ప్రెషర్‌కుక్కర్‌లకీ ఫ్రిజ్‌డైర్‌లకీ అదేపనిగా పబ్లిసిటీ యిస్తుంది ! వార్తలమధ్యలో రాజీవ్‌గాంధీగారి దర్శనం అయినట్లు - నాటకాలు పాటలు ఆటల మధ్యలో ప్రకటనలు వస్తూంటాయి. అయితే చిన్న తేడా వుంది. ఆమధ్య మధ్యలో వచ్చే ప్రకటనల కోసం యిష్టమున్నా లేకపోయినా చాలా ఆట పాటలని "దర్శకులు" (అనగా ప్రేక్షకులు) చూస్తారు. - వార్తలు వినడం కోసం రాజీవ్‌గాంధీగారిని మధ్య మధ్యలో కట్టేయలేక భరిస్తారు - (టి.వి. లో స్విచ్ ఆఫ్ చేసి, తిరిగి ఆన్ చేస్తే బొమ్మ రావటానికి కొన్ని క్షణాలు పడుతుంది) - రేడియో గోల 24 గంటలూ వుంటుంది. అది వేరు. బాత్రూంలో స్నానం - టాయిలెట్‌లో కాలకృత్యాలు, వంటయింట్లో "వేపడాలు" చేస్తున్నప్పుడు - వివిధభారతి ఒక టైంపేసులాగ పని చేస్తుంది. కావున అందరూ టి.వి. లేని టైములో - మరో పనిలో వుండి కనీసం రేడియో ట్రేంగ్ ట్రేంగ్‌లు విందురు !

ప్రతిపక్షాలకే అన్యాయం జరిగిపోతున్నది అన్న సంగతి - వి.పి. సింగ్ నుంచి మన మాజీ ముఖ్యమంత్రి భవనం దాకా యిప్పుడే గుర్తించి - భయంకరమైన ప్రదర్శనలు యివ్వదల్చుకున్నారు. - రోడ్డుమీదపడ్డారు. టి.వి. డొక్కులు కాల్చి చీల్చి చెండాడారు! లాఠీలు ఝుళిపించబడ్డాయ్. అరెస్టులు హోరుమని సాగాయి. పత్రికల "హెడ్‌లైన్స్" నిండిపోయాయి. - రాత్రి టి.వి. వార్తలు ఆకాశ"వాణి" వార్తలు కూడా యథామాదిరిగా "రాజీవ్‌గాంధీగారి" భజనతో ముగిశాయి. - అంతేనా? కాదు దీనివల్ల ప్రతిపక్షాలకి ఎన్నికలముందు - ప్రజల నోళ్లల్లోపడి "సానుభూతి" దొరికింది! అసలు "పర్పసు" అనగా వుద్దేశం అదే - బడా నాయకులు ఢిల్లీలోను ఛోటా నాయకులు "పల్లె"లోను (బెజవాడపల్లెయేనా?) అరెస్ట్ అయ్యారు - యిది అంతా చూస్తున్నప్పుడు నాకు ఆంధ్రా యాజిటేషను దీన్నే తెలుగులో జైఆంధ్రా మూమెంట్ అంటారు - జ్ఞాపకం వచ్చింది. అప్పటికే టి.వి. లేదు. ఆకాశవాణిమీద పడ్డారు. - కుర్రాళ్లు - (అప్పటి కుర్రాళ్లల్లో యిప్పటి బి.జె.పి. నాయకుడు వెంకయ్యనాయుడు "ఆల్సో దేర్" అనుకుంటాను. యివాళ"ఆల్సోదేర్" అనకూడని నాయకుడయ్యాడు - అది వేరే) - కుర్రాళ్ల తల్లులూ పడ్డారు. - వాళ్ల టీచర్‌లూ పడ్డారు - దాన్నోరు కట్టేశారు. - తాళాలు పెట్టేశారు. అప్పుడు కీర్తిశేషుడు మహా కార్టూనిస్టు వ్యామెన్‌గారు వో కార్టూన్ వేశాడు ఆంధ్రపత్రికలో.... నిన్నటిదాకా "ఆకాశవాణి" "భా..." "భా..." మంటూ హోంర్డేస్తున్నట్లు - నేడేమో... అని దానిమూతి కట్టేసినట్లు - అది చాలా పవర్‌ఫుల్ ప్రదర్శన! - "బంద్" చేసి చూపించిన "జైఆంధ్రా" తడాఖా అది... అక్కడ ప్రజలు పాల్గొన్నారు. నాయకులూ వారి అనుయాయులు కారు - యిక్కడ ప్రతిపక్ష నాయకులు "ఆర్గనైజ్" చేశారు దీన్ని. అయినా లక్ష మంది అరెస్టు అయ్యారు దేశం మొత్తంమీద ! గొప్పే మరి - దీనివల్ల దూరదర్శన్‌లోను ఆకాశవాణిలోను మార్పు వస్తుందనుకోవడం పాజమ్మలు-కూడా చెయ్యరుకాని "కుఛ్‌తో కర్నా హైనా, క్యోంకి ఎలక్షన్స్ ఆ రహేంహైనా" ఎన్.టి.ఆర్. విశ్వామిత్ర షూటింగ్‌లో వున్నందున "డోంట్ డిస్టర్బ్‌హిమ్, ప్లీజ్" అన్నాడో ఫ్రెండు.




(30-6-'89)

బొమ్మలసీరియల్

# అసంప్రేక్ష్యకారిత్వము... పంచతంత్రము ...అయిదవ భాగము



























...రచన...
# నండూరి రామమోహనరావు
బొమ్మలు.. బాపు






























(ఇంకావుంది)

# సాహితీ పజిల్

## గళ్ళ నుడి కట్టు –12

### బహుమతులు



పాఠకులు అత్యంత ఉత్సాహంతో వందల సంఖ్యలో ఈ పోటీలో పాల్గొన్నారు. వారందరికీ మా అభినందనలు! సరైన సమాధానం ఈ సారి ఐదుగురు పంపగలిగారు. బహుమతి మొత్తం రు. 200/– లను ఈ ఐదుగురికి సమానంగా పంచగా ఒక్కొక్కరికి రు. 40/–లు చొప్పున వచ్చాయి. త్వరలో ఈ బహుమతులు నగదు రూపంలో వారికి పంపే ఏర్పాట్లు జరుగుతున్నాయి. ఒకరు ఎన్ని కూపన్‌లైనా పంపవచ్చును. కాని తెల్ల కాగితం మీద వ్రాసిన కూపన్‌లు చెల్లవు. పత్రికలో కూపన్‌నే నింపి పంపాలి– ఒకరికి ఒకసారికి ఒక బహుమతి కంటే ఎక్కువ రాదు.

–సం.

### సరైన జవాబులు పంపిన వారి పేర్లు

యల్లాప్రగడ శ్రీ శ్రీ (గిద్దలూరు), టి. జగన్మోహనరావు (విజయవాడ), బి. పుష్పరాణి (నంద్యాల), పి. శీతారామ్ (కోరుకొండ), పి.వి. రామనాథ్ (గుంటూరు).

### సరియైన జవాబులు

**నిలువు**

1. ఉసిరి
2. లంఘనం
3. కృపుడు
4. ముద్గరం
5. విభీషణుడు
7. దుక్కి
9. భగీరథుడు
12. నీరు
14. జీరము
15. వరద
16. సరము
17. గోపిక

**అడ్డం**

1. ఉత్పలం
3. కృతము
5. విరి
6. నందుడు
8. రంభ
10. షట్పదము
11. పరంపర
13. డుబీ
15. వరున
17. గోడు
18. ముగుద
19. మరక

---

సాహితీ పజిల్ — గెల్చుకోండి రు.200/-

## గళ్ళ నుడి కట్టు – 14

### ఆధారాలు

**నిలువు**

1. సప్తవ్యసనాలలో ధర్మరాజు కిష్టమయినది
3. ఆరుద్ర-మవ్వే వేమ
4. భారత రణానికి మూలం ఈమె అవమానం
8. ఇవి వుంటేనే ఆవకాయ
9. వంశమర్యాదను కారణాలుచూచి వెదకండి
10. రాశికి ఒక అక్షరం చేరిస్తే సముద్రం
11. వ్యవహారిక భాషను తెచ్చిన పిడుగు
14. —లందు వైవాహికములందుప్రాణవిత్తమాన భంగమందు అబద్ధంచెప్పవచ్చు.
15. నానారుచిరార్థసూక్తినిధిఆదికవి
17. నాగమాత

**అడ్డం**

2. ఇకారాన్ని ఇలా అంటారు.
5. దీనికిదే ప్రమాణం అని నమ్మితే ఆస్తికులు
6. మనిషిలా, దీనికి పాదాలు-కాపీ పద్యం
7. వాడికి ముందుఅక్షరంచేర్చండిసుగంధద్రవ్యం
12. వరుణ అపి మధ్య
13. సుమతీ శతకంలో మొదటి పద్యంలో మొదటిమాట దైవం
16. తెనుగు భారతంలో మొదటి పద్యం శ్రీవాణీ తరువాత
18. అన్ని జీవరాసులకు ఇది మూలం
19. ఇది శ్రేష్ఠ వాచకం
20. ప్రథమ కలశంలో ఇది పడితే సామెత

ఆధారాలున్నాయి. నుడికట్టు గళ్ళు నింపండి! ఈ కూపన్ కత్తిరించి మీ చిరునామా రాసి పంపండి! ఆల్ కరెక్ట్ సొల్యూషన్ పంపినవారికి రు. 200/– లు బహుమతి లభిస్తుంది– ఒకరికన్నా ఎక్కువమంది కరెక్టు ఆన్సర్‌లు పంపితే వారికి బహుమతి మొత్తం పంచడం జరుగుతుంది. తుది నిర్ణయం సంపాదకునిదే!

– సం.

## గడువు తేదీ : 12-7-'89



కూర్పు : పింగళి వి. కృష్ణారావు

**ఆంధ్రసచిత్రవారపత్రిక**

పంపిన వారిపేరు : ..............................

పూర్తి చిరునామా : ..............................

..............................

.............................. పిన్‌కోడ్ : ..........